50

శ్రీరస్తు    శ్రీ సాంబసదాశివపరబ్రహ్మణేనమః    శుభమస్తు

# మహాన్యాసపూర్వక

# సశాస్త్రీయరుద్రాఽభిషేకవిధి

అమూల్య ధర్మరత్నహారతరళాయమాన 'రుద్రాఽభిషేక ధర్మదీపికా' విరాజితము, అనన్యసామాన్య ప్రమాణగ్రంథకల్ప పాదప సంజాత మంత్రతంత్ర క్రియా సుమాలాంకృతము, ప్రత్యక్షఫలప్రద 'పాశుపతప్రకరణ' సహితము, అసదృశ విపుల 'రుద్రాఽర్చనావిధి' విభూషితము, సర్వజనపరిజ్ఞానదర్పణాయమానాంధ్ర భావార్థ విలసితము, స్వరసమలంకృతము.

"సాంగత్రివేదాచార్య" "వేదార్థవిజ్ఞ" "ధర్మశాస్త్రవిజ్ఞ"
త్యాద్యనేక బిరుదాలంకృతులు, పూజ్యపాదులు

**శ్రీ తంగిరాల బాలగంగాధరశర్మగారిచే**

సమ్యక్పరిష్కృతము.

"పండిత" "హరికథకావతంస"

**కూచి వీరభద్రశర్మచే**

సద్గ్రథితము.

సనాతన ధర్మప్రకాశక గ్రంథమాలా ప్రథమకుసుమము :-

ద్వితీయ ముద్రణము

ప్రభవ శ్రావణమ్



ఇట్లు,
ప్రకాశకులు

సనాతన ధర్మప్రకాశక గ్రంథమాలా
కూచి పర్వతవర్ధనమ్మ
W/o కూచి వీరభద్రశర్మ.
అమలాపురం
తూ॥గో॥జిల్లా, (ఆంధ్రప్రదేశ్)



మా గ్రంథమాలా సహాయార్థమ్
ఏతద్గ్రంథమూల్యమ్ :- 40/-

ఈ గ్రంథము వలయువారు ప్రకాశకులకువ్రాసిన బడయగలరు.

# అనుబంధ పంచకము

1. స్వాతివానబిందువులు ముత్యపుచిప్పలలోబడిన ముత్యములుగా మారును. మురికినీటికాలువలోబడిన మురికినీటిలో కలసిపోవును. అట్లే ఏగ్రంథస్థ విషయములైననూ సజ్జన హృదయములలోబడి సద్విషయములుగానూ, దుర్జన హృదయములలోబడి దుర్విషయములుగనూ అగును.

2. ఏగ్రంథమైననూ సాంతముగాచూచి ఆకళింపు చేసికొనిన సుస్వభావులకాగ్రంథమందు చెడ్డవిషయ మొక్కటియునూ కానరాదు. గాన ప్రతీగ్రంథమూ ప్రతివారికినీ సంతోషము నొసగును.

3. పంటకాలువనుండి ప్రవహించిన నీటిచేమొలచి ఏపుగా పెరుగుచున్న సస్యము సముద్రజలప్రవాహమునెట్లు భరింపలేదో అట్లే కించిజ్ఞునిచే చేయబడిన గ్రంథము న్యాయదృష్టిలేని కుశాగ్రబుద్ధులగు పండితుల విమర్శలకు నిలువలేదు.

4. దొంగలబెడద మిక్కుటముగనున్నదని తెలిసియు ధనవంతుడు బంగారునగలను చేయించుకొనకమానడు. అటులనే కువిమర్శకుల భయమున్ననని తెలిసియూ ప్రజ్ఞగలవారు గ్రంథమునుచేయకమానడు.

5. ప్రభువుల దయాదృష్టి దేశమునగల పండితులందరిపైననూ ప్రసరించుట చాలకష్టము. ధనవంతుల దయాదృష్టి తమ్మాశ్రయించువారియందుండుట సహజము. పండితమ్మన్యులు పండితుల ఎదుట సన్మానింపబడుచుందురు. పవిత్రగ్రంథరచన చేయగల పండితులకు తగిన ప్రోత్సాహము లభ్యముకాకుండును. ఇది కలిపురుషుని ప్రభావము ఇందెవ్వరునూ నిందార్హులుకారు.

# -: అంకితము :-

శ్లో॥ మద్గృహే దివ్యపీఠస్థం మహాదేవం మహేశ్వరం ।
వన్దే స్థూలావృతం సూక్ష్మం రాజితం లిఙ్గరూపిణమ్ ॥

పవిత్ర మంత్ర తంత్ర క్రియా కలాపయుక్తమైన ఈయుద్గ్రంథమును మీకందించుటకు కారణభూతులైన దయామయులు

**శ్రీ దుర్గామహాదేవి శ్రీమన్మహాదేవుల**

దివ్యచరణ సరోజములకు భక్తిప్రపత్తులతో

వీరభద్రశర్మ, ధర్మపత్ని వర్ధనమ్మ.

## -: ఇష్టదేవతావందనాదికము :-

శ్లో॥ విఘ్నేశ విధిమార్తాణ్డ చన్ద్రేన్ద్రోపేన్ద్ర వన్దిత ।
నమో గణపతే తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే ॥
దుర్గమాఽపార సంసారమహారణ్య కుఠారికామ్ ।
అపవర్గప్రదాంభర్గహితాం దుర్గాముపాస్మహే ॥
పూజ్యౌ జన్మప్రదాతారౌ పితరౌ శివమానసౌ ।
మహాలక్ష్మీ సత్యనారాయణౌ వన్దేహ మన్వహమ్ ॥
కూచ్యన్వవాయ పాథోధి శీతాంశుమనఘం గురుమ్ ।
వేదశాస్త్రార్థతత్త్వజ్ఞం మన్త్రశాస్త్రజ్ఞ ముత్తమమ్ ॥
దయాన్వితం సత్యనారాయణశాస్త్రిణ మన్వహమ్ ।
సదా మత్పితరం వన్దే సర్వధర్మ విదగ్రణీమ్ ॥
పెద్దింట్యన్వయ వార్ధీన్దుమ్ వరం హరికథాగురుమ్ ।
నమామ్యహమ్ సూర్యనారాయణదీక్షిత మన్వహమ్ ॥

# విషయసూచిక

## రుద్రాఽభిషేక ధర్మదీపిక

## మహాన్యాసపూర్వక సశాస్త్రీయ రుద్రాభిషేక విధి

## రుద్రాఽర్చనా విధి.

సూచన రుద్రాభిషేకము చేయదలచినవారు వేకువజామున లేచి దంతధావన ప్రాతస్స్నాన సంధ్యాదినిత్యకృత్యముల నాచరించి యీశ్వరుని స్మరించి "శంకరా! ఈనాడు మీకు నేను యథాశక్తిగా నభిషేకార్చనాదులను జరిపింతును. కావున నేనుజేయు నభిషేక పూజాదులను స్వీకరించి నన్ను గృతార్థుని జేయవలయునని ప్రార్థించుచున్నా" నని శివుని నమస్కార పూర్వకముగా బ్రార్థించి సమర్థులయిన బుత్విజులతోను: వలయు పూజా సామగ్రితోను దేవాలయమున బ్రవేశించి యీ గ్రంథమందలి "రుద్రాభిషేకధర్మదీపిక" యందు జెప్పబడిన ధర్మములను బాటించును. "సశాస్త్రీయ రుద్రాభిషేకవిధి" యందుఁ జెప్పబడిన ప్రకారము రుద్రునభిషేకించి "రుద్రార్చనావిధ్యుక్త" ప్రకారము రుద్రుని బూజింపవలెను. మఱియు వారివారికామ్యములననుసరించి పాశుపతప్రకరణమునందుఁ జెప్పఁబడిన విధానములతో అభిషేకమాచరింపవలయును:

58 వర్ణములు నిగమాగమోక్త రీతిని గూర్పబడి మహామంత్రములై మహాశక్తిసంపన్నములై జపితలకు సద్యఃఫలము నిచ్చుచున్నవి. గంధకము మున్నగు పదార్థములు సరియగు పాళ్ళలో గలిపినచో చక్కని బాణసంచాగా మారి నేత్రములకు శ్రోత్రములకు నానందము గలిగించును. అట్లే ఏమంత్రము పఠించుచు నేక్రియ నెట్లాచరింపవలెనో అట్లాచరించిననే సత్ఫలితము గలిగితీరును. ఏయేమంత్రతంత్రక్రియా కలాపము లెక్కడెక్కడ నుండినసత్ఫలము నిచ్చునో వాని సంపుటీకరణము ఈశ్వరానుగ్రహముచే నట్లేచేసి చాలమందిచే ననేకదేవాలయములలో ఈవిధానముగా సమర్థులైనబుత్విజుల సాహాయ్యముతో నభిషేకములు చేయించితిని. అభిషేకకర్తలు అభీష్టసిద్ధి వడసిరనుట అతిశయోక్తిగా భావింపకుందురుగాక.

పూజాసంభారముల నన్నింటినిశక్తివంచనలేకుండ శ్రద్ధతో సంపాదింపవలెను. మహాన్యాసపూర్వక పాశుపతవిధానాభిషేకార్చనలు నాల్గు గంటల కాలములో బూర్తియగును.

ఇందలి పాశుపతప్రకరణమునందలి పాశుపతములు, కామ్యములు, ప్రత్యక్షఫలప్రదములు.

రుద్రార్చనావిధియందు ఉపచారశ్లోకములు రచించి భావార్థమును వ్రాసితిని. ఈ గ్రంథములోని యన్ని సంస్కృత శ్లోకములకును, సూత్రములకును భావార్థములు వ్రాసితిని. అచ్చటచ్చట తెలుగు వివరణలు వ్రాసితిని. ఈ గ్రంథరాజము సమగ్రమనియు, ఉత్తమోత్తమకర్మగ్రంథమనియు, ప్రత్యక్ష ఫలప్రదమనియు మనదేశమునకు నూతనమనియు సుప్రసిద్ధ పండితులు శ్లాఘించిరి. మఱియు నీగ్రంథమునందు పువ్వుగుర్తు గల శ్లోకములు, భావార్థములు బాగుగా జదివి యాకళింపు చేసికొనవలయును. ఇంచుమించుగా శ్లోకముల కన్నిటికి ప్రమాణగ్రంథముల నుదాహరించితిని. అట్లుదాహరింపని శ్లోకములు శిష్టులు చెప్పినవని గ్రహించవలెను. ఈగుర్తులేని శ్లోకములు, సూత్రములు, మంత్రములు అభిషేక అర్చనాప్రయోగమందాయా సమయములలో పఠించవలసినవని తెలియవలెను.

కొందఱు తాము శాస్త్రీయముగా రుద్రాభిషేకాదుల జేయించుకొనదలచినను యోగ్యులైన బ్రాహ్మణులు ఋత్విజులుగా లభించుట లేదనియు నందువలన దాముచేయు నభిషేకాదులు ఫలప్రదములు కాజాలవేమోయనియు సందేహము వెలిబుచ్చుట జరుగుచున్నది. కాని అట్టి సందేహము నొందనక్కఱలేదు. యుగానుసారముగా ధర్మాచరణమున భేదము కాన్పించుననియు- వేదము, ధర్మశాస్త్రము, శిష్టాచారము మూడును ధర్మప్రమాణములనియు, యుగస్వరూపులయిన బ్రాహ్మణులను నిందింపరాదనియు, చాతుర్వర్ణ్యమునకు స్వస్వకులాచారముధర్మసంరక్షక మగుననియు గ్రిందనీయబడిన పరాశరశ్లోకములవలన దెలియనగును.

శ్లో॥ అన్యే కృతయుగే ధర్మాః త్రేతాయాం ద్వాపరేయుగే ।
అన్యేః కలౌయుగే నౄణాం యుగరూపానుసారతః ।
యుగే యుగేచయే ధర్మాః తత్ర తత్రచయే ద్విజాః
తేషాం నిందాన కర్తవ్యా యుగరూపాహి తే ద్విజాః ।
చతుర్ణామపి వర్ణానామాచారో ధర్మపాలకః ।
వేదోక్తః ప్రథమోధర్మో ధర్మశాస్త్రేషు చాపరః ।
శిష్టాచార స్తృతీయస్తు త్రివిధం ధర్మలక్షణమ్ ॥

ఇట్లు :
వీరభద్రశర్మ.

★



రచయిత: కూచి వీరభద్రశర్మ

వారి ధర్మపత్ని పర్వతవర్ధనమ్మ

శ్రీ సామ్బసదాశివాయనమః

# భూమిక

ధర్మార్ధకామమోక్షములను నాలుగు పురుషార్ధములలో ధర్మము మిగిలిన మూడు పురుషార్ధములకు సాధనము. ధర్మము వేదము చేతను వేదమూలములగు (వేదవిరుద్ధములు కాని) స్మృతులచేతను బోధించబడు నది. జైమిని సూ "చోదనా లక్షణోఽర్థో ధర్మః" 1-1-2 అని సూత్రించినారు. చోదన అనగా విధాయకవాక్యము "చోదనేతి క్రియాయాః ప్రవర్తకం వాక్యమ్" అని శబరస్వామి ఆసూత్రము లోనే చెప్పినారు. అనగా యాగము దానము మొదలగువాటిని చేయ వలయునని చెప్పువాక్యము. అట్టి వాక్యములచే బోధించబడునది ధర్మము.

శ్రుతిస్మృత్యుదితం ధర్మమనుతిష్ఠన్ హి మానవః
ఇహకీర్తిమవాప్నోతి ప్రేత్యచానుత్తమం సుఖమ్॥

మనుః స్మృ 2-9

అని మనువు చెప్పెను. వేదమందు స్మృతులయందు చెప్పబడిన ధర్మములను ఆచరించు పురుషుడు ఈలోకములో పరమోత్తమమగు కీర్తిని, పరలోకమందు పరమోత్కృష్టమగు సుఖమును పొందునని దీని యర్థము. ఈవచనముచేత కూడ వేదస్మృతులందు విధించబడినది ధర్మ మని సిద్ధించుచున్నది. శ్రుతులయందు ఎక్కువగా యజ్ఞములే చెప్ప బడినవి. వాటిని వేదశాస్త్రాధ్యయనము చేసినవారికికాని అధికారములేదు. అందు అట్టి అధికారము లేనివారికి ఉపయోగించునట్లు మహర్షులు స్మృతు లలో అనేక కర్మలు చెప్పినారు. అందు శివార్చన ఒకటి.

"ఐశ్వర్య మీశ్వరాదిచ్ఛేత్", "ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైతవాసనా" ఈ మొదలగు వాక్యములు ఈశ్వరారాధన

చేసినచో వారి ఇచ్ఛానుసారముగా సంపదలు మోక్షము కూడ పొందవచ్చునని చెప్పుచున్నవి. ఈ ఈశ్వరార్చనను బోధాయన మహర్షి విపులముగా చెప్పినారు అందులో ముఖ్యముగా నమకమును, చమకమును వినియోగించు పద్ధతిని దానిని వినియోగించుటకు అర్హతకొరకు మహాన్యాసమును కూడ చెప్పినారు.

"నారుద్రో రుద్ర మర్చయేత్"- అనగా రుద్రాంశ లేనివానికి రుద్రునర్చించుటకు అర్హతిలేదు. అందుచే మహాన్యాసము చెప్పబడినది. న్యాసమనగా తన అంగములయందు రుద్రుని ప్రవేశపెట్టుట. అందులకై చెప్పబడిన మంత్రములలో శివసంకల్పమను ఒక మంత్రమున్నది, వాని చివర ప్రతి మంత్రమందు "తన్మేమనశ్శివసంకల్పమస్తు" అనునది మకుటముగా నున్నది. ఆనామనస్సు శాంతించిన కోరికలు కలదై అగుగాక, అని దానియర్థము. నాకు ఏకోరిక ఉండకూడదని దాని తాత్పర్యము. ఆ అవస్థ వచ్చినప్పుడు జ్ఞానము కలుగుట తద్ద్వారా మోక్షము కలుగుట తటస్థించును.

నమకము అగ్నిచయనమను వేదోక్త కర్మయందు వినియోగమును వేదముచే "రుద్రోవా యేషయదగ్నిః" అను తైత్తిరీయసంహితలో 5 వ అష్టములోని నాల్గవ ప్రశ్నలోని రెండవ అనువాకములో చెప్పబడినది. రుద్రునకు శివమూర్తి, ఉగ్రమూర్తి అను రెండు స్వరూపములు గలవనియు వాటిలో ఉగ్రమూర్తి అధర్మాచరణ చేయువారిని గూర్చి పని చేయును కాబట్టి దాని సంహారముకొరకు (శివుని శాంతింపచేయుటకు) నమకముచే అభిషేకము చేయవలయుననియు చమకముచే వసోర్ధారా హోమమును చేసినచో శాంతస్వరూపుడు సంతోషించి ఫలమువిచ్చుననియు ఆ అష్టకములోనే ఏడిమిదవ ప్రశ్నలోని మూడవ అనువాకములో నున్నది. ఈ నమకము వేదములో పఠింపబడినట్లే వైదిక కర్మలో వినియోగించబడును. ఈ అభిషేకములో మహర్షులు బీజాక్షరముల సంపుటితోను, వేదమందున్న మన్త్రములతోను సంపుటిచేసి కొన్ని విధానములను చెప్పియుండిరి. అట్లు చేసినచో శీఘ్రములో ఎక్కువ ఫలమును పొందవచ్చునని శాస్త్రము చెప్పుచున్నది,

ఇట్లనేకమంది మహర్షులు చేసి ఫలమును పొందిరి. అర్జునుడు శివుని వలన పాశుపతాస్త్రమును పొంది భారతయుద్ధములోను, మరియొకప్పుడును అనేకమంది మహావీరులను జయించినట్లు పురాణాదులలో వ్రాసిద్ధి.

పాశుపత మనగా బీజాక్షరములతోకూడిన నమకమే। దానిని అనేక బీజాక్షర సంయోగములచే అనేక ఫలములను పొందవచ్చును. అట్టి విధానములు మేరుతంత్రము మొదలగు తంత్ర గ్రంథములలో కలవు.

వాటిని ఈ "సశాస్త్రీయ రుద్రాభిషేకవిధి" అను గ్రంథము నందు బ్రహ్మశ్రీ కూచి వీరభద్రశర్మగారు అనేకమంది పెద్దలవద్ద సంగ్రహించి కూర్చిరి. ఈగ్రంథమందు పూజకు సంబంధించిన ధర్మ శాస్త్రమునుకూడ సమ్మేళన చేసిరి. దీనిలో 1. అమృతమహాపాశుపత మంత్రము (అనగా దీనిని యథావిధిగా జపించినచో మృత్యువునుకూడ జయించవచ్చును. అట్టివారు అనేకమంది ఋషులు కలరు). 2 మహా పాశుపత మంత్రము. (ఇదికూడ పై విధముగానే ఫలము నిచ్చును). 3. త్రిశూల పాశుపతము ఇదికూడ మృత్యువును పోగొట్టును. మార్కండేయుడు ఈ పాశుపతమును జపించి మృత్యువును దాటి చిరంజీవి అయినాడు. 4 అఘోరపాశుపతము (ఇదియు మృత్యువును జయించును). 5 నవగ్రహ పాశుపతము (దీనివలన నవగ్రహను గ్రహము కల్గును). 6 కౌబేర పాశుపతము (ఇది ఐశ్వర్యము నిచ్చును). 7. మన్యు పాశుపతము (దీనిని జపించిన శత్రుసంహార మగును) 8. కన్యాపాశుపతము (దీని జపమువలన తనకనుకూలమగు కన్యను వివాహమాడవచ్చును). 9. ఋణవిమోచన పాశుపతము (దీని జపమువలన ఋణబాధ తొలగును). అను తొమ్మిది పాశుపత విధానములను కూర్చిరి.

వీనిలో ఋణవిమోచన పాశుపతము ప్రస్తుతకాలములో చాల మందికి అవసరము ఋణము రెండు విధములు 1. లౌకిక ఋణము 2. వైదిక ఋణము. లౌకిక ఋణములు పరులవద్ద ధన ధాన్యాదులను తీసికొని వానిని తీర్చకుండుట.

వైదిక ఋణము మరల 1. ఋషి ఋణము 2. దేవఋణము 3. పితౄణము అని మూడు విధములు. ఈ విషయము తైత్తిరీయ సంహిత 5వ అష్టకములోని 3వ ప్రశ్నలోని 10వ అనువాకములో "జాయ మానోవై బ్రాహ్మణస్త్రి భిర్ౠణవాజాయతే బ్రహ్మచర్యేణ ఋషిభ్యోయ జ్ఞేనదేవేభ్యః। ప్రజయా పితృభ్య ఏషవా అనృణోయ పుత్రోయ జ్వా బ్రహ్మచారి వాసీ" అని చెప్పబడినది. అధికారముగల (ఉపనీతుడైన) ప్రతి ద్విజునకు పైన చూపబడిన మూడు ఋణములు ఉండును. ఋషులు తపస్సుచేసి వేదములను పరమేశ్వరానుగ్రహమువలన సాక్షాత్కరింప చేసికొనిరి వారు అవేదములను మనుష్యుల కందజేసిరి. వారు శ్రమపడి సంపాదించిన వేదములను త్యాగముచేయక అధ్యయనము చేసినచో వారికి తృప్తికలుగును. అందుచే ఋషిఋణము పోవును. దేవతలు వర్షమును కురిపించి మనకు అన్నము కలుగజేసినందున వారుమనకిచ్చిన దానిని వారికి కొంతయయినను ఇవ్వనిచో వారికి ఋణపడి యుందుము. దీనిని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో (తైర్దత్తాన ప్రదాయై భ్యోయో భుజ్క్తేస్తేన ఏవసః) 3అ 12 శ్లో.

అని చెప్పినారు అదేవతల చేత ఇవ్వబడిన ద్రవ్యమును వారికి ఇవ్వక ఎవడు భుజించునో వాడు దొంగయే అని దానికర్థము. కాబట్టి యజ్ఞమును చేసి దేవఋణమును పోగొట్టుకొనవచ్చును.

ఆయుః ప్రజాం ధనం విద్యాం స్వర్గం మోక్షం సుఖానిచ।
ప్రయచ్ఛంతి తథా రాజ్యం ప్రీత్యా నృణాం పితా మహాః

అనుస్మృతిచే పితృదేవతలు మనకు ఆయుర్దాయమును, విశేషించి సంతానమును, ధనమును, విద్యను, స్వర్గమును, మోక్షమును, సుఖములను,

రాజ్యమును మనచే ఇవ్వబడిన శ్రాద్ధద్రవ్యముచే తృప్తిని పొంది ఇచ్చు చున్నారు. కాబట్టి మనసంతానముచే వారికి పిండప్రాప్తి కలుగును గాన సంతానమును బడసి పితరుల ఋణమును పోగొట్టుకొనవలయును. కనుకనే

"ఏష్టవ్యాబహవః పుత్రాయద్యేకోపిగయాం వ్రజేత్"

అని స్మృతిచెప్పబడినది. అనేకమంది సంతానము కనినచో ఒక్కరైనను గయలో పిండప్రదానము చేయునని అర్థము. ఎవడు బ్రహ్మచర్యమును చేసి వేదాధ్యయనమును చేయునో, యజ్ఞములను చేయునో సంతానమును కనునో వాడు ఋణము లేనివాడు అని జాయమానోవై అను శృతికి అర్థము.

ప్రకృతమున లోకములో ఋషిఋణము, దేవఋణమును పోగొట్టుకొన్నవారు ఒక వందమంది కలరా? లేరా? యని యనుకొన వచ్చును. పితౄణమును పోగొట్టుకొన్నవారు పూర్వము ఎక్కువగా నుండిరి. ప్రస్తుతకాలములో సంతాననిరోధముకొరకు సంతాననాడీభేద నను చేయించుకొని అంతకుముందున్న సంతానము కోల్పోయినవారికి, అసలు సంతానమే కలగనివారికి పితౄణము పోవుట కవకాశములేదు. కనుక అధికసంఖ్యాకులకు పై ఋణములు సంభవించుచున్నవి. వాటి నివృత్తికొరకు తప్పక ఈ ఋణవిమోచన పాశుపతమును అనుష్ఠించి ఋణ త్రయములనుండి, లౌకిక ఋణమునుండి కూడ విముక్తులు కావచ్చును.

ఈ ఋణ విమోచన పాశుపతములో 'అనృణా అస్మిన్' అను మంత్రము బీజాక్షరములవలెనే వెనుకముందులు కూర్చబడినది, దీని యర్థము- ఈలోకమందు, పరలోకమందు తృతీయ (మూడవ) లోక మందు ఋణరహితులము అగుదుముగాక! అట్లు ఋణరహితులమై దేవతలు, పితృదేవతలు ఏమార్గమున సంచరింతురో ఆమార్గములయందు సంచరించుచు నివసింతుముగాక అని, ఈ ఋక్కు తైత్తిరీయ బ్రాహ్మ ణములోని మూడవ అష్టములోని ఏడవప్రశ్న (అచ్ఛిద్రము) లోని 9వ

అనువాకములోను; తైత్తిరీయారణ్యకములోని రెండవ ప్రశ్న (స్వాధ్యాయబ్రాహ్మణము)లోని 15వ అనువాకములోను - అధర్వ(ణ) వేదములోని అరవకాండలోని నూటపదిహేనవ సూక్తములోను మూడుచోట్ల కలదు.

సాయనాచార్యులవారు తై॥ బ్రాహ్మణములో అస్మిన్ అను పదమునకు వర్తమాన మనుష్యజన్మయందు యనియు; పరస్మిన్ అను పదమునకు రాబోవు మనుష్యజన్మయనియు, తృతీయలోకే అను పదమునకు స్వర్గలోకమందు రాబోవు జన్మయనియు వ్యాఖ్యానించిరి. వారే తై॥ అరణ్యకములో అస్మిన్ భూలోకే పరస్మిన్ అన్తరిక్షే తృతీయే లోకే ద్యులోకే అని వ్యాఖ్యానించిరి. అన్తరిక్షమనగా పితృలోకమనియే చెప్పుకొనవచ్చును. కొంతదూరము వెళ్ళి అక్కడే "ఋషీణామృణం బ్రహ్మయజ్ఞేనాపోద్యతే। దేవపితృకార్యయోరసమర్ధస్య తదుభయవిషయ మప్యృణమనేనైవాపోద్యతే" అని వ్రాయుటచే అన్తరిక్షబ్ధమునకు పితృలోకము అని చెప్పుకొనవచ్చును. అధర్వణవేదములోకూడ వారే అస్మిన్ భూలోకే అని వ్రాసి తరువాత "ఋణమత్ర లౌకికం వైదికంచ పరిగృహ్యతే। లౌకికంతావత్ ఉత్తమర్ణాద్గృహీతం హిరణ్యధాన్యాదికం ప్రసిద్ధమ్। వైదికంతు॥ జాయమానోవై బ్రాహ్మణస్త్రిభి ర్ఋణవా జాయతే బ్రహ్మచర్యేణ ర్షిభ్యో, యజ్ఞెన దేవేభ్యః ప్రజయాపితృభ్యః। ఇతి తేన సర్వేణ ఋణేన రహితాఃస్యామ। భవేమ। పరస్మిన్లోకే స్వర్గాదౌ ఏతద్దేహ పరిత్యాగేన దివ్యశరీర పరిగ్రహేణ సుకృతఫల భోగస్థానేపి అనృణాః స్యామ। ఋణాదాన నిమిత్తో భోగ ప్రతిబన్ధస్తత్రాపిమాభూదిత్యర్థః। తృతీయలోకే స్వర్గాదప్యుత్కృష్టే నాకపృష్ఠాదావయం అనృణాభవేమ॥ అని వ్యాఖ్యా

వించిరి. అనగా అస్మిన్ అనుదానికి భూలోకమందు అని చెప్పిరి. ఋణ శబ్దమునకు ఒకరివద్ద బదులుపుచ్చుకొన్న ద్రవ్య ధాన్యాదులని ఒక అర్థము చెప్పి, వైదికఋణము అని ఒక అర్థమును చెప్పిరి. దానికి ప్రమాణముగా "జాయమానోవై" అను శృతిని చూపిరి. దీని అర్థమును నేను వెనుక వ్రాసినదే. పరస్మిన్ అనుదానికి స్వర్గలోకమని అర్థమును చెప్పి తృతీయలోకే అను పదములకు స్వర్గలోకముకంటె పైనున్న జనోలోకము మొదలు సత్యలోకము వరకు నున్న లోకము అని అర్థము చెప్పినారు. అనగా ఆలోకములు ఋణవంతుడు పొందనేరడు. ఈ లోకములోనే ఈజన్మయందే ఈ మంత్రజపమువలన ఋణరహితుడవై దేవలోకమునుగాని, పైలోకములనుగాని పొందగలను. అని తాత్పర్యము.

బృహదారణ్యకములో 1వ అధ్యాయములోని పంచమ బ్రాహ్మణములోని 16వ విభాగములో "అథత్రయోవావలోకాః మనుష్యలోకః పితృలోకో దేవలోక ఇది। సోయం మనుష్యలోకః పుత్రేణైవజయ్యోనాన్యేన కర్మణా కర్మణాపితృలోకః విద్యయా దేవలోకః" అనిచెప్పబడినది. 3లోకములు. 1. మనుష్యలోకము 2. పితృలోకము 3. దేవలోకము. వీటిలో మనుష్యలోకము పుత్రునిచే జయించదగినది. అనగా పుత్రుని వలన సుఖమును పొందవచ్చును. కర్మలచేపితృలోక సుఖమును, జ్ఞానసహిత కర్మలచేత దేవలోక సుఖమును పొందవచ్చును. అని దీనికర్థము. జాయమానోవై బ్రాహ్మణః అను శృతితో సమానార్థముకలదే ఈ బృహదారణ్యకశృతి. కించిద్భేదమున్నను దీనిని కూడ అనృణా అస్మిన్ అనుదానికి ఉదాహరణముగా తీసుకొనవచ్చును. అంతులో ఋషి ఋణము విశేషము.

ఇన్ని అర్థములను చెప్పుట ఒకేమంత్రమునకు ఒకరే వ్యాఖ్యానమును చేయుట విరోధముకాదా యని శంకించవచ్చును. కాని శంకర భగవత్పాదులు, విద్యారణ్యస్వాములవారు (సాయనాచార్యులు) మొదలగువారు ఒకేమంత్రమునకు వేరువేరు స్థలములలో ప్రకరణానుసారముగా వ్యాఖ్యానము చేయుట పరిపాటైయున్నది. కాబట్టి అందరకు

అవసరమైయుండునని నేను అథర్వణవేద భాష్యములోని అర్థమును అనుసరించి వ్రాసినాను. కాబట్టి ఈమంత్రసంపుటి చేసి అనుష్ఠానమును చేసిన పైనచూపిన అన్ని ఋణములనుండి విముక్తిని పొందవచ్చును.

ఈశర్మగారు సంగీతసాహిత్యములతోకూడిన స్మార్తజ్ఞులు. కనుకనేవీటిని ఇట్లు సంకలనము చేయగలిగిరి అందరకు అందుబాటులోలేని కొన్ని పూజాధర్మములనుకూడ ఇందులోకూర్చిరి. ప్రమాణశ్లోకములకు అర్థమును కూడ స్పష్టముగ వ్రాసిరి. ఒకటిరెండుచోట్ల ప్రమాదముచే కొద్ది అంశమును విస్మరించిరి. రుద్రాభిషేక ధర్మదీపికలో 16వ పేజీలోని "యానైర్వా పాదుకాభిర్వా" అను శ్లోకములకు అర్థమును వ్రాయుచు "అకాలే దర్శనంతథా" అనుదానికి అర్థమును వ్రాయుటను విస్మరించిరి. మధ్యాహ్నము, అర్ధరాత్రి వీట్లయందు దర్శనమును చేయకూడదు. (ఈకాలములయందు పూజాదులు జరిగినచో చూడవచ్చును) అని దానియర్థము. 2 సశాస్త్రీయ రుద్రాభిషేకవిధి 3వ పేజీలో "సువాసితాంబు సంపూర్ణం సవ్యేకుంభం సుశోభనమ్" అనుచోట జలకలశముకూడ కుడివైపుననే యుంచవలయును అని వ్రాసిరి. "సవ్యే" అనుదానికి ఎడమవైపు అని అర్థము. అమరకోశములో వామంశరీరం సవ్యం స్యాత్॥ 3 కాం। విశేష్యనిఘ్నవర్గ॥ 84శ్లో॥ అని యున్నది. సవ్యమనగా శరీరముయొక్క ఎడమభాగమని దీని యర్థము. అందుచే ఎడమభాగమున కలశం ఉంచవలయుననిసిద్ధము- ఐతే, "సవ్యం వామేతు దక్షిణే" అని అజయనిఘంటునందును, "సవ్యంతు దక్షిణే వామేచ ప్రతికూలేచ" అని విశ్వనిఘంటు నందును ఉన్నది. సవ్యశబ్దమునకు దక్షిణము, ఎడమ రెండు అర్థములు అని వీటి అర్థము. అందుచేత దక్షిణభాగమందుంచవచ్చు ననవచ్చును. కాని సవ్యశబ్దమునకు కొన్ని నిఘంటులలో రెండర్థములున్నను అమరకోశములో ఎడమభాగమనియే యున్నది. అది సర్వజన గ్రాహ్యముగా నున్నది. పైశ్లోకములలో ముందుగా "స్థాపయేద్దక్షిణేభాగే పూజా

ద్రవ్యాణిచాత్మనః" అని పూజా ద్రవ్యములను దక్షిణపార్శ్వమం దుంచమని చెప్పిరి. తర్వాత 'సవ్యేకుంభం' అని చెప్పుటచే దక్షిణము నకు ప్రతికూలమగు ఎడమ పార్శ్వమనియే చెప్పవలెను. అట్లు కానిచో 'స్థాపయే ద్దక్షిణేభాగే' అనుదానిచేతనే అన్ని ద్రవ్యములను దక్షిణభాగ మందే యుంచమని చెప్పినప్పుడు కుంభమునకు వేరుగా చెప్పుటవ్యర్థము. కాబట్టి ఎడమభాగమందుంచుటయే ధర్మము. దీనిలోనే నాల్గవ పేజీలో "శృంగయోర్వామహస్తస్య తర్జన్యంగుష్టకే న్యసేత్ । అండం సవ్యేనచ స్పృష్ట్వాశృంగ మధ్యేశివం యజేత్"। అని వ్రాసినారు. ఇక్కడ శృంగములయందు ఎడమచేతియొక్క బొటన వ్రేలుని చూపుడు వ్రేలుని ఉంచి అని చెప్పుటచే 'అండం సవ్యేనచ' అనుచోట సవ్య శబ్దమునకు దక్షిణ (కుడి) హస్తము అనియే అర్థము ఇట్లు రెండు శబ్దములను చెప్పినచో ఎడమభాగమును చెప్పు శబ్దమునుచ్చరించి తరు వాత సవ్యశబ్దమును చెప్పినచో దానికి దక్షిణభాగమనియు ముందు దక్షిణభాగమును చెప్పుశబ్దమునుచ్చరించి తరువాత సవ్యశబ్దమును చెప్పి నచో దానికి ఎడమభాగము అనియు అర్థమును చెప్పుకొనవలయును. ఇట్టి స్థలములయందే అజయనిఘంటును, విశ్వనిఘంటును గ్రహించవలెను. కేవలము సవ్యశబ్దమును వాడినచోట "సవ్యం జానావ్యాచ్య" అపస్తంబ శ్రౌత సూ 1-9-1. సవ్యేన పాణినాహో తృచమునమాచ దీత తస్యారత్నినా తస్యోరోర్వసన మపోచ్ఛాద్య" అశ్వలాయనశ్రౌత సూత్రం 1-5-6 మొదలగుచోట సవ్యశబ్దమునకు ఎడమది అనియే అర్థము. కాబట్టి పై శ్లోకములోని సవ్యశబ్దమునకు ఎడమపార్శ్వమనియే అర్థము. కనుకనే స॥ రుద్రాభిషేకవిధి 125 పేజీలో 'శంభోర్దక్షిణ పార్శ్వస్థ జలకుంభం ప్రపూజయేత్' అను వచనము కుదురును. దేవునకు (శంభునకు) దక్షిణపార్శ్వమందున్న జలకుంభమును పూజ చేయుము అని వానియర్థము. మనము దేవునకభిముఖముగానుండి పూజా దులను చేయవలయును. అప్పుడు దేవునకు దక్షిణభాగము మనకు ఎడమ

భాగమగునుగదా. అప్పుడుకూడ సవ్యశబ్దమునకు ఎడమభాగమనియర్థము చెప్పినప్పుడే ఈశ్లోకము కుదురును. లేనిచో ఈశ్లోకమునకు 3వ పేజీలో "సవ్యేకుమ్భంసుశోభసమ్" అనుదానికి విరోధమువచ్చును. ఆవిరోధ పరిహారమునకుకూడ సవ్యశబ్దమునకు ఎడమభాగమనియే అర్థమునుచెప్ప వలయును. ఆచమనముచేయు కలశ ఇంకొకటి. అదికుడివైపుననే ఉండ వలయును. మహాన్యాసములో 98వ పేజీలో 'ఆశుశ్శిశానః' అను అప్రతి రథ సూక్త బ్రాహ్మణమును కొంతమంది 'అసురానజయన్' అను పంచా శత్తు (పనస) మొదటినుండియే చెప్పుచున్నారు. కాని దానిని 'దేవాసురాస్సంయత్తా ఆసన్నై దేవాతదప్రతిరథమ పశ్యన్తే నవై తేఽప్రతి' అనుపూర్వభాగమునుండి చెప్పవలెను. అట్లే శర్మ గారు కూర్చిరి. ఇదిచాల సంతోషకరమైనది. చివరమాత్రము 'విరాజ్యే వాన్నాద్యే ప్రతితిష్ఠతి' అంతవరకు చాలును. ఆసదివవా అంతరిక్షం అనునది ఇంకొకవిధి. అది అవసరములేదు.

"శివసంకల్పగ్ం హృదయం పురుషసూక్తగ్ంశిర ఉత్తర నారాయణగ్ం శిఖాఽప్రతిరథకవచగ్ం శతరుద్రీయ మస్త్రమ్!" అని బోధాయనసూత్రము. ఇక్కడ సర్వజనులు 'త్వమగ్నే త్వమగ్నే శతరుద్రీయ మిత్యస్త్రాయఫట్' అనిచెప్పి "త్వమగ్నే రుద్రో అసురః అను రెండు అనువాకములనే చెప్పుచున్నారు. బోధాయన మహర్షి శత రుద్రీయమును మాత్రమే చెప్పినారు. "అధికంతు ప్రవిష్టం నతద్ధానాయ" అనున్యాయముచే త్వమగ్నే అను రెండనువాకములు మహార్ణవము మొదలగు గ్రంథములలో ఉండుటచే వాటినిగూడ చెప్పుచు బోధాయనులు చెప్పిన నమకమును తప్పక చెప్పవలెను. ఇక్కడ ఇంకొక శంక తోచవచ్చును. తైత్తిరీయ సంహిత 3వ అష్టకములో

'త్వమగ్నె బృహద్వయః' అను అనువాకము గలదు. రెండవ త్వమగ్నె అనువది కావచ్చునని దాని నివృత్తి కొరకు "శతరుద్రీయమితి" అని చెప్పినారు. అవి అన్నచో అట్లైన మొదటి త్వమగ్నె అనుదానికి "త్వమగ్నె బృహత్" అనుదానిని గ్రహించుటలో బాధక మేమున్నది? ప్రథమాతిక్రమణములో కారణము లేనందున దానిని రుద్రదేవతా ప్రతిపాదకమైనదగుటచే బ్రాహ్మణములోనిదానిని గ్రహించెదమన్నచో అది మాకును సమ్మతమే. శతరుద్రీయము నేరుగా నుండుటచే దాని నెట్లైనను పరిగ్రహించవలసియే యున్నది. కాబట్టి బోధాయనమహర్షి శతరుద్రీయమునే గ్రహించుటచేతను ప్రయోగములో త్వమగ్నేత్వమగ్నే శతరుద్రీయమ్॥ అని ఉండుటచే నమకమును తప్పక చెప్పవలయును.

ఇచ్చట శ్రీ శర్మగారు చక్కగా నిరూపించి చూపినారు. ఇది అందరూ తెలుసుకొనవలసిన ముఖ్యవిషయము.

"హిరణ్యగర్భోఽఽయర్గ ప్రాణతో, బ్రహ్మజ జ్ఞానం, మహీద్యౌ, రుపశ్వాసయా, గ్నెనయ, యాతెఅగ్న, ఇమంయమ్రప స్తర మిత్యష్టాఙ్గం ప్రణమ్య" అని బోధాయన సూత్రము. దీనిటిప్పణిలో "హిరణ్యగర్భ ఇత్యాదీనష్టౌ మన్త్రానుక్త్వా సాష్టాఙ్గం ప్రణామేత్॥ సాష్టాఙ్గ ప్రణామశ్చ శ్రీమచ్ఛఙ్కర భగవత్పాదైః ప్రపఞ్చసారే ఉక్తః। దోర్భ్యాం పదాభ్యాంజానుభ్యామురసా శిరసాదృశా। మనసావచసాచేతి ప్రణామోష్టాఙ్గఈరితః ।ఇతి। అధునికాస్తు" ఉరసా శిరసా దృష్ట్యా మనసావచసా తథా। పద్భ్యాంకరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామోఽష్టాఙ్గ ఉచ్యతే॥ ఇతి శ్లోకానుసారేణ ఏకైకస్య మన్త్రస్యాన్తే ఏకైకేనాఙ్గేన తృతీయాన్తేన దేవం నమామీతిపఠన్తి। తత్రతచమూలం గవేష

ణీయమ్। అని యున్నది. "హిరణ్యగర్భః" అని మొదలుగా నున్న 8 మంత్రములను చెప్పి అంతమందు ఒకసారి నమస్కారము చేయవలయును. సాష్టాంగప్రణామమును శ్రీమచ్ఛంకర భగవత్పాదులు చేతుల తోటి పాదముల తోటి మోకాళ్ళతోటి రొమ్ముతోటి శిరస్సుతోటి నేత్రములతోటి మనసుతోటి వాక్కుతోటి ఈ ఎనిమిది అంగముల తోను చేయునది అని ప్రపంచసారములో చెప్పినారు. (దరిమిలా) ఇప్పటివారు రొమ్ము, శిరస్సు, దృష్టి (అనగా నేత్రములు) మనస్సు, వాక్కు, పాదములు, చేతులు, చెవులు, ఈ ఎనిమిది అంగములచేతను చేయునది అష్టాంగ ప్రణామము, అనువచనముచే ఒక్కొక్క మంత్రముచే ఒక్కొక్క అంగముతో నమస్కారములను (8) ఎనిమిదింటిని చేయు చున్నారు. ఈవిషయములో ప్రమాణమును వెతకవలయును. అనగా ప్రమాణము కనబడుటలేదు. అని ఆ టిప్పణికి అర్థము, కాని టిప్పణికారుని మాటయే శాస్త్రవిరుద్ధమయినది. బో॥ సూత్రములో 'అష్టాంగంప్రణమ్య' అని యున్నది. అనగా ఎనిమిది అంగములచేతను నమస్కరించవలయును. మంత్రములుకూడ ఎనిమిది కలవు. ఇట్లున్న చోత ఒక్కొక్క మంత్రముచే ఒక్కొక్క క్రియను చేయవలెను. దీనిని ఆపస్తంబమహరి "ఏకమన్త్రాణికర్మాణి" అనియు ఆప॥శ్రౌ॥ సూ॥ 24- 41- సత్యాషాఢమహర్షి "ఏకమన్త్రాణి కర్మాణి" అని అని సత్యా॥ శ్రౌ॥ 1-1- పేజీ 42 లోను చెప్పినారు. తర్వాత అపిచ సఙ్ఖ్యాయుక్తాని॥ ఆప॥ శ్రౌ 24- -42 అని చెప్పి తర్వాత అల్పీయాగ్ంసికర్మాణి భూయాగ్ంసోమన్త్రాస్తత్రప్రతిమన్త్రం కుర్యాన్ దవశిష్టా వికల్పార్థా యథా యూపద్రవ్యాణీతి। ఆప॥శ్రౌ। 24- -12=కర్మలు తక్కువగాఉండి మంత్రములు ఎక్కువగానున్నచో ఒక్కొక్కమంత్రముచే ఒక్కొక్కక్రియను చేయవలెను. మిగిలిన మంత్రములను ఆఖరున చెప్పిన క్రియకు వికల్పముగా గ్రహించవలెను, అని సూత్రార్థము. ఉదాహరణ "యాజాతా ఓ

షధయ ఇతిచతుర్దశభిరోషధీర్వపతి।" అప। శ్రౌ.సూ॥ 16-19-11 అని చయన ప్రకరణములో ఉన్నది. అక్కడ 14 మంత్రములచే 14 ఓషధులను చల్లవలయును. ఒక్కొక్క మంత్రమునుచెప్పి ఒక్కొక్క ఓషధిని చల్లవలయును మిగిలిన 6 మంత్రములను వికల్పముగావదలివేయ వలెను. క్రియ ఒక్కటే ఉండి మంత్రములు ఎక్కువగా ఉండి సంఖ్యచే విధించినచో అన్నిమంత్రములు చెప్పి చివర క్రియను చేయవల యును. "ఉత్తరైరదక్షిణే హస్తేగృహీత్వా॥" అప॥ గృహ్య సూ॥ 10-12. "అగ్నిష్టెహస్త మగ్రభీత్" అని మొదలుగాగల 10 మంత్రములుకలవు వాటిచే వటుని హస్తమును గ్రహించవలెనని సూత్రార్థము. ఇక్కడ క్రియ ఒకటి, మంత్రములు 10 వాటినన్నిటిని ఉచ్ఛరించి చివర ఒకసారే వటునిహస్తమును గ్రహించవలెను. మంత్రములు క్రియలు సమానముగానున్నచో ఒక్కొక్క మంత్రమునకు ఒక్కొక్క క్రియను చేయవలెను. ఉదా॥ విష్ణోః క్రమోసీతిదక్షిణేవేద్యన్తె దక్షిణేనపదాచతురో విష్ణుక్రమాన్ప్రాచఃక్రామతి॥ అప - శ్రౌ-4-14-6 అనియున్నది. "విష్ణోః క్రమోసి" అనునవి 4 మంత్రములు, ఒక్కొక్క మంత్రమును చెప్పి ఒక్కొక్క అడుగును (పాదవిన్యాసమును) వేయువల యును అంతేకాని 4 మంత్రములను చెప్పి చివర నాలుగు అడుగులను వేయవలయును అనికాదు. "పరివాజపతిఃకవిరగ్నిరిమా స్పృభిస్త్రిభి యామృత్ఖనం పరిలిఖితిబాహ్యాం బాహ్యాంవర్షీయసీమ్ః" అప॥ శ్రౌ సూ 16_3_1 పరివాజపతిః, అనుమూడు మంత్రములచే ప్రదక్షిణముగా ఒకదానికంటె ఒక దానిని వెలుపలగా గీయవలెను అని సూత్రార్థము. "బాహ్యాంబాహ్యాంవర్షీయసీం" అనిచెప్పుటచే మూడుక్రియలు తోచుచున్నవి. వీటిని ఒక్కొక్కమంత్రముచే ఒక్కొక్కసారి గీయ వలెను. అష్టే ప్రకృతములో హిరణ్యగర్భః మొదలగు 8 మంత్రములచే తను ఎనిమిది నమస్కారములు వేరువేరుగా నేచేయవలయును. దీనికిప్రమా

ణముగవేషణీయం అని వ్రాసినటిప్పణీకారులకు ఈ ప్రమాణముచాలును. ఈ విషయములో శ్రీ శర్మగారు ఎంతయో శ్రమించి నిర్దుష్టముగాకూర్చి రనుట నిర్వివాదము. స. రుద్రాభిషేకవిధి 121 పేజీలో "అగ్నిర్మేవా చిశ్రితఇతయథాఙ్గమఙ్గానిసంమృశ్య" అని బోధాయనసూత్రము అందులో "స్వాఙ్గానిచ" అనుదానిని అధికముగా వ్రాసి తన అఙ్గములను దేవుని అఙ్గములను స్పృశించవలెను. అని వ్రాసిరి. సూత్రములో స్వాఙ్గాని అను పదము లేనందున దేవునియంగములు తనయంగములు అని చెప్పనక్కరలేదు. తనయంగములనే స్పృశించవలయును.

ఇందులో శివపంచాక్షరీ మంత్రమందున్న ఐదు అక్షరములు మొదట నున్న అష్టోత్తరశతనామములను కూర్చిరి. ఇదిమహాఫలప్రదము. శివపాదోదకమును పానము చేయవలెననియు అట్లుచేసిన మనోవాక్కాయకర్మకృత త్రివిధ పాపములు పోవుననియు 96-పేజీలో వ్రాసిరి. హేమాద్రి ప్రాయశ్చిత్తఖండలో శివనిర్మాల్య భోజనప్రాయశ్చిత్తమని మొదలిడి శంభోర్నివేదితం భక్తంతత్తీర్థం శాలిమేవవా। విప్రః కదానభుఞ్జీయాద్భుక్త్వాచాన్ద్రాయణంచరేత్॥ ఇది మొదలగు వచనములచే శివభక్త శివతీర్థాదికము నిషేధించినారు. వీటివ్యవస్థ ఎట్లన్న దీనినికూడ అక్కడే చెప్పినారు. శివేవిష్ణ్వాదిభిర్దైవైర్వ్యాప్తితే యత్సమర్పితమ్। తద్భుక్త్వా విప్రవర్యోసౌనభవేద్దోషభాగితః పంచాయతన మందైన శివతీర్థము స్వీకరించవచ్చుననియు కేవల శివుడే ఉన్నచోట గ్రహించ కూడదనియు వ్యవస్థ। స్వయంభూలింగమైనచో అక్కడ దోషములేదని పెద్దల సాంప్రదాయము ఈ శివ నిర్మాల్యస్వీకార విషయమును శివస్నాన తీర్థమునుగురించిన్నీ ఎన్నో ఆగమ, ధర్మశాస్త్ర కారికలనిందు పొందుపరచిరి. కొందరు పూజాంతమందు యజమానునకు అభిషేకజల ప్రోక్షణము చేయుటలేదు. అది అవశ్యకము. అగ్నిహోత్రమందు సమాప్తియందు "అన్నదాస్థాన్నాదో భూయాసం" అను మన్త్రముచేవేది

యందు ఉదకమునుపోసి తరువాత 'అపోహిష్ఠేష్ఠ' అను మన్త్రముచే శిరస్సునందు మార్జనచేసుకొనుచున్నారు దర్శపూర్ణమాసల (ఇష్టి) లో కూడ ప్రణీతోదకముచే శిరస్సునందుమార్జనముయున్నది. అగ్నిచయనములోను వాజపేయము బృహస్పతి సవము మొదలగు మహాక్రతువులయందు కొలకచయనములయందు హోమసంపాతమగు అజ్యముచే అభిషేకమును చేయవలయును. స్థాలీపాకములలోకూడ పూర్ణపాత్రిమార్జన ఉన్నది. కాబట్టి రుద్రాభిషేకోదకముచేతకూడ మార్జనచేసికొనుట అవశ్యకమే అందులకై శ్లోకరూపమన్త్రములు ఉండనేయున్నవి (సురాస్త్వామభిషిఞ్చన్తు అనునవి) అభిషేకకర్తకు అభిషేకఫలముత్వరితముగా లభించుటకు ఈమార్జనచాలా ముఖ్యమని అప్రయోగము సీగ్రంథమున చక్కగా పొందుపరచిరి. అది ఎంతయో అవసరము ముదావహము. అంధ్రదేశమునకు నూతనము. ఇంకను అనేకవిషయములను శివప్రీతి కరములగు పుష్పములను సంకలనచేసిరి. "కరవీరార్కమన్దార" మొదలగు వాటిని (40వ పేజీ చూడుడు) అర్కపుష్పము అనగా జిల్లేడుపుష్పము. అది రుద్రునకు అతిప్రీతి కరమైనది శ్రుతిలో "అఙ్గిరనస్సువర్గంలోకం యన్తో ఽజాయాంఘర్మంప్రాసిఞ్చన్థ్సాశోచ న్తీపర్ణంపరాజిహీతసోఽర్కోఽభవత్తదర్కస్యార్కత్వమర్కపర్ణేనజుహోతి సయోనిత్వాయ' అని యున్నది. అంగిరస్సులను మహర్షులు వెనుక స్వర్గలోకమును గురించి వెళ్ళుచు ఘర్మమును (బాగాకాచిన అజ్యమును) విసర్జించగా ప్రమాదమున అది మేకమీద పడినది. ఆమేక దుఃఖించుచు తన రోమసంఘమును భూమిమీద వదలినది అది జిల్లేడు వృక్షమైనది. అందుచే అర్చనీయమైనది (పూజించదగినది) అనువ్యుత్పత్తిచే అర్కము అను పేరు దానికివచ్చినది. కాబట్టి జిల్లేడు చాల ప్రశస్తమైనది వెనుకచెప్పినట్లు అగ్ని రుద్రస్వరూపుడు-బ్రహ్మగారు సృష్టిచేయునప్పుడు తనముఖమునుండి 'త్రివృత్' అనుస్తోమమును 'రథంతరమను' సామను, బ్రాహ్మణుని, మేకను, సృజించెను. అందుచే ఇవిచాల ముఖ్యమైనవనియు అగ్నికి మేకకు

ఉత్పత్తిస్థానము ఒకటే అగుటవలన అవి సమానజాతీయములని తె॥సం౭వ అ॥ప్ర అనువాకములోనున్నది. ఈసాజాత్యము వలన మేకకూడ రుద్రస్వరూపమే. మేక రోమసంఘమువలన జనించినందున జిల్లేడుకూడ రుద్రస్వరూపమైనదే అందుచే 113వ పేజీలో పృథివీశాస్త్ర్యాదిమ స్త్రైర్మార్జయేదర్కపత్రకైః అని చెప్పినారు. ఇంకను అనేక విశేషములు ఈధర్మశాస్త్రశ్లోకములలో గలవు వాటిని బుద్ధిమంతులు స్వప్రజ్ఞవలన గ్రహించగలరు. ఇంతకృషిచేసి ఈగ్రంథమును ఈరీతిగా సంకలనముచేసి ప్రజలకందించిన శర్మగారికి సాంబసదాశివమూర్తి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని చేయవలయునని ఆదేవుని ప్రార్థించుచు ఇంతటితో విరమించుచున్నాను.

ఇట్లు సాంగవేదార్థసామ్రాట్, అభినవాపస్తంబ

**లంక వెంకటరామశాస్త్రిసోమయాజి**

రాజమండ్రి, విజయవాడ వేదశాస్త్ర పరిషత్తులలో ముఖ్య

ప రీ క్షా ధి కా రి

నేదునూరు
అమలాపురం తా॥

ప్రమాది వత్సరాది



# ★ విజ్ఞాపనా ★

"బోద్ధారోమత్సరగ్రస్తాః" ఇత్యార్యోక్తిః శ్రూయతే మాత్సర్యదూషిత మనీషా మవశ్యం పరిత్యజ్య శ్రుతిస్మృత్యాది ప్రమాణభూషితమేనం మహాన్యాసపూర్వక సస్వర శ్రీయరుద్రాభిషేకవిధిరితి సార్థకాభిధేయేన విరాజమానం గ్రంథం సమీక్ష్య కుర్వంత్వాచరణ యోగ్యమితి సప్రశ్రయం సంప్రార్థయే, అస్మిన్ గ్రంథే శ్రుతిస్మృత్యాగమ విరుద్ధ శిష్టాచారశత్రుభూతో విధ్యుక్త ధర్మాచరణాభిలాషిభిః పండిత ప్రకాండై రనభిలషణీయో ఽనా చరణయోగ్యోఽ సత్ఫలిత ప్రదోవిషయఏకోఽపి నదృశ్యతే, నేయమతిశయోక్తిః.

లోకేఽస్మిన్ వేదాః, శైవధర్మప్రతిపాదకా అనేక ఆగమాః, వివిధధర్మసూత్రాణి, తద్వృత్తి భాష్యాదీని, అనేకా స్మృతయః, తద్వ్యాఖ్యానలబ్ధా అమూల్యాఃకారికాః, విద్యన్తే, కిన్తు తేసర్వేఽపిఅనేకప్రాన్తేషు, అనేకాసు లిపిషుచ, గీర్వాణ భాషాయాం చదృశ్యన్తే.

ఏతాన్ సర్వా నమూల్యవిషయాన్ సమ్యక్పరిశీల్య, తద్గత తత్త్వజ్ఞా శిష్టాచారభూషితా విద్వాంసోఽఙ్గుళి గణ నీయాఏవ కతిచిత్తత్రతత్రసన్తి.

సమర్థానామపి పూర్వోక్తాఽ మూల్యవిషయజ్ఞానాభిలాష శూన్యానామలసచేతసా ముపయోగార్థం, సర్వజ్ఞేభ్య శ్శిష్టే

భోక్ష్యజ్ఞాతుం మూకీభూత ప్రజ్ఞానా ముపయోగార్థంచ, "మయావిధ్యుక్తప్రకారేణ రుద్రాఽభిషేకో నక్రియత ఇతి వ్యథాభాజాం కర్మాచరణాసక్త చిత్తానాముపయోగార్థంచ యేన మనోరథేన రుద్రాఽభిషేకః క్రియతే తేన రుద్రాభిషేకేణ స్వమనోరథమప్రాప్తవతా ముపయోగార్థంచ వివిధ ప్రాన్తలబ్ధ గ్రంధాన్ సర్వాన్ సమ్యక్పరిశీల్యోపయుక్త విషయాన్ సర్వాన్ సంగృహ్య, వేదవిదాం వరేభ్యశ్శిష్టేభ్య స్సమ్యక్ జ్ఞాత్వా శాస్త్రాచార లోకాచార, శిష్టాచార, స్వానుభవాదీన్ అపౌర్వాపర్యవిరోధం సమన్వయం కృత్వా ఏకవత్సరపర్యన్తం నిద్రాహారాదీనపి తృణీకృత్య. గృహ దారాపుత్రాదీనపి పరిత్యజ్య, అనారోగ్య మప్యవిగణయ్యచ మహతాశ్రమేణాఽధికధనం వ్యయిత్వైనం మహాన్యాస పూర్వక సశాస్త్రీయరుద్రాభిషేకవిధి గ్రంధరాజం పాశుపత విధాన రుద్రార్చనావిధిసహిత మత్యావశ్యకవిషయసర్వాఙ్గ సున్దరం శ్రీమద్భ్యః భవద్భ్యః సమార్పయమ్, అయం గ్రంథో యశోఽభిలాషేణవా ధనతృష్ణయావ నసంగ్రథితోమయా । సంగ్రథితోఽయం లోకహితచిన్తనయా శ్రీ పార్వతీపరమేశ్వర ప్రేరణయాచేతి సవినయం బ్రవీమి ।

మన్త్రతన్త్రకలాపయుక్తేషు వైదికకర్మసు విశ్వాస రహితా నాస్తికాఅ ప్యేతద్గ్రంధదర్శనేన కర్మాసక్తచిత్తా ఆస్తిక్యబుద్ధయోఽవశ్యం భవిష్యన్తీతి మమవిశ్వాసః ।

అతో గుణగ్రహణపారీణాః పురోహితాః పండితాః కర్మాచరణాసక్త చిత్తాశ్చసర్వాఽభిషేకార్చనాగ్రంథ రత్నహార తరళాయమాన మసదృశపాండిత్యభూషితైః కోవిదై శ్లాఘిత మేనం పాశుపతవిధాన సహితం మహిన్యాసపూర్వక సశాస్త్రీయ రుద్రాభిషేకవిధి గ్రంథం సమ్యగాదృత్యైః తద్గ్రంథోక్త ప్రకారేణ శివాఽభిషేకాఽర్చనాదికం కారయిత్వా తత్క ర్తారణా మాదరాభిమానాదికంసముపార్జ్య మృడానీ పత్యను గ్రహంసంప్రాప్య మోదన్తామితి వినయపూర్వక మభ్యర్థయే। "ప్రమాదోధీమతామపీ"తి లోకోక్త్యనుసారేణ తస్మిన్ గ్రంధరత్నే ముద్రాణాదిదోషా వర్తిష్యన్తే.

"యదుక్తం మహాకవికాళిదాసేన "హంసోహి క్షీర మాదత్తేదన్మిశ్రావర్జయత్యప" ఇతి తద్వదేవాస్మిన్ గుణక్షీరాణ పిబత విసృజతదోషోదకానీతి సవినయం ప్రార్థయే। యత్ర కుత్రాపివాస్థితాన్ దోషలేశాన్ భవద్భ్యోజ్ఞాత్వా నిర్దోషం కరిష్యా మీతినివేద్య విరమామి॥"

అస్మిన్ గ్రంథేశ్లోకానాంసూత్రాణాంచ భావవివరణం కృతమ్ సర్వేషాం సమ్యగర్థపరిజ్ఞానాయ గ్రామ్యభాషైవోప యుక్తా నతుపాండిత్యప్రకర్షేణ గ్రాంధికభాషా అతోమహాస్తో కోవిదాఅగ్రహం నలభధ్వమితి సంప్రార్థయే

కించైషమహాగ్రంథః కేవలపండితోపయోగార్థం నసం గ్రంథితః, యదిపండితానామేవస్యాత్ తేషాంకుశాగ్రబుద్ధీనాం భావావిష్కరణమేవ వ్యర్థంస్యాత్.

మహతాశ్రమేణ విరచితోఽయం గ్రంథః అక్షరజ్ఞానవతాం సర్వేషామపి సుఖబోధాయ । తేఽపి గ్రంథస్థవిషయాన్ సమ్యక్ జ్ఞాత్వా పురోహితైర్వా స్వైర్వా గ్రంథోక్త ప్రకారేణ రుద్రాభిషేకాదికం కారయిత్వా తత్తత్ఫలాని లభేయురిత్యుదారస్సంకల్పః.

— ఏవం విజ్ఞాపయితా, వీరభద్రశర్మా.

గౌతమీమండల శిరోభూషణాయ మానాయాం దిషణాధికకృతవాచస్పతీనాం సాంగవేదాధ్యయన సంపన్నానాం పండిత ప్రకాండానాం వేదఘోషైః పవిత్రీకృతాయాం భూతల స్పర్శమాత్రభిన్న స్వర్గతుల్యాయాం కోనసీమ విరాజమానాయాం అమలాపుర్యాం నివాసః॥ తత్సమీపగ్రామ మకుటాయమాన "అయినాపురగ్రామో" జన్మప్రదేశశ్చ॥

తా॥ బోద్ధారో మత్సరగ్రస్తాః అను నార్యోక్తి సర్వలోక విదితము. అసూయకు స్థానమివ్వక శ్రుతిస్మృత్యాది ప్రమాణములతో నొప్పు నీ మహాన్యాసపూర్వక సశాస్త్రీయ రుద్రాభిషేకవిధి యను సార్థకమైన యీ గ్రంథమును దిలకించి గ్రంథోక్త ప్రకారముగ నాచరించి తత్ఫలితామృతమును గ్రోలుడని ప్రార్థించుచున్నాను.

ఈ గ్రంథమున వేదప్రమాణేతరములుగాని, స్మృతి ప్రమాణేతరములుగాని, శిష్టాచార విభిన్నములుగాని ధర్మాచరణాభిలాషులగు పండితులకు సమ్మతములు గానివిగాని, ఆచరణయోగ్యములు గానివిగాని, సత్ఫలితదాయకములు

గానివిగాని యిందు నేయొక్కటియును లేదనుట అతిశయోక్తి కాఁజాలదు.

ఈ విశాల ప్రపంచమున వేదములూ, శైవధర్మప్రతిపాదకములగు ననేకాగమములు, అనేకములగు ధర్మసూత్రములు, తద్భాష్యాదికములు, స్మృతులు, అమూల్యములగు కారికలు గలవు అవి యన్నియు ననేకప్రాంతములయం దనేక లిపులలోను, సంస్కృత భాషయందును విరాజిల్లుచున్నవి. ఈ యమూల్యములగు సమస్త విషయముల నవగాహన చేసికొనిన శిష్టాచార పరాయణులగు పండితులు వ్రేళ్ళతో లెక్కించఁదగిన వారు కొద్దిమంది మాత్రమే యక్కడక్కడ గలరనుట నిర్వివాదము.

సమర్థులైనను నమూల్య విషయములను దెలిసికొనవలయుననెడి అభిలాషలేని యలస హృదయుల యుపయోగార్థము పండితులవలన తెలిసికొనలేని మూకీభూత ప్రజ్ఞులకు నుపయోగించు నిమిత్తము "నేను యథాశాస్త్రముగ రుద్రాభిషేకము చేయనైతిని" అని విచారించుచున్న కర్మాసక్తచిత్తుల యుపయోగార్థము ఏకోరిక మనమునం దుంచుకొని రుద్రాభిషేకము చేయఁబడినదో దానివలన నామనోరథము బొందని వారి యుపయోగమునకు వివిధ ప్రాన్తములయందు లభించిన గ్రంథములను చక్కగాపరిశీలించి ప్రమాణ సహితములగు నాయా విషయములను సేకరించి వీనియందు కూలఙ్కషప్రజ్ఞ

గల పండితులవలన తెలిసికొని శిష్టాచారములు, శాస్త్రాచార ములు, లోకాచారములు, స్వానుభవము మొదలగువానిని పౌర్వాపర్య విరోధము లేకుండగ సమన్వయపరచి యొక సంవత్సరము నిద్రాహారాదులను మరచి, గృహదారాపుత్రాదు లను విడచి, అనారోగ్యమును సరకు గొనక మిక్కిలి శ్రమతో మిక్కుటముగ ధనమును వెచ్చించి యీ మహాన్యాసపూర్వక సశాస్త్రీయరుద్రాభిషేకవిధి యను నీ పవిత్రగ్రంథరాజమును 'పాశుపతవిధాన' రుద్రార్చనావిధి సహితముగ మీయందఱ కందించితిని. ఈ యుద్గ్రంథమును ధనతృష్ణచేగాని కీర్తిని కాంక్షించిగాని ప్రచురించలేదు. లోకహితముకొఱకు శ్రీపార్వతీ పరమేశ్వర ప్రేరణచేతనే ప్రకటించితిని. వైదిక కర్మలయందు విశ్వాసములేని నాస్తికులకుఁగూడ ఈ గ్రంథస్థ విషయపరజ్ఞాన ముచే ఆస్తిక్యత కలిగి కర్మాసక్తచిత్తులగుదురని నా దృఢ విశ్వాసము.

అందువలన గుణగ్రహణ పారీణులు పండితులగు పురో హిత ప్రకాండులు, కర్మాచరణాసక్త చిత్తులు సమస్తాభిషేక గ్రంథహారమున నాయకమణివలె నొప్పుచున్నది యని యన దృశ పండిత ప్రకాండులచే శ్లాఘింపఁబడిన మహాన్యాసపూర్వక సశాస్త్రీయరుద్రాభిషేకవిధి (పాశుపతవిధాన రుద్రార్చనావిధి సహితము) యనునీగ్రంథము నాదరించియేతద్గ్రంథోక్త ప్రకారముగా నభిషేకాదికమఁ జేయించి, చేయించిన వారి

యాదరణమును సంపాదించుకొని శివానుగ్రహముచే సంతసిం చుదురు గావుతమని వినయపూర్వక ప్రార్థన.

"ప్రమాదోధీమతామపి యనెడి లోకన్యాయమును బుర స్కరించుకొని ఈ గ్రంథమున స్వల్పములగు ముద్రాణాది దోషము లుండవచ్చును కవికులతిలకుడు, కవి సార్వభౌముడు పండితకులావతంసుడు నగు కాళిదాసమహాకవిచే "హంసపాలను గ్రాగి జలములను వదలివేయును అని చెప్పఁబడినరీతిగ గుణ క్షీరములఁ గ్రాగి దోషోదకములను విసర్జింపుడని వినయముతో ప్రార్థించుచున్నాను.

ఈ గ్రంథమున శ్లోకములకు సూత్రములకుఁ జక్కగా భావము వ్రాయబడినది. అందఱకుఁ దెలియుటకై వచనము లలో గ్రామ్యభాషకు స్థానమివ్వఁబడినది. వ్యాకరణాదిశాస్త్ర పాండిత్యప్రకర్షను జూపుచు గ్రాంధిక భాషకుచోటివ్వఁబడలేదు. అందువలన పండితవర్యులాగ్రహమును బొందవలదని ప్రార్థన.

మరియు నీ మహాగ్రంథము కేవల పండితోపయోగము నకై రచితముగాదు. పండితోపయోగార్థమేయైనచో నాకుశాగ్ర బుద్ధులకు భావవివరణ మనవసరమే యగును. అనేక కష్టముల నోర్చి సంగ్రథితముజేసిన నీ గ్రంథము అక్షరజ్ఞానముగలవార లందఱకు సునాయాసముగ తెలియుటయే ముఖ్యోద్దేశము.

వారున్ను గ్రంధోక్తవిషయములను జక్కగ నవగాహన జేసికొని వారి వసిష్ఠులచే నభిషేకాదికమును జేయించుకొని తత్ఫలితములఁ బొందగలరనునదియే యుదారమగు సంకల్పము

ఎచ్చటనైన దోషలేశములు మీదృష్టికివచ్చిన మీవలన తెలిసికొని దోషరహితముగ చేయువాఁడనని వినయపూర్వక ముగా విధేయుఁడనై విన్నవించుకొనుచు విరమించుచున్నాను.

అమలాపురము.
25—10—72

ఇట్లు విన్నవించు గ్రంథకర్త
కహాచి వీరభద్రశర్మ
సనాతనధర్మ ప్రకాశక గ్రంథమాల.

—*—

## ముఖ్యగమనిక

సర్వయుక్తముగా ఈగ్రంథ మచ్చొత్తించుటలోను, ప్రూఫులు చూచుటలోను, ఎంత జాగ్రత్త వహించినను, అచ్చటచ్చట స్వల్పముగా స్ఖాలిత్యములు దొర్లినవి. గాన ముందుగా తప్పొప్పులను సవరించుకొందురుగాన, మరియు * పువ్వు గుర్తులుగలవన్నియు, అనేక శృతిస్మృతి పురాణోక్త ములు, ప్రమాణగ్రంథముల పేర్లులేని కారికలు శిష్టులవలన తెలిసికొనినవని గ్రహించెదరుగాక! మరియు ఒకే కారిక అనేక గ్రంథములలో ఉండుటచే ప్రమాణముగా ఒక గ్రంథము పేరు మాత్రమే యివ్వబడినది.

— గ్రంథకర్త

—*—

# పండితాభిప్రాయములు

'సాంగత్రివేదాచార్య' 'వేదార్థభిజ్ఞ' 'ధర్మశాస్త్రాభిజ్ఞ'
**తంగిరాల బాలగంగాధరశర్మ**

ఇరగవరం,
తణుకు తా॥ (ప॥గో॥జిల్లా)
తేది 9–4–1972

బ్ర॥శ్రీ కూచి వీరభద్రశర్మగారిచే సంగ్రథితమగు సశాస్త్రీయ రుద్రాభిషేకవిధియను పాశుపతవిధానసహితమై యొప్పు గ్రంథమును కూలంకషముగా పరిశీలించి చూచితిని.

ప్రస్తుత కాలమందు బహు గ్రంథములను పరిశీలన చేసి రుద్రాభిషేకమును గూర్చి ఇట్టి మహత్తర గ్రంథ గ్రథనము శ్రీ వీరభద్రశర్మగారి ప్రతిభకు, వీరి ఆస్తిక్యమందలి శ్రద్ధకు, వీరి బహుముఖ ప్రజ్ఞావిలాసమునకు చిహ్నము మాత్రమే వీరిని నేను మంచి సంగీత, సాహిత్యకథాపటి మతో కూడిన హరికథాకథకులుగా మాత్రమే ఎరిగియున్నాను వీరి గ్రంథగ్రథనాకౌశల్యము చూచి వీరి బహుముఖ ప్రజ్ఞకు ఆశ్చర్యచకితుడనైతి.

ప్రత్యేక వైదిక విద్యలనే చదువుకొని వాటియందే బహు పరిశ్రమచేసి "మాకు ఈవిషయములో బాగా తెలి యున"నే అహంభావముతో గల మాబోంట్లను సైతము యీ గ్రంథ దర్శనోత్తరక్షణమందు ఆ యహంకారము పూర్తిగా విడిపోయి లజ్జితులను చేసెననుట అతిశయోక్తి

కానేరదు. ఈ గ్రంథ పరిశీలనా సమయమందు వారితో కలిగిన సన్నిహిత సంబంధముతో ఋగ్యజుర్వేద, శైవపూర్వాపర ప్రయోగములందు శైవాగమాద్యాగమములందు వారుచేసిన పరిశ్రమ చూసి ఆశ్చర్యచకితుడనైతిని. వీరు కేవలహరికథా కథకులేగాక స్మార్త విషయములలో కూడ వీరి ప్రజ్ఞ సామాన్యులకు దురూహ్యము.

ఇట్లు బహుముఖ ప్రజ్ఞ కలవారు కావుననే రావణ భట్టభాస్కర బోధాయనసూత్ర, మేరుతంత్ర యోగజాగమాద్యనేక ప్రమాణగ్రంథముల సహాయముతో మహాన్యాసమునకేగాక ఎంతో చాటుగా బహుకొద్దిమందికేగాని తెలియని మహాపాశుపత సంపుటిత రుద్రపద్ధతిని గ్రంథరూపమున బహిర్గతము గావించి సామాన్యులకు సైతము అందుబాటులో నుండునట్లు చేసిన వీరికి వైదికలోకమేగాక యావద్భారతీయులు ఎంతయో ఋణపడియున్నారు. కాన వీరు "సనాతన గ్రంథమాల" యను సంస్థద్వారా ఇట్టి లోకోత్తరాతి రహస్య విషయములను లోకమునకు వెల్లడించుచో బహు లోకోపకారమగును. నేను వీరు ప్రమాణముగా స్వీకరించిన ప్రతి గ్రంథమును దగ్గరయుంచుకొని నాశక్తి కొలది పరిశోధించినాను.

వీరికి శ్రీ సాంబసదాశివుడు దీర్ఘాయురారోగ్యాదుల నిచ్చి ఇట్టి అనేక గ్రంథగ్రథనము చేయించుగాక.

(సం.) తంగిరాల బాలగంగాధరశర్మ

వేదభాష్యాలంకార, వేదభాష్య విశారద, అభినవ విద్యారణ్య, వేదార్థసామ్రాట్,

కాకినాడ.
22–4–1972

**ఉప్పులూరి గణపతిశాస్త్రి**

హరికథ కావతంసేత్యాది బిరుదాంకితులగు శ్రీ కూచి వీరభద్ర శర్మగారిచే విరచితమయిన మహాపాశుపత విధాన సంయుతమగు "సశాస్త్రీయ రుద్రాభిషేక విధి" అను గ్రంథము లోని యంశములను గ్రంథకర్త్రు ముఖమునుండియే స్థాలీ పులాకన్యాయముగ వినియుంటిని.

వీరు ప్రస్తుతం ముద్రిత గ్రంథములనేగాక (తాళపత్రి లిఖితములగుటచే దుర్లభములగు) అముద్రితములైన అనేక మూలగ్రంథములను ,గూడ బహువ్యయప్రయాసలచే సంపా దించి సర్వ విషయములను కూలంకషముగ విమర్శించి సప్రమాణముగ నిరూపించిరి.

మరియు ఇరగవర వాస్తవ్యులు, ఋగ్వేద, యజుర్వేద, అధర్వణవేదములను కూలంకషముగ అధ్యయనమొనర్చుటయే గాక యజుర్వేదభాష్య పరీక్షలో నుత్తీర్ణులై సర్వతంత్రము లందును అసమానమగు కృపిసల్పి, సాంగ, త్రివేదాచార్య వేదార్థాభిజ్ఞ, ధర్మశాస్త్రాభిజ్ఞేత్యాది బిరుదాంకితులై, ప్రామాణి కాగ్రగణ్యులై, కృతప్రతిష్ఠులైన శ్రీ తంగిరాల బాలగంగాధర శర్మగారు ఈ గ్రంథమును ఆ మూలాగ్రముగ శోధించుటచే ఈ గ్రంథము నిర్దుష్టమనియు

శిష్టసంప్రదాయానుసారి యనియు వేరుగ చెప్పనక్కరలేదు. దీనిని యితరులు పరిశీలించవలసిన అవసరము కూడ నుండ దనియే చెప్పవచ్చును.

ఇట్లు అనేకములగు ముద్రితాముద్రితములగు మూల గ్రంథములను సేకరించి అమూల్యమగు గ్రంథరాజమును లోక మునకు అందజేసి మహోపకారము గావించిన శ్రీ శర్మగారి ఋణము వారి గ్రంథోక్తమగు విధ్యనుసారము అనుష్ఠాన మొనర్చి తీర్చుకొనగలరని విశ్వసించుచుంటిని.

ప్రకృతములో అనేకులగు శిష్టులు పాశుపతవిధాన మును అభిలపించుచుండిరిగాని దాని ఇతికర్తవ్యతను బోధిం చెడి గ్రంథము అందుబాటులో లేకపోవుటచే అట్టి గ్రంథము లభించిన బాగుండునని ఆశించుచుండిరి.

అట్టి అభూతపూర్వమగు మహాపాశుపత విధాన సం యుక్తమగు గ్రంథరత్నమును రచించిన శ్రీ శర్మగారిని పరమే శ్వరుడు రక్షించుచు, ఆచంద్రార్కముగ ఈ గ్రంథరాజమును విలసిల్లునట్లు చేయుగాక.

(సం.) ఉప్పలూరి గణపతిశాస్త్రి

—*—

"దర్శనభూషణ" "కులపతి" "రాష్ట్రపతి సన్మానిత" "చతుస్తంత్రి"

## కె. సోమశేఖరశాస్త్రి

శ్రీ కూచి వీరభద్రశర్మగారి నాశీర్వదించుచు వ్రాయునది —

మీరు రచించిన మహా పాశుపత సహిత "సశాస్త్రీయ రుద్రాభిషేకవిధి" యను గ్రంథమును మీవలననే అచ్చటచ్చట ప్రధానాంశములను వినియుంటిని.

రుద్రాభిషేకము అసంస్కృత ముఖములందు బడి దోషదూషిత మయిపోయినది.

మీరిప్పు డనేక గ్రంథములను పరిశీలించి, ఔత్తరాహుల యాచారమును స్వయముగ నుత్తర హిందూస్థానమునకు వెళ్ళి శ్రమ వహించి, యచటి విద్వదగ్రగణ్యుల యనుగ్రహమును సంపాదించి నిర్దుష్టముగ నీగ్రంథమును రచించి యాకొఱతను దీర్చితిరి.

అభిషేకమందును, పూజావిధియందును అనేకాగములను అనేక ధర్మశాస్త్ర గ్రంథములను పరిశీలించి విరోధములను పరిహరించి చక్కగ నిరూపించిరి. ఈ గ్రంథము మనదేశమునకు నూతనము. అపమార్గమునుండి మరలించునదియును కాన యసూయను వీడి, మూఢాచారాభిమానములను మాని ఈ గ్రంథముయొక్క గొప్పతనమును, ఈ గ్రంథకర్తలగు మీయొక్క పరిశ్రమను గుర్తింతురు గాతమని మనవి చేయుచున్నాను.

వక్కలంక
శ్రీరామపురం

(సం.) కె. సోమశేఖరశాస్త్రి.
3-9-1972

"ఆర్ష విద్యాభూషణ"

## జటావల్లభుల పురుషోత్తము ఎం. ఏ,

ఆంధ్రప్రదేశ విశ్వహిందూ పరిషదధ్యక్షులు

కా కి నా డ. 26-4-72.

శ్రీ కూచి వీరభద్రశర్మగారు బహు ప్రమాణ గ్రంథ పరిశీలనము గావించి, గురుశుశ్రూష నొనర్చి బహు సాంప్రదాయపరిజ్ఞానమును సేకరించి రేయింబవ లదేతపస్సుగా కృషి చేసి రచించిన "సశాస్త్రీయ మహా రుద్రాభిషేక గ్రంథము"ను హస్తలిఖిత ప్రతిరూపములో చూచి వారి కృషికినీ, లోకహిత చింతనకునూ జోహారు చేసినాను. స్మార్తములోను, మంత్ర విద్యలోను ఆరితేరిన వారుకూడ ఏతద్గ్రంథ పఠనమువలన నూతన విషయములను తెలిసికొన గల్గుదురనుటలో నతిశయోక్తి లేదు.

సైన్సులో నొక ప్రయోగము చేయునపుడు స్వల్ప దోషము లున్నను, ఒక్కలోపమున్నను ఏవిధముగా ఆ ప్రయోగమునకు ఫలితమురాదో యాప్రకారముగానే రుద్రాభిషేకాదులుకూడ లేశలేశములలో శాస్త్రీయములైయున్ననేకాని ఫలితము పుట్టదు. ఆ లేశలేశములే యొక గ్రంథములోను లేవు. బహుగ్రంథ వికీర్ణములై బహుప్రదేశాచార వికీర్ణములై యున్నవి. వానిని సేకరించి యీ గ్రంథరూపమున వెలయించిన శాస్త్రిగారు లోకమునకు చేసిన మహోపకారమునకు

శ్రీ ఉప్పులూరి గణపతిశాస్త్రిగారు, శ్రీ తంగిరాల గంగాధరశాస్త్రి గారు, శ్రీ కొల్లూరి సోమశేఖరశాస్త్రిగారు మున్నగు మహాపండితులే శ్లాఘించియుండగా నితరుల మాట చెప్పనేల !!

శ్రీ శర్మగారి పితృపాదులు, గురువులు ఈ గ్రంథమును చూచి తామువేసిన విజ్ఞానబీజము మహావృక్షమై యిట్టి యమృతఫలమును లోకమున కందించుచున్నదని పరమానందము నొందవచ్చును.

(సం.) జటావల్లభుల పురుషోత్తము.

—*—

"గణిత కళానిధి"

పిడపర్తి కృష్ణమూర్తిశాస్త్రి

ప్రస్తుత మకాము, మద్రాసు కరుణానిధినగర్

పి. కృ. శా.
పరీధావి భాద్ర॥ కృష్ణ ౹౩ గు.

శ్రీ కూచి వీరభద్రశర్మగారు లోకోపయోగమునకై సంకలితపరచి ముద్రితము గావించుచున్న "సశాస్త్రీయ రుద్రాభిషేక విధి" యను పుస్తకమును పాశుపత ప్రకరణ సహితముగ అచటుచట చూచితిని. చాల శ్రమపడి అనేక విషయముల నిందు చేర్చిరి. మంత్రశాస్త్ర ప్రసిద్ధవిషయములిందు చాల గలవు. శివార్చనా ఫలమునందు దలచినవారికి ఇది మహోపకారికము.

—o—

మంత్రశాస్త్రపూర్ణ పట్టాభిషిక్తులును, పాదుకాంత
పూర్ణ దీక్షాపరులును అగు

# మండ సూర్యనారాయణశాస్త్రిగారు

ప ర్లా కి మి డి.

ప్ర॥ మకాం:- కాకినాడ.

శ్రీ కూచివంశ జలనిధి -రాకాహిమకర విశాల రాజితకీర్తీ
నీకలిమి బలము తెలివియు - శ్రీకంఠుని కృపనువడసి శివమగుగాతన్ 1

కూచివంశసుధార్ణవ కుముదహితుడు - వీరభద్రసుధీమణి విబుధనుతుడు
'పాశుపతవివరణము' జేసి పరమశివుని-కృపనువడసినపురుషార్థకోవిదుండు
వేదశాస్త్రపురాణ వివేకఘనుడు శుభకరాకృతి,సుమతి,సుశ్రోత్రియుండు
భారతీభార్గవీ కృప బడసినట్టి రాజయోగి మహాకీర్తి రాజితుండు 3

కలియుగమహిమచే కలిమిని అనగా ఐశ్వర్యమునూ బలమును అనగా అధికారమునూ పలుకుబడినీ, తెలివిని అనగా జ్ఞానమునూ పాండిత్యమునూ, సత్కార్యములకూ సద్గ్రంథరచనలకూ నుపయోగపరచు మహనీయు లరుదగుచున్నారు. "భద్రం కర్ణేభిశ్శృణయామ, అక్షిభిఃపశ్యేమ" అని పల్కు వేదవాక్యానుసారంగా శ్రీ శర్మగారు గావించినారు. సర్వ జగన్నాటక లీలావినోద సూత్రధారియగు భవానీ శంకరుడు ఇతోఽధికసామర్థ్యప్రదుఁడై సమస్త మంగళముల నొసగుగాక యని శుభాకాంక్ష.

పురుషార్థప్రాప్తికి యధికారి యగుటకు నిట్టి సత్సంకల్పములనే వేద, ముని, మనువును నిర్ణయించేరు. ఈశ్వరకృప లేక యిట్టి ఘనకార్యములందు శ్రద్ధా విశ్వాసములు చేకూరవు.

శ్లో॥ భవానీశంకరౌ వన్దే శ్రద్ధా విశ్వాసరూపిణౌ ।
యాభ్యాంవినా నపశ్యన్తి సిద్ధాస్స్వాంతస్థ మీశ్వరమ్॥

అనిబుధులు నుడివిరి. శ్రద్ధావిశ్వాసరూపములతో నుమామహే శ్వరులు హృన్మందిర విరాజితులగునపుడే యిట్టి సద్వివరణ సంకల్పము కలుగునుగాన శ్రీ శర్మగారి పాశుపతవివేక వివరణము సర్వసాధక మహాజనాఽహ్లాదకరమని పల్కుట యతిశయోక్తి కాదు.

నాకుగల స్వల్ప సాముద్రిక శాస్త్రానుభవముచేతనూ, త్రికాలదర్శినియునూ, సుప్రబోధినియునగు వార్తాళీ శ్రీ దేవి యొక్క యనుగ్రహముచేత నేను గుర్తించిన దేమనగా అనేకాగ్రత, శూన్యాగ్రతలకు లోనైన మనస్సునకు ఏకాగ్రత కలుగ జేయుట కుపయోగించు సాధనసంపదలనూ, భారతీయ సంస్కృతినీ పునరుద్ధరింప, నంతట ననేకోపాయములనూ, సుప్రయత్నములనూ జేయుచున్న మహాత్ములకునూ, మహౌదార్యవంతులయిన జ్ఞాన, ధన, దాతలకునూ యశఃకాములైన నేతలకునూ, నిగమాగమప్రోక్తైహికాఽముష్మిక ఫలసిద్ధి ప్రదమగు శ్రీకూచి వీరభద్రశర్మగారి పాశుపతవివరణము సురపారిజాతలతామందిరమని తలంచెదను.

సర్వేషాం మహాజనానాం సమస్తమంగళాని భవంతు

పరీధావి, అశ్విన — ఇట్లు సదాశయుల పాదపాంసువు,
శు ౧౦ మీ, జయ — మం॥ సూ॥ శాస్త్రి.

ఓం తత్సదోమ్.

శ్రీదత్తప్రసన్న.

N. కాశీపతిశాస్త్రి పిఠాపురం,
ఋగ్వేద పాఠశాలాధ్యాపక, తూ॥గో॥జిల్లా. 26-6-72.

శ్రీ కూచి వీరభద్రశర్మగారి "సశాస్త్రీయరుద్రాభిషేక విధి" ననుసరించి అమృత పాశుపతవిధాన రుద్రాభిషేకము పిఠాపురం శ్రీ కుక్కుటేశ్వరస్వామివారికినీ, కోరుకొండవద్ద కణుపూరునందు పర్వతముపై వెలసిన శ్రీ మల్లేశ్వరస్వామి వారికినీ, బిళ్ళకుర్రు వా॥ శ్రీ S. V. S. జోగయ్యశర్మగారు చేసిరి. ఆ అభిషేకములు శ్రీ శర్మగారి పర్యవేక్షణలో నేను బ్రహ్మత్వమువహించి. సమర్థులైన ఋత్విక్కులతో చేయించితిని. ఎన్నో ప్రత్యక్ష నిదర్శనములు మాకేగాక ప్రజలందరికి దృగ్గోచరములైనవి. (కణుపూరులో అభిషేకమయిన వెంటనే మండు వేసవికాలమున కుంభవర్షము కురిసినది) అభిషేకము సుమారు 5 గంటలు పట్టినది. ఆర్షవచన రహితమైన నడక ఈ గ్రంథమున కానరాదు. శ్రీ శర్మగారు బహుముఖ పాండిత్యము గలవారైనను వారే యీ గ్రంథరచన చేసినారని తోచదు. ఏమన వారిచే వారిఉపాసనాదేవతలైన శ్యామలాః శంకరులే వారికిచెప్పి ఈ గ్రంథరచన చేయించినారని నా దృఢవిశ్వాసము. ఇది నిజము, సందేహములేదు.

సహృదయులైనవారు ఈగ్రంథోక్త విధ్యనుసారముగా అభిషేకార్చనలుచేసి తరించెదరుగాక. నాకు తెలిసినంతలో ఈ గ్రంథము కామధేను, కల్పవృక్షములకు సరితూగగలదను టలో సందియములేదు. ఈ గ్రంథకర్తను పార్వతీ పరమేశ్వరులుసర్వదా ఆయురారోగ్యములొసగి రక్షింతురుగాక.

(సం.) N కాశీపతిశాస్త్రి.

"Girija"
30, Edward Elliot Road,
Mylapore, Madras-4.
October 3, 1972.

Dear Sir,

Dr. S. Radhakrishnan is glad to know that you are bringing out a book "Sasastriya Rudrabhisheka Vidhi - Pasupata Sahitam" in Telugu. He sends his best wishes to you.

Yours sincerely.
C. RAMASUBBAN
3—10—72
P. S, to Dr. S. Radhakrishnan.

Panditha Kuchi Veerabhadra Sarma,
Amalapuram.
East Godavari District,
Andhra Pradesh.

"ఆశుకవి చక్రవర్తి, అవధాన శిరోమణి"

## బులుసు వెంకటరామమూర్తి

రాజమండ్రి క్యాంపు:- అశోకనగర్, మద్రాసు.

సీ॥ ఖండ ఖండాంతరఖ్యాతి గాంచిన గొప్ప
తత్త్వవేదాంత విద్వన్నుతుండు
చతురుడై మించి భరత రాష్ట్రపతిగా ను
పాధ్యాయమకుట ప్రధానుడగుచు
స్తవనీయుడైన రాధాకృష్ణ పండితుం
డారోగ్యభంగంబు నందువేళ
విశ్రాంతి జెందెడి విమలకాలమునందు
చెన్నపట్టణమున చిత్రముగను

గీ॥ గాంచి నీగ్రంథరాజంబు కరమువొడ్చి
నీదు కృషినెంచి గ్రంథ సందీప్తమైన
శక్తిని గ్రహించి ఆశీర్వచనము నిచ్చె
ఇంతకంటెను ఘనత నీకేది? దీని
గొప్పతనమును నేనేమి చెప్పగలను॥

మ॥ ఘన వేదత్రయ పండితుండు
కదు విఖ్యాతిన్ విరాజిల్లు స
జ్జన వంద్యుండగు తంగిరాలకులు
డిచ్చన్ బాల గంగాధరుం

డనవద్యస్థితిమై పరిష్కృతిని
జేయన్ గల్గుటన్ చూడ, కాం
చన మేతావుల గ్రుమ్మరించునటు
స్వచ్ఛంబయ్యె నీ యోగ్యతన్॥

చ॥ సరసులు, మంత్రవేత్తలును,
సజ్జను, లాగమ వేదశాస్త్ర ధీ
వరులును, ఉప్పలూరి, పిడపర్తియు,
కొల్లురి, యాదియార్ష ధర్మసం
స్కరణము సేయు పండితుడు,
సజ్జనుడౌ పురుషోత్తముండు
సురుచిర గ్రంథరత్నమును చూచి
ప్రశంస లొసంగినారహో॥

మ॥ పదికాలంబులు నీదు పుస్తకము
శర్మా! వైదిక శ్రేష్ఠులున్
మదియం దాస్తిక బుద్ధి హెచ్చ
భువిలో మాన్యత్వమున్ గాంచ సం
పదలన్ శంకరుడీయ పాశుపత
దివ్యగ్రంథ సంధాతకున్
హృదయాహ్లాదము కల్గుగావుత
సతమ్మార్తిన్ బాసి వర్ధిల్లగన్॥

మ॥ పరమోత్కృష్టము గొప్ప గ్రంథ
మిది శోభన్ నీ యదృష్టంబు శం
కరుడే వ్రాయగజేసె నీ విమల
సంకల్పం బనల్పంబుగా
చరితార్థంబయి కీర్తి నిచ్చుచును
వాంఛన్ లోకకళ్యాణమున్
వరలన్ జేసిన నిన్ను శంకరుడు
శోభన్ గూర్చి రక్షించుతన్ ॥

ఇట్లు,

4-10-72. బు॥ వెం॥ రా.

—*—

# నమః పుష్పాంజలి

నేను మహాన్యాసపూర్వక మహాపాశుపత సహిత రుద్రాఽభిషేకవిధి యను గ్రంథమును పరమేశ్వర ప్రేరణచే, నాఅల్పపాండిత్యముతో బహుగ్రంథములను బహుశ్రమతో పరిశ్రమచేసి గ్రథనము చేసినాను.

"ఆపరితోషాద్విదుషాం నసాధుమన్యే ప్రయోగ విజ్ఞాన" మనే సూక్తిచే లోకోత్తరులగు పండితుల మన్ననలందినవేగాని, ఈ గ్రంథము నిర్దుష్టము కానేరదని అట్టి పండితుల నన్వేషించు చుండ, నాపురాతన భాగ్యవశమున, శ్రీ పరమేశ్వరకృపచే ఋగ్వేద, యజుర్వేద, అథర్వణవేదములను, సభాష్యముగా అధ్యయనము చేయుటేగాక, జ్యోతిశ్శాస్త్ర, ధర్మశాస్త్ర, శ్రౌత స్మార్తాగమాదులందు ఏకైకవ్యక్తిగా, ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వము వారి మన్ననలతో ప్రప్రథమ సన్మానమంది, ఆంధ్రరాష్ట్ర మందు ప్రథమ పండితులుగా పరిగణనచేయబడి, విశేషఖ్యాతి గాంచిన

"సాంగత్రివేదాచార్య" "వేదార్థాభిజ్ఞ" "ధర్మశాస్త్రాభిజ్ఞ" త్యాద్యనేక బిరుదాంకితులైన ఇరగవరం (తణుకు తాలూకా) గ్రామవాస్తవ్యులు **శ్రీ తంగిరాల బాలగంగాధర శర్మ** గారి నామము గోచరించినది. గోచరించుటే తడవుగా శ్రీ వారి దర్శనమునకై వారి గృహము

నకు వెళ్ళి, వచ్చిన పనివిన్నవించితిని. వారు వెంటనే దయతో ఆమోదించి, నాపరిశ్రమ నెంతయో కొనియాడుచు, ఈ గ్రంథ గ్రథనమునకు నాచే ఏయేగ్రంథములు మూలాధారముగా గ్రహించబడినవో, వాని నన్నిటినీ, సుంతయూ విసువు గొనక, నిద్రాహారములు, యితర కార్యక్రమములు మాని తదేకదీక్షతో ఈ గ్రంథమును పరిశోధించి వారి ఆమోదమును లిఖితరూపమున నాకొసంగిరి. శ్రీవారి దివ్యాశీస్సులతో ఈ గ్రంథము "సశాస్త్రీయ రుద్రాభిషేక విధి" యను పేరుతో ఆస్తికలోకమున కందించగలిగితిని. శ్రీవారికి కృతజ్ఞతాపూర్వక "న మ స్సు మా ం జ లి" నర్పించుకొనుచున్నాను. మరియు అడిగినంతనే ఏతద్గ్రంథమును చిత్తగించి తమతమ అమూల్యాభిప్రాయముల ననుగ్రహించిన సుప్రసిద్ధ పండితవరేణ్యులకునూ, ఏతద్గ్రంథప్రమాణీభూతమహాగ్రంథాన్వేషణకునూ ఈ పవిత్రగ్రంథముద్రణకు విరాళము లొసగిన దాతలకునూ, అడిగినవెంటనే ముద్రితాముద్రితములగు గ్రంథము లొసగిన సహృదయులకు, తత్తద్గ్రంథకర్తలకునూ ప్రోత్సాహకులకునూ అనతికాలములో ముద్రణగావించిన మాస్టర్‌మన్ ముద్రాశాల, కాకినాడ వారికినీ, కృతజ్ఞతాపూర్వక నమస్సుమాంజలుల నర్పించుకొనుచున్నాను.

— గ్రంథకర్త.

*****

శ్రీరస్తు.

# రుద్రాభిషేక ధర్మ దీపిక

## — ధర్మ ప్రశంస —

సూ॥ ధర్మిణాం విశేషేణ స్వర్గంలోకం ధర్మవిదా ప్నోతి జ్ఞానాభినివేశాభ్యా మితి ధర్మోధర్మః ॥

వ్యా॥ సంప్రతియేలోకే ధర్మమను తిష్ఠంతితేభ్యో జ్ఞాత్వానుతిష్ఠ న్విశిష్ట ఇత్యాహ ॥

ధర్మిణః ధర్మవంతః ధార్మికాస్తేషాం యో ధర్మవిత్ ధర్మం తత్వతోవేత్తి సః జ్ఞానాభినివేశాభ్యాం అభినివేశస్తాత్పర్యే ణానుష్ఠానం జ్ఞానేనాభి నివేశేచ కేవలానుష్ఠాతృభ్యః విశేషేణ స్వర్గంలోక మవాప్నోతి ధర్మోధర్మః ఆదిత ఆరభ్య ఏవమంతో ధర్మఉక్తః ॥

(ఇతి గౌతమధర్మసూత్ర వృత్తౌ మితాక్షరాయాం ఏకోన త్రింశఖండే ౨౨-౧ సూత్రమ్.)

తా॥ ఇప్పుడు ఎవరు లోకమందు ధర్మమును మాత్రి మనుష్ఠించు చున్నారో వారికంటె తత్వతః తెలుసుకొని యాచరించువాడు విశిష్టుడని చెప్పుచున్నారు. ధార్మికులలోపల ఎవడు ధర్మమును యెరింగినవాడో వాడు కేవలము అనుష్ఠాతలకన్ననూ జ్ఞానాభినివేశము కలవారికంటెను

విశేషించి స్వర్గలోకమును పొందుచున్నాడు ఆదినుండి అంతము వరకూ ఈ ప్రకారము ధర్మము చెప్పబడినది గాన ధర్మాచరణ తత్పరుడు తత్తత్కర్మల యందలి విశిష్టతనూ తద్విధినీ చక్కగా తెలుసుకొని యాచరించిన యెడల కామితఫలము వానికి వెంటనే సిద్ధించును.

— శాస్త్రోక్త కర్మాచరణావశ్యకత —

శ్లో॥ యశ్శాస్త్రవిధి ముత్సృజ్య - వర్తతే కామకారతః
రససిద్ధి మవాప్నోతి - న సుఖం నపరాంగతిం ॥
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే-కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం - కర్మకర్తు మిహార్హసి ॥

(భగవద్గీత)

తా॥ "ప్రసిద్ధమైన శాస్త్రమును విడిచి తన ఇష్టానుసారము ఎవరు వర్తింతురో వారికి తత్వజ్ఞానము కలుగుట దుర్లభము సుఖము కలుగదు. ముక్తి దొరకదు కాబట్టి 'ఈపని చేయుట అర్హము ఈపని చేయుట అనర్హము' (వ్యర్థ ము అగును) అనెడు శాస్త్రవిధులను సక్రమముగా తెలుసుకొని కర్మలను చేయుము." అని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునికి ఉపదేశించెను.

ఇత్యాది వచనాని బహూనిసంతి

శః మొదలగు ప్రమాణవాక్యములు ఎన్నియో గలవు. విధ్యుక్తముగా చేసినకర్మ సత్ఫలదాయక మగును. విధ్యుక్తముగా చేయని సత్కర్మ సత్ఫలము నీయదు సరిగదా ప్రత్యవాయముకూడ కలుగవచ్చును.

— శతరుద్రీయ మహాత్మ్యం —

*1 శతం రుద్రాదేవతాయస్య॥ నూరుగురు అనగా అనంతరుద్రులు దేనికి దేవతలో అట్టిది అను వ్యుత్పత్తిచే శత రుద్రీయ మనిపించుకొనుచున్నది. సంహిత 4 కాం 5 ప్రశ్నా త్మకమగు రుద్రాధ్యాయము పరమపవిత్రము.

2. స్తేయం కృత్వా గురుదారాంశ్చగత్వా మద్యం పీత్వాబ్రహ్మహత్యాంచకృత్వా భస్మచ్ఛన్నో భస్మశయ్యా శయనో రుద్రాధ్యాయీ ముచ్యతే సర్వపాపైః॥ (పరాశరః)

పంచమహాపాపములను చేసినవాడైనను భస్మధారియై భస్మ శయ్యపై పరుండి రుద్రము నధ్యయనము చేసిన యెడల సర్వపాప విముక్తుడగును.

3. యశ్శతరుద్రీయ మధీతేసోఽగ్నిపూతోభవతి సురా పానాత్పూతో భవతి బ్రహ్మహత్యాత్పూతో భవతి కృత్యా కృత్యాత్పూతో భవతి తస్మాదవిముక్తమాశ్రితో భవతి అత్యా శ్రమీ సర్వదా సకృద్వాజపేత్ అనేన జ్ఞానమాప్నోతి సంసా రార్ణవతారకం (నాశనం)

(కైవల్యోపనిషత్)

తా॥ ఎవరు శతరుద్రీయమును పఠించుచున్నారో వారు అగ్ని పూతులగుదురు. సురాపాన బ్రహ్మహత్యాది పాతక విముక్తులగుదురు. ఒక్కసారి జపించినా సంసార సముద్రమును దాటి జ్ఞానులగుదురు.

4. రహసికృతానాం మహాపాతకానామపి శతరుద్రీయం ప్రాయశ్చిత్తమ్ (శంఖః)

తా॥ రహస్యముగా చేసిన మహాపాపములకు రుద్రపఠనము ప్రాయశ్చిత్తము.

శ్లో॥ ఏకాదశగుణాన్వాపి - రుద్రానావృత్య ధర్మవిత్
మహాపాపై రపిస్పృష్టో - ముచ్యతే నాత్ర సంశయః॥
(అత్రిశ్చ)

తా॥ మహాపాపములు చేసినవాడు 11 సార్లు రుద్రము పఠించిన ఆ పాపములు పోవును సందేహములేదు.

శ్లో॥ యశ్చరుద్రాన్ జపేన్నిత్యం ధ్యాయమానో మహేశ్వరం
యశ్చసాగర పర్యంతాం సవృక్షజలశోభితాం
దద్యాత్కాంచన సంయుక్తాం భూమించౌషధి
సంయుతాం
తస్మాదప్యధికంతస్య సకృద్రుద్రజపాద్భవేత్
మమభావం సముత్సృజ్యయస్తు రుద్రాన్ జపేత్సదా
సతేనైవచ దేహేన రుద్రః సంజాయతే ధృవం
(వాయుపురాణం)

తా॥ పర్వతారణ్య జలాన్వౌషధీ యుక్తమైన సకల ధరణీమండలమునూ బంగారముతో దానముచేసిన వానికంటె ఒక్కమారు రుద్రపఠనము చేసినవారికి ఎక్కువపుణ్యము కలుగును మమకారము వదలి ఎవరు రుద్రపారాయణము చేయుదురో వారలాశరీరముతోడనే రుద్రత్వము నొందుదురు.

శ్లో॥ వేదేషు శతరుద్రీయం దేవతా సుమహేశ్వరః
స్కాందస్సర్వ పురాణేషు సర్వస్మృతిషు మానవం ॥
(వ్యాసః)

తా॥ వేదములలో శతరుద్రీయము దేవతలలో ఈశ్వరుడు, పురాణములలో స్కాందము స్మృతులలో మను స్మృతియునూ గొప్పవి.

శ్లో॥ సర్వేషు గ్రహదోషేషు దుస్స్వప్నాద్భుత దర్శనే
జపన్ రుద్రాన్ సకృద్విప్రః సర్వదోషైః ప్రముచ్యతే
రోగవాన్ పాపవాన్ యస్తు రుద్రంజప్త్వా జితేంద్రియః
రోగాత్పాపాత్ప్రముక్తోసావతులం సుఖమశ్నుతే
(లింగే ఉత్తరార్థే)

శ్లో॥ అనపత్యాది దోషేషు శాకిన్యాది గ్రహేషుచ
సర్వజ్వర వినాశాయ రుద్రజాపో వినిశ్చితః
(ఆపస్తంబః)

తా॥ సమస్తమైన గ్రహదోషములయందు, దుస్స్వప్న అద్భుత దర్శనమందు ఒక్కసారి రుద్రాధ్యాయమును జపము చేసినయెడల

సమస్త దోషములచేత విడువబడునని వాయుపురాణము. వ్యాధిగ్రస్తుడును, పాపాత్ముడును రుద్రములను జపించినయెడల రోగమునుండి పాపము నుండి విముక్తుడై గొప్ప సౌఖ్యమును పొందును అని లింగపురాణము.

సంతానహీనులకు సంతానము కలుగుటకూ, శాకినీ ఢాకిన్యాది గ్రహ బాధలు తొలగుటకు సమస్త జ్వరములూ పోవుటకూ రుద్రపారాయణము ముఖ్యమని అపస్తంబులు

జల, ఫల, పత్రి, పుష్పములు శివున కర్పించిన మానవులకు సమస్త కామితవస్తువులను, ఆ అర్పితవస్తువులే సమకూర్చునని ధర్మఖండము 8 వ అశ్వాసము.

## — శివపూజాఫలం —

శ్లో॥ యద్ద్వారే మత్తమాతంగాః- వాయువేగాస్తురంగమాః
పూర్ణేందువదనానార్యః శివపూజావిధేః ఫలం ॥

శ్లో॥ ఐశ్వర్యమీశ్వరాదిచ్ఛేత్.

(పురాణవాక్యం)

తా॥ మత్తగజములూ, ఉత్తమాశ్వములు, పూర్ణచంద్రవదనలైన స్త్రీలు ఎవరి ఇంట ఉండెనో, అది వారు చేసిన శివపూజా ఫలితమే అనుమానములేదు. ఈశ్వరానుగ్రహమువలనగాని మానవుడు ఐశ్వర్యవంతుడు కాలేడు. గాన మానవుని తరింపచేయుటకు శివారాధనకంటె

సులభోపాయము లేదు. ఇహమందు ఐశ్వర్యము, పరమందు ముక్తిని ప్రసాదించే దేవుడు శివుడే అని వేదశాస్త్రములు వేనోళ్ళ ఘోషించుచున్నవి.

రుద్రాభిషేకము శైవాగమముల ననుసరించియే చేయవలెనని శంకరులు

## — ఆగమ విశిష్టత —

శ్లో॥ అష్టాదశ సు విద్యాసు - మీమాంసాపిగరీయసీ
తతోఽపితర్క శాస్త్రాణి - పురాణంతేభ్య ఏవచ
తతోఽపి ధర్మశాస్త్రాణి - తేభ్యో గుర్వీశ్రుతిర్ద్విజ
తతో ప్యు పనిషచ్ఛ్రేష్ఠాస్తత శ్శైవాగమోధికః

(సిద్ధాంతసారావళ్యాం)

తా॥ అష్టాదశ విద్యలలోనూ మీమాంసయూ, మీమాంస శాస్త్రముకంటె తర్కమూ, తర్కముకంటె పురాణములూ, పురాణముల కంటె ధర్మశాస్త్రములూ, ధర్మశాస్త్రములకంటె వేదములూ, వేదముల కంటె ఉపనిషత్తులూ ఉపనిషత్తులకంటె శైవాగమములు గొప్పవి. వీనినే వేదాగమములనికూడా అందురు. ఈశ్వరప్రోక్తములైన కారణముచేత కామికాగమము కారణాగమము మొదలైన శైవాగమములు చాలా గొప్పవని వేదవ్యాసులు మొదలైన మహర్షులు అనేక గ్రంథములలో వక్కాణించిరి.

శ్లో॥ యేద్విషంతి శివం దేవాన్ వేదాన్ యజ్ఞాన్ శివాగమాన్। అధోముఖోర్థ్వ పాదాస్తే పచ్యంతే నరకాదిషు
(శివధర్మోత్తరే)

ఎవరు శివుని, దేవతలనూ, వేదములనూ, ఆగమములనూ, కారణకామిక శైవాగమాదులను ద్వేషించెదరో అనగా శివశాసనమునకు వ్యతిరేకముగా చేయుదురో వారికి నరకము సంభవించును. మరియు అట్టి వారిని యమకింకరులు తలక్రిందుగా బెట్టి బాధించెదరు గాన శైవాగమ విదులకు వ్యతిరేకముగా రుద్రాభిషేక పూజాదుల నాచరించకూడదు

— స్వ రా ప రా ధ దో ష ము —

మంత్రములు స్వరభేదముచే భిన్నార్థబోధకము లగుచు వ్యతిరేకఫలము నిచ్చును. ఇందుకు వృత్రాసుర జననకథయే తార్కాణము. గాన స్వరయుక్తముగా సద్గురువునొద్ద నభ్యసించి స్వరయుక్తముగా నుచ్చరించుట చాలా ముఖ్యము గాన మంత్రసిద్ధులైన విప్రులచే నభిషేకము చేయించుకొనవలయును

ఆదినుండియూ స్వయంవ్యక్తమైన వేదము గురుశిష్య పరంపరగా నభ్యసించబడుటచే ఆమ్నాయమనబడుచున్నది. మరియు వేదములు ఉపదేశ్యములు గనుకనే "శ్రుతులు" అను పేరు కలిగెను.

ఉదాత్త అనుదాత్త స్వరితములు 3 విధములు మరియు దీర్ఘస్వరిత ఉచ్చైరుదాత్త నీచైరనుదాత్తాది స్వరలక్షణములను పాణిన్యాదులుచెప్పిరి. వేదమంత్రములు స్వరయుక్తముగా నెట్లుచ్చరించవలెనో గురుముఖతః చెప్పుకొనవలెను.

స్వరగుర్తులు వేశినా, చూచి చదివినయెడల ప్రత్యవాయము సంభవించును, సుస్వరయుక్తముగా వేదమంత్రము లుచ్చరింపబడిన వెంటనే ఆశబ్దతరంగములు గాలియందు చేరి అతి సూక్ష్మరూపములో అంతటా నిండియుండు ధ్యేయమూర్తియందు చేరును లేక ధ్యేయమూర్తి గమనము మంత్రము నుచ్చరించువానివైపున కీడ్చును.

అందువలన ఆ మంత్రార్థము ననుసరించి ఆ కర్త యొక్క కోరికలు ఆ దైవముయొక్క దివ్యానుగ్రహము వలన వెంటనే నెరవేరి తీరును. మహామహిమగల వేదమంత్రములను సుస్వరయుక్తముగా నుచ్చరించుట ఎంతయో ముఖ్యము "మంతారంత్రాయత ఇతిమంత్రాః" అనగా మననము చేయువారిని రక్షించును గాన మంత్రము లనబడుచున్నవి.

— మంత్రవిశిష్టత —

శ్లో॥ మకారో మననం ప్రాహుః త్రకారస్త్రాణ ఉచ్యతే
మననత్రాణ సంయుక్తో మంత్ర ఇత్యభిధీయతే

మకారో జీవసంజ్ఞ స్స్యాత్ త్రకారశ్చాత్మసంజ్ఞికః
జీవాత్మ సంజ్ఞ యోరైక్యం మంత్రమిత్యభిధీయతే
మకారం మానసంప్రోక్తం త్రకారం బుద్ధిలక్షణం
బుద్ధిర్మనోభ్యాం సంజ్ఞోఽయం మంత్రమిత్యభిధీయతే
(సూ. సం.)

తా॥ మకారము మననము, త్రకారము త్రాణము. మననత్రాణ సంయుక్తమైనది గాన మంత్రమని చెప్పుదురు. మరియు మకార మనగా జీవుడు త్రకారమనగా ఆత్మ జీవాత్మైక్యమే మంత్రమని కొందరు చెప్పుదురు. మరియు మకార మనగా మానసము త్రకారమనగా బుద్ధి. మనో బుద్ధుల సంజ్ఞయే మంత్రమందురు.

— లింగస్వరూప కథనమ్ —

శ్లో॥ శివఏవ స్వయం లింగం లింగం గమక మేవవా
శివేన గమ్యతే సర్వం శివోనాన్యేన గమ్యతే ॥

వ్యా॥ శివోపి స్వప్రకాశ చిద్రూపత్వేన సర్వజడాజడవర్గస్య గమకో। నత్వన్యేనగమ్యః అతోగమక త్వాత్స్వయమేవ లింగం ॥

శ్లో॥ స్వయంజ్యోతి రిత్యాహశ్రుతిస్సాద్వీ మహేశ్వరం
"తస్యభాసా సర్వమిదం విభాతీ" త్యపిచాఽఽహి ॥

శ్లో॥ శివస్యలింగం శివలింగమన్యే మునీశ్వరా వేదవిదోవదన్తి స్వయంప్రకాశస్య నయుజ్యతేన్యస్తతశ్చ శంభున్స్వయ మేవలింగం ॥

శ్లో॥ సంసారార్ణవమగ్నానా మజ్ఞానాంధీకృతాత్మనాం
చిత్తపాకానుగ జ్యేన భావనార్థం ద్విజర్షభాః ॥
అనాధారస్యదేవస్య శివస్య పరమాత్మనః
ఆధారో మంత్రసంస్కారాత్కల్పి తస్సత్యవద్బుధాః ॥
లయనాల్లింగ మిత్యాహుః అపరేవేదవిత్తమాః
తదాచలింగం భగవాన్ స్వయమేవ మహేశ్వరః ॥

వ్యా॥ అవిద్యయా కలుషీకృత చిత్తానాం, పరశివ స్వరూపజ్ఞానరహితానాం, సంసారిణాం, తచ్చిత్తపరిపాకాను సారేణ ప్రతిబంధక పాపక్షయార్థం ధ్యానపూజాదికం కర్తవ్యం అత స్తదర్థం నిరాధారస్యాపి, పరశివస్య బాణలింగాది లక్షణ ఆధారః ప్రాసాద పంచబ్రహ్మాది మంత్రయుక్తా సంస్కారైః ప్రతిష్ఠావ్యాత్మకైః పరమార్థవదాగమైః పరికల్పితమిత్యర్థః॥

అతః పూర్వోక్త పరశివ స్వస్వరూపజ్ఞానవ తాం
శివలింగం తదనుసంధానమేవ తస్య యజనం
తద్రహితానాంతు మృచ్ఛిలాదిమతం శివస్యాధారత్వేన
పరికల్పితం బాహ్యలింగం పూజనీయ మిత్యర్థః ॥

(సూతసంహిత)

తా॥ శివుడే లింగస్వరూపుడు. శివునిచేత సర్వము నడిపించ బడుచున్నది. శివుడు గమకుడేగాని గమ్యుడు కానేరడు. ఆ లింగము స్వయంజ్యోతి స్వరూపమని వేదము చెప్పుచున్నది. దాని కాన్తిచేతనే సమస్తము ప్రకాశించుచున్నదని భవాని మహేశ్వరునితో పలికెను.

ఇతరులైన వేదవేత్తలగు మునులు "శివస్యలిఙ్గం శివలిఙ్గమ్" అని వ్యాఖ్యానించిరి. అది స్వయంప్రకాశమానమే. అన్యముచే ప్రకాశింప చేయబడునదిగాదు.

సంసార సముద్రములో మునిగిన అజ్ఞానులు జ్ఞానోపార్జన నిమిత్తము ఆధారరహితుడగు దేవునకు మంత్రసంస్కారమువలన ఆధారము సత్యమువలె కల్పించబడినది. లయము చేయునది గాన లింగమని కొందఱు వేదవేత్తలు నుడివిరి. కావున లింగము భగవంతుఁడే, స్వయం మహేశ్వరుడే.

అనగా అవిద్యచే కలుషీకృతమైన హృదయముగల వారలకున్ను, శివస్వరూపము తెలియని మూఢులకున్నూ పాపములు నశించి జ్ఞానసముపార్జన కొరకు నిరాధారుడైన శివునకు మంత్రాదులచే ఆధారము కల్పింపబడినది.

కావున పరశివజ్ఞానము గలవారికి ఈ కల్పితప్రసక్తి లేకయే ఆత్మాను సంధానముచే ముక్తిని పొందగలరు. జ్ఞానరహితులు అధారత్వేన కల్పితమగు బాహ్యలిఙ్గమును పూజింపవలెను.

## — లింగస్థాన ఫలాని —

శ్లో॥ స్వయం భూస్థాపితం చాపి - పౌరుషేయమ పౌరుషం
గ్రామాద్బహిస్థితం లింగం-గ్రామాచ్ఛతగుణం స్మృతం
బాహ్యాచ్ఛతగుణం పుణ్య - మరణ్యేచ ప్రపూజనే
వన్యాచ్ఛతగుణం పుణ్యం లింగం వైపర్వతస్థితం
పర్వతాచ్ఛాయుతం పుణ్యం తపోవన సమాశ్రితం
కాశ్యాంతు స్థాపితం లింగం పూజితం స్యాదనంతకం
ఏవం విశేషలింగానాం - తీర్థానిచ విశేషతః
జ్ఞాత్వాధ శివపూజాయాం-విధిం శంభుం ప్రపూజయేత్
(ఆగమవాక్యం)

తా॥ స్వయముగా వెలసిన లింగములూ పౌరుషేయములూ అపౌరుషములూ అగు లింగములను పూజించవలెను. గ్రామములో ఉన్న లింగమును ఆరాధించుటకంటె గ్రామమునకు వెలుపలనున్న లింగమును పూజించినయెడల నూరురెట్లున్నూ, గ్రామబహిర్లింగము కంటె అరణ్య లింగమున్నూ, అరణ్యలింగముకంటే పర్వతముపైనున్న లింగమున్నూ నూరేశి రెట్లు ఫలిత మిచ్చును, పర్వత లింగము కంటే తపోవన (మున్యాశ్రమము యత్యాశ్రమము) ములందు గల లింగములు 10 వేల రెట్లు పుణ్యమిచ్చును.

పరమపవిత్రమైన కాశీక్షేత్రమందున్న ఏలింగమును పూజించినా అనంత పుణ్యము కలుగును.

పెద్దలవలన లింగములనూ క్షేత్రములనూ పూజావిధినీ తెలుసుకొని అభిషేక పూజాదు లొనర్పవలయును.

## — భా వ న —

శ్లో॥ మంత్రే, తీర్థే, ద్విజే, దైవే, దైవజ్ఞే, భైషజే, గురౌ,
యాదృశీభావనాయత్ర - సిద్ధిర్భవతి తాదృశీ ॥

**తా॥ మంత్ర, తీర్థ, బ్రాహ్మణ దైవ, దైవజ్ఞ, గురువులయందు భావన ఏలా ఉంటే ఫలిత మాలాగుననే కలుగును.**

శ్లో॥ గురౌ మనుష్యబుద్ధించ మంత్రేచాక్షర బుద్ధికాం ।
ప్రతిమాసుశిలాబుద్ధిం కుర్వాణో నరకం వ్రజేత్ ॥

**తా॥ గురువును మనుష్యుడనీ, మంత్రమును అక్షరములనీ, విగ్రహములను పాషాణములని యెవరు భావించెదరో వారు నరకమును పొందుదురు.**

## — దేవాలయాదిషు స్పర్శదోషనిషేధః —

శ్లో॥ దేవాలయే నదీతీరే - తీర్థే వైవాహికే తథా ।
నౌకాయాం యజ్ఞశాలాయాం స్పర్శదోషో నవిద్యతే
దోషం నిశ్చిత్యమూఢాత్మా రౌరవం నరకం వ్రజేత్ ॥
(శైవకారికావృత్తౌ ఆహ్నిక ప్రకరణం)

**తా॥ దేవాలయమునందు, నదీ తీరమందు, తీర్థమందు, వివాహమునందు, పడవ, లాంచి మొదలైనవాటియందు, యజ్ఞశాలల**

యందు ఒకరి నొకరు తాకిన దోషములేదు. దోషమున్నదను మూఢులు రౌరవనరకమును పొందుదురు.

— ఆర్ద్రవస్త్ర నిషేధము —

శ్లో॥ అమంగళాని సర్వాణి హ్యార్ద్రవస్త్రాశ్రితానిచ ।
తస్మాత్స్కంధేక్వచిద్ధీ మానార్ద్రవస్త్రం నధారయేత్॥
(స్మృతిసారసంగ్రహే)

శ్లో॥ స్కంధే కవాటే పాషాణే ఆర్ద్రవస్త్రం ననిక్షిపేత్
నిక్షిపేద్యది మూఢాత్మా సచేల స్నాన మాచరేత్ ॥
(కపర్ది)

శ్లో॥ నగ్నశ్చార్ద్రపటస్మృతః ।

తా॥ సమస్తమైన అమంగళములునూ తడిబట్టను ఆశ్రయించుకొని యుండును. గనుక బుద్ధిమంతుడైనవాడు తడిబట్టను భుజముమీద వేసుకొనకూడదు. తడిబట్ట కట్టుకొని శుభకర్మలు చేయకూడదు.

మరియు భుజముపైననూ, తలుపుపైననూ, రాతిమీదనూ తడిబట్టను ఉంచకూడదు. అలా ఉంచినయడల సచేలస్నానము చేసినగాని శుద్ధుడుకాడు.

తడిబట్ట కట్టుకొనినవాడు దిగంబరునితో సమానము.

(ఆపద్ధర్మ విషయములో మాత్రము 7 మారులు సూర్యుని కెదురుగా తడిబట్టను గాలిలో ఎగురవేసి ధరింపవచ్చునని కొందరి మతము )

## — రుద్రాభిషేక కర్తృనియమాః —

శ్లో॥ యానైర్వా పాదుకాభిర్వా - గమనం భగవద్గృహే ।
ఉచ్ఛిష్టైశ్చైవమాశౌచే - భగవద్వందనాదికం ॥
పాదప్రసారణం చాగ్రే తథా పర్యంకబంధనం ।
నిగ్రహానుగ్రహశ్చైవ స్త్రీషు సాకూతభాషణం ॥
కంబలావరణం చైవ పరనిందా పరస్తుతిః ।
శయనం భోజనం చైవ మిథ్యాభాషణమేవచ ।
అశ్లీలకథనం చైవ అధోవాయు విమోచనం ।
పృష్ఠీకృత్వాసనం చైవ పరేషా మభివందనం ॥
తత్తత్కాలోద్భవానాంచ ఫలాదీనామ నర్పణం ।
వినియుక్తావశిష్టస్య ప్రదానం వ్యంజనాదికం ।
గురౌ మౌనం నిజస్తోత్రం దేవతానిందనం తథా ॥
తాంబూల చర్వణం ఛత్రం అకాలేదర్శనం తథా ।
ఉచ్చైర్భాషా వృథాభాషా రోదనాద్యం నకారయేత్ ॥
(ఆగమవాక్యం)

తా॥ దేవాలయమునకు వాహనము నధిష్ఠించి వెళ్ళకూడదు. పాదరక్షలను ధరించి వెళ్ళకూడదు. ఇంటివద్దగాని నదియందుగాని స్నానము చేసిననూ కాళ్లూ చేతులూ నోరు ముఖము ప్రక్షాళనము చేసుకొని మరీవెళ్ళవలెను. ఆలయములో కాళ్ళు చాపుకొని కూర్చుండరాదు. దర్పంగా కూర్చుండ కూడదు. ఆలయములో ఉన్నంతవరకు ఎవరి పైనా

కోపగించుటగాని ఎవరినీ ఆప్యాయముగా పలకరించుటగాని చేయరాదు.

స్త్రీలతో నర్మగర్భముగా మాట్లాడకూడదు. ఆలయంలో తివాసీ చాప మొదలగునవి పరచుకొని కూర్చుండరాదు. పరనింద, పరస్తుతి చేయరాదు. అవాచ్యము లనకూడదు. అపానవాతమును వదలరాదు. అనృత సంభాషణ, వ్యర్థసంభాషణ చేయరాదు. దేవునివైపు పృష్ఠ భాగము పెట్టి కూర్చుండరాదు. దేవాలయములో ఉండగా దేవునకు తక్క తదితరుల కెవ్వరికీ నమస్కరించకూడదు. తత్తత్కాలముల యందుండు ఫలములను తేకుండా "తెద్దామనుకున్నాను తేలేదు" అని అనకూడదు. దేవపూజార్థమై తెచ్చిన పదార్థములు దేవునకు వినియోగించకుండా ఎవరికీ ఇవ్వకూడదు. గురువుపట్ల కూడనూ మౌనముగా ఉండవలెను. ఆత్మ స్తుతి పనికిరాదు. ఏదేవునీ నిందించకూడదు. తాంబూలము వేసుకొనక కూడదు. గొడుగు వేసుకొని గుడికి రాకూడదు. గట్టిగా మాట్లాడకూడదు. విచారవదనముతో నుండరాదు. మౌనముగా ఉండిన మహాఫలము. నియమభంగమైన 108 సార్లు "ఓం" కారమును జపించవలెను.

శ్లో॥ గ్రామోత్సవేకృతే శంభోరాలయే లింగపూజనం।
నకుర్యాత్స్నానదానాదీన్‌కుర్యాచ్చేన్నిష్ఫలంభవేత్ ॥

ఉత్సవమూర్తులు గ్రామములో ఊరేగింపు మహోత్సవ ములో ఉండగా ఆలయంలో లింగమునకు పూజ, అభిషే

కము చేయకూడదు. దానధర్మములను చేయరాదు. అలా చేసినయెడల ఆ అభిషేక పూజాదానాదులు నిష్ఫలమగు చున్నవి.

మరియు పూజాభిషేక సమయములందు పూజచేయు యజమాని దీర్ఘరోగులను, పతితులను, శ్వానకుక్కటాదులను చూడకూడదు. ప్రమాదవశాత్తు చూచినయెడల ఆచమనము చేసి ఓంకారము 108 సార్లు జపించి తన కుడిచేతితో తన కుడి చెవిని స్పృశించవలెను, దేవాలయములో తొలుత కుడిపాదము నుంచవలయును. నందీశంకరులయొక్క మధ్యనుంచి నడచిన పూర్వపుణ్యము నశించును.

## — మౌనమ్ —

శ్లో॥ సంధ్యయోరుభయోర్జాప్యే భోజనే దంతధావనే
పితృకార్యేచ దైవేచ తథామూత్రపురీషయోః
గురూణాం సన్నిధానేచ యోగేచార్చావిధేతథా
ఏషుమౌనం సమాతిష్ఠన్ స్వర్గమాప్నోతి మానవః
సకృదుచ్చారితేశబ్దం ప్రణవం సముదీరయేత్ ॥

(స్మృతివాక్యం)

తా॥ ఉభయసంధ్యా సమయములందును, జపసమయమునందును, భోజన, దంతధావన, పితృకార్య, దేవపూజాకాలములయందును, మల మూత్రవిసర్జనాసమయ మందును, గురుసన్నిధియందును, యోగాభ్యాస

సమయమందును అర్చనాకాలమందును మౌనవ్రతము బూనిన మానవుడు దేహాంతమున స్వర్గమును పొందును. ప్రమాదమువలన మాట్లాడిన యెడల "ఓం" కారమును 11 సార్లు స్మరించవలయును.

— శివప్రీతికర నిరూపణం —

శ్లో॥ లింగేశివార్చనం నిత్యం వేదోక్తేనైవ వర్త్మనా
దేవదేవస్య విప్రేంద్రాః మహాప్రీతికరం సదా
స్వజాతి విహితాచారో తథాన్యాచార వర్జనం
దేవదేవస్య .... .... .... సదా
శివభక్తిశ్చ విప్రేంద్రా గురుభక్తిస్తథైవచ
దేవ .... .... .... సదా॥

(సూ॥ సం॥ యజ్ఞవైభవఖండే)

తా॥ లింగమునందు వేదోక్తప్రకారముగా శివారాధనయును, స్వకులోచిత విధానమైన ఆచారమును విడువకుండుటయును, శివభక్తియును, గురుభక్తియును శివునకు మహాప్రీతికరములు.

— భస్మప్రభావం —

శ్లో॥ భాసకంభసితంచోక్తం భస్మకల్మష భక్షణాత్
భూతిర్భూతికరంపుంసాం రక్షారక్షకరం పరం।
భస్మనోద్ధూళణం చైవతథాతి ర్యక్త్రిపుండ్రకం
స్నానత్వేనైవసర్వేషాం విధత్తేవైదికే శృతిః॥

తా॥ విభూతి సర్వకలుషముల నణచివేయును విభూతి సంప త్కరము, విభూతి రాక్షసాదులనుండి రక్షించును. విభూతి నడ్డముగా త్రిపుండ్రములలో ధరించిన స్నానముతో సమానమని వేదప్రమాణము. భస్మము శాశ్వతమైనది, భస్మమును భస్మముచేయునది యేదియును ఉండదు.

— వర్జ్యమును పాటించనక్కరలేని సమయములు —

శ్లో॥ స్నానేదానేజపేహోమే వైశ్వదేవే సురార్చనే।
ప్రాయశ్చిత్తేతథాశ్రాద్ధే ప్రసిద్ధాః విషనాడికాః ॥
ఆసనే శయనే భోజ్యే మలమూత్ర విసర్జనే ।
ఉగ్రకర్మణ్యస్త్రవధే ప్రశస్తాః విషనాడికాః ॥
(స్మృతివాక్యం)

తా॥ స్నాన,దాన, జప, హోమ, వైశ్వదేవ, దేవతాపూజ లందును, ప్రాయశ్చిత్త శ్రాద్ధకర్మలయందును వర్జ్యదోషములేదు. కూర్చుండునపుడు, పరుండునప్పుడు, భుజించునపుడు, మలమూత్రవిసర్జన చేయునపుడు, తీవ్రకర్మలయందును, యుద్ధమునందును వర్జ్యఘడియలు ప్రశస్తములు.

— భస్మధారణావశ్యకత —

శ్లో॥ వినాభస్మత్రిపుండ్రేణ చోపవస్త్రం వినాతథా
పూజితోపిమహాదేవః నస్యాత్తస్య ఫలప్రదః
తస్మాన్మృదాపి కర్తవ్యం లలాటే వైత్రిపుండ్రకమ్ ॥
(శైవాగమే)

తా॥ భస్మము ధరించక ఉపవస్త్రము (పైమీద అంగవస్త్రము లేక తువ్వాలు) ధరించక శివారాధన చేయకూడదు. అలాచేసిన ఫలము ఉండదుగాన మట్టిచేతనైనను, లలాటమందు తిలకము ధరించి పూజించ వలెను.

— లింగపీఠోపరిద్రవ్య నిక్షిప్త నిషేధః —

శ్లో॥ ధూపపాత్రం దీపపాత్రం గంధపాత్రంతథైవచ
గుడఖండం తథైవాంబుకలశంచ ఫలాని చ।
పూజాద్రవ్యాణి వానారికేళస్య శకలానిచ
ననిక్షిపేల్లింగపీఠే నరకంచక్షిపేద్యది॥
(రుద్రికామ్యార్చనావిధౌ)

తా॥ ధూప, దీప, గంధపాత్రలున్ను, బెల్లంముక్క, ఉదక పాత్రయున్ను, ఫలములున్ను, కొబ్బరిచెక్కలున్ను. తదితర పూజా ద్రవ్యములున్ను లింగపీఠముపై నుంచరాదు. అలా ఉంచినయెడల నరకము కలుగును.

— అ ర్చ క వి శి ష్ట త —

శ్లో॥ ఉమామాతా పితారుద్రో అర్చకః పుత్రఏవచ।
ఆదిశైవాంగ సంబంధి శివారాధన కర్మణి॥
(ఆగమవాక్యం)

తా॥ ఆదిశైవాంగసంబంధమైన శివాభిషేక పూజాదులయందు తల్లి పార్వతీదేవి, తండ్రి శంకరుడు. అర్చకుడు పుత్రుడు, ఈ విధ ముగా భావించవలయును.

## — లింగస్పర్శన దోషం —

శ్లో॥ అర్చకాఽసన్నిధౌలింగం స్పృష్ట్వశ్చేదితరేణవై ।
షష్టిర్వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః ॥

(గౌడపాదః)

తా॥ అర్చకుడు స్వామి సన్నిధిని లేనిదే శివలింగమును స్పృశిం చినయెడల 60 వేల సం॥లు ఆ నరుడు విష్ఠయందు క్రిమియై పుట్టునుగాన శివలింగమునకు అర్చకుని పరోక్షమున అభిషేకపూజాదులను చేయరాదు.

## — అభిషేకపూజా మధ్యజనిత దోషప్రాయశ్చిత్తమ్ —

శ్లో॥ క్షుతేనిష్ఠీవనే చైవ దంతోచ్ఛిష్టే తథాఽనృతే
పతితానాంచ సంభాషే మౌనభంగే విశేషతః ॥
విప్రస్య దక్షిణం శ్రోత్రం చాచామేత్సం స్పృశేత్తతః॥

(స్మృతివాక్యం)

తా॥ తుమ్మినను, ఉమిసినను, అసత్యమాడినను, పతితులతో సంభాషించినను, మౌనభంగము వాటిల్లినను ఆచమనముచేసి తన దక్షిణ కర్ణమును స్పృశించవలయును.

## — విప్రదక్షిణ కర్ణవిశిష్టత —

శ్లో॥ అగ్నిరాపశ్చ వేదాశ్చ సోమసూర్యా నిలాస్తథా
సర్వఏవహి విప్రస్య కర్ణే తిష్ఠతి దక్షిణే
కాశ్యాది సర్వతీర్థాని నర్మదాద్యాపగా స్తథా
వసంతి దక్షిణే కర్ణే విప్రస్య శృతిచోదితం ॥

(వేదవాణీ)

తా॥ అగ్ని, జలము, వేదములు, సూర్యచంద్రులు, వాయువు సర్వమూ విప్రుని దక్షిణ కర్ణమునందు ఉంటున్నవి. మరియు కాశీ మొదలగు పుణ్యతీర్థములు నర్మదాది పవిత్రనదులు విప్రునియొక్క కుడి చెవియందు వసించి యుండును.

— ఘంటానాద సమయాని —

శ్లో॥ ఆదౌ మధ్యేఽభిషేకాంతే ధూపేదీపే తథైవచ
నీరాజనేచ శయనే ఘంటానాదం సమాచరేత్
ఘంటానాద విహీనాయాసాపూజా నిష్ఫలాభవేత్ ॥
(ఆగమవాక్యం)

తా॥ సంకల్పము చేయుటకు ముందునూ అభిషేక కాలమందును అభిషేకానంతరమునందునూ ధూప, దీప, నీరాజన సమయములందునూ పవళింపు సేవయందునూ ఘంటానాదము చేయవలెను. ఘంటానాదము లేని పూజాదులు నిష్ఫలములగును.

— ఏకపార్శ్వతాడన —

శ్లో॥ స్నానే ధూపే తథాదీపే ఏకపార్శ్వంతు తాడయేత్
పార్శ్వాభ్యాం తాడనంచేత్స్యాచ్ఛాగస్యగళఘంటువత్
(శైవాగమే)

తా॥ స్నాన, ధూప, దీప సమయములందు గంట యొక్క ఏకపార్శ్వమందు (ఒకే అంచున) కొట్టవలెను. ఈ

సమయములలో గంట కిరువైపులా (2 అంచులయందునూ) కొట్టినయెడల మేక మెడయందు కట్టిన గంటవలె నిష్ఫలమగును. ఇతర సమయములయందు అనగా పూజా ప్రారంభమందు పూజా మధ్యకాలమందు పూజాంతమందు నీరాజనమందు 2 పార్శ్వములా తగిలేలా కొట్టవలెను.

## — బిల్వ సంగ్రహణవిధి —

శ్లో॥ "నమోఽస్తు బిల్వతరవే శ్రీఫలోదయ హేతవే
చతుర్వర్గ ప్రదాత్రేచ నమోమూర్తి త్రయాత్మనే
సంసార విషవైద్యస్య సాంబస్య పరమేశితుః
అర్చాయైత్వాం హరిష్యామిత్వత్పత్రం సహ్యతామిదం"
ఇతి మంత్రేణయోబిల్వ దళాన్యా హృత్యభక్తితః
లింగార్చనేన కైలాసం సప్రయాణతి వంశజైః
(ఆగమవాక్యం)

తా॥ మారేడు చెట్టువద్దకు వెళ్ళి శ్లో॥ నమోస్తుబిల్వతరవే॥ సహ్యతామిదం। అని ప్రార్థించి వలసిన బిల్వదళములను కోసుకొనవలయును. అటువంటి మారేడు పత్రిచే లింగార్చన చేసినవారు స్వవంశజులతో ఇహమందు సుఖము లనుభవించి దేహాంతమందు కైలాసము జేరుదురు.

## — బిల్వనికృంతన కాలనిర్ణయమ —

శ్లో॥ ఇందౌనిశిచ, సంక్రాంతౌ, భౌమభార్గవపర్వసు
తథారిక్తాసు సర్వేషు రౌద్రేవై సూతకద్వయే
బిల్వపత్రం నవిచ్ఛింద్యాచ్ఛింద్యాచ్చేన్నరకం ధ్రువం॥
(స్మృతివాక్యం)

తా॥ సోమ, మంగళ, శుక్రవారములందు ప్రతి సంక్రాంతియందు రాత్రికాలమందు పర్వతిధుంయందు ఆర్ద్రా నక్షత్రమందు జాతాశౌచ మృతాశౌచములయందు రిక్తతిధులయందు బిల్వమును కోయరాదు. అలా కోసినవారికి నరకము ప్రాప్తించును.

## — తులసీ నికృంతన కాలనిర్ణయః —

శ్లో॥ శ్రవణేచ వ్యతీపాతే భౌమభార్గవభానుషు
సంక్రాంతౌ సూతకే చైవద్వాదశ్యాంనిశి పర్వసు
తులసిం యేవిభిందంతితే ఛిందంతి హరేశ్శిరః ॥
(స్మృతివాక్యం)

తా॥ శ్రవణ నక్షత్రమందు వ్యతీపాతయోగమందు అర్ధరాత్రియందు ఆది, మంగళ, శుక్రవారములయందు ప్రతీ సంక్రాంతియందు సూతకద్వయమందు ద్వాదశియందు పర్వతిధులయందు తులసీదళములను కోసినయడల విష్ణుమూర్తి యొక్క శిరస్సును కోసిన పాపమును పొందుదురు

## రుద్రవిధిః (రుద్రకల్పే విష్ణ్వీశ్వర సంవాదే)

విష్ణుః ॥

శ్లో॥ మహారుద్రార్చనవిధిం పరమేశదయానిధే
మహ్యాం కధయ సర్వజ్ఞ భక్తాయ పరిపృచ్ఛతే ॥
తేన పృష్టస్స గౌరీశో భగవాన్భక్తవత్సలః
ఇత్యాహ భగవాంచ్ఛంభుః శృణువక్ష్యామి కేశవ ॥

శివః ॥

అభిషేకాశ్చష్ట విధాశ్చాదౌవారమితీరితం
ఆవృత్తినామకంచైవ తతోరుద్రం ప్రకీర్తితం
ఆధైకాదశరుద్రంచ శతరుద్రం తతఃపరం
లఘురుద్రం మహారుద్రం చాఽతిరుద్రం ప్రకీర్తితం
చమకైకానువాకశ్చ రుద్రాధ్యాయేన సంయుతం
పునః పునః క్రమేణైవ కృతం చేద్వారమీరితం
తాన్యేకాదశవారాణిచావృత్తి రితికీర్తితః
ఏకమేకాదశావృత్తే రుద్రమిత్యభిధీయతే
తాన్యేకాదశరుద్రాణి శతరుద్రః ప్రకీర్తితః
శతరుద్రాణితాన్యేవ లఘు దముదాహృతం
లఘ్వైకాదశరుద్రాణి మహారుద్రం ప్రకీర్తితం
ఏకాదశమహారుద్రై రతిరుద్రః ప్రకీర్తితః
విష్ణీశ్వర సంవాదే రుద్రాభిషేకవిధిః॥

రుద్రాభిషేకము 8 విధములు

తదాహ బోధాయనః

నమస్తే రుద్రమన్యవ ఇత్యేకాదశానువాకానాం అగ్నా విష్ణూసజోషస ఇత్యేకైక మనువాకం జపేదితి సర్వనమకాన్ పఠిత్వా ఏకైకంచమకానువాకం పఠేదిత్యర్థః ॥

నమకము 11 అధ్యాయములు చెప్పి చమకములో ఒక్కొక్క అధ్యాయము చొప్పున చెప్పవలెను. ఆవిధముగా నమకము 11 సార్లు చెప్పిన చమకము 11 అధ్యాయములు పూర్తియగును.

1. ఆవిధముగా చేసిన అభిషేకమునకు వారమని పేరు.

2. ఆవృత్తి:- నమకము 121 సార్లు- చమకము 11 సార్లు.

3. రుద్రం:- నమకము 1,331 సార్లు-చమకము 121 సార్లు

4. ఏకాదశరుద్రం:- నమకము 14641 సార్లు-చమకము 1,331 సార్లు

5. శతరుద్రం:- నమకము 1,61,051 సార్లు-చమకము 14,641 సార్లు

6. లఘురుద్రం :- నమకము 17,71,561 సార్లు - చమకము 1,61,051 సార్లు.

7. మహారుద్రం :- నమకము 194,87,171 సార్లు - చమకము 17,71,561 సార్లు.

8. అతిరుద్రం;- నమకము 21, 43,58,881 సార్లు — చమకము 194 87,171 సార్లు.

పై విధానములలో వారివారి మనోభీష్టము ననుసరించి శక్తి ననుసరించి ఏదో ఒక విధముగ్గా చేయవచ్చును.

— అష్టవిధాభిషేక ఫలాని —

శ్లో॥ సర్వపాపాని నశ్యంతి శంభోర్వారాభిషేకతః ।
ఆవృత్త్యాచ భవేత్సౌఖ్యం రుద్రేణాఖిలసంపదః ॥
స్యాదేకాదశరుద్రేణ - సశ్రియం లభతే ధ్రువం ।
శతరుద్రాభిషేకేన - పుత్రపౌత్రాదిసంపదః ॥

అష్టైశ్వర్యాది సిద్ధిశ్చ లభతేనాత్ర సంశయః ।
లఘురుద్రాభిషేకేన పునర్జన్మ నవిద్యతే ॥
మహారుద్రాతి రుద్రాదిఫలం వక్తుంనశక్య తే ।
తద్విధానం ప్రవక్ష్యామి సావధానమనాశృణు॥
శ్రావణ్యాం కార్తికేవాథ - మాఘమాసే విశేషతః ।
సుక్షేత్రేవానదీతీరే పర్వతాగ్రే మనోహరే ॥
పశ్చిమాభిముఖద్వారయుక్తే శంకరమందిరే ।
యజమాన స్సమాగమ్య రుద్ర సంఖ్యాద్విజై స్సహ ॥
అభిషేకం ప్రకుర్వీత సముక్తోనాత్ర సంశయః ॥
(ఇతి రుద్రకల్పే విష్ణ్వీశ్వర సంవాదే)

1. వారాభిషేకము:- పృథివీరూపధారియగు రుద్రప్రీతి, సర్వ పాపహరము.

2. ఆవృత్త్యభిషేకము:- జలరూపధారియగు శివప్రీతి, సర్వ సుఖప్రదము.

3. రుద్రాభిషేకము:- తేజోరూపధారియగు శంకరప్రీతి, సర్వ సంపద్వృద్ధి.

4. ఏకాదశరుద్రా షేకము:- వాయురూపధారియగు పరమే శ్వరప్రీతి, లక్ష్మీప్రాప్తి.

5. శతరుద్రాభిషేకము:- ఆకాశరూపధారియగు మహేశ్వర ప్రీతి, పుత్రపౌత్రాద్యష్టైశ్వర్యసిద్ధి.

6 లఘురుద్రాభిషేకము : సూర్యరూపధారియగు ఈశ్వరప్రీతి, పునర్జన్మనివృత్తి.

7. మహారుద్రాభిషేకము:- చంద్రరూపధారియగు రుద్రునకు ప్రీతి, జ్ఞానవృద్ధి.

8 అతిరుద్రాభిషేకము:- సర్వరూపియగు పరమేశ్వరప్రీతి, చెప్ప శక్యముగాని మహాఫలము కల్గును. సందియము లేదు.

శ్రావణ కార్తీకమాసములందును, విశేషముగ మాఘ మాసమందును సుక్షేత్రమునగాని, నదీతీరమందుగాని పర్వతో పరిభాగమునగాని, పశ్చిమాభిముఖ ద్వారముగల శివాలయ మునగాని యజమాని 11 గురు బ్రాహ్మణులతో నభిషేకము చేసిన తప్పక ముక్తి నందగలడు.

— బోధాయన శాతాతపప్రోక్త రుద్రవిధి —

రుద్రం రుద్రో మహారుద్రోఽతిరుద్రశ్చేదితి

శ్లో॥ విధినానమకావృత్తి రుద్ర ఏకాదశాత్మకా
అథైకాదశినీరుద్రీ రుద్రైకాదశ రుద్రతః
ఏకాదశభి రేతాభి ర్మహారుద్రశ్చకథ్యతే
ఏకాదశమహారుద్రైరతి రుద్రఇతీరితః ॥

పూర్వన్యాసాంతేఏకాదశ నమకానువాకాన్ పఠిత్వా ఆద్యంచమకానువాకం పఠేత్, పునఃతాన్ పఠిత్వా ద్వి

యంచమకానువాక మిత్యేకాదశావృత్యా రుద్ర ఇత్యుచ్యతే, తేనైవరూపేసర్వచమకజపేనతు విభాగః త్రైరేకాదశరుద్రైః రుద్రీత్యుచ్యతే సైవలఘురుద్రః రుద్రైకాదశినీతిచోచ్యతే, తాభిరే కాదశిభిర్మహారుద్రః త్రైరే వేకాదశావృత్తి రతిరుద్రః ఏతదేవాహ తుర్హే మాద్రా కౌశికబోధాయనౌ ॥

శ్లో॥ సద్యాది పంచవక్త్రాంశ్చ రుద్రానేకాదశైవచ
జపిత్వా సర్వరు దాంశ్చ చమకాద్యంతతో జపేత్
పునరేతజ్జపేత్సర్వం ద్వితీయంచమకం యథా
రుద్రైకాదశినీత్యేషా సర్వకామఫలప్రదా
సర్వపాపక్షయకరీ సర్వశాంతి ప్రదాయినీ
ఏకాదశగుణాసైవరుద్ర ఇత్యభిధీయతే
మహానేకాదశగుణః అతిరుద్ర ఇహోచ్యతే
రుద్రం మహాతిరుద్రంచ జపేత్కార్యస్యగౌరవాత్। ఇతి
సూ॥ సర్వేషాం జపసమయే అభిషేకేచ సమానః।

(అర్ధము సుగమము)

## — రుద్రవిధి —

(హేమాద్రౌ మేరుతంత్రే)

శ్లో॥ రౌద్రీంధారాంతతః కుర్యాత్రోప్యచ్యతే తద్విధానకం
నమస్తే రుద్రాగ్నావిష్ణా నిత్యం ధ్యాయన్ద్వయేనచ
ఆవర్తనమితిప్రోక్తం గంగాస్నాన ఫలప్రదం

ఆవర్తనాభిషేకంతు యః కుర్యాత్ప్రత్యహంనరః
తస్యైవదినజం పాపం దైవజం నాశమాప్నుయాత్
ఏకః పాఠో నమస్తే స్త్విత్యనువాకః పరస్యచ
ఏవం భవాయ నమస్తే స్యాద్గ్నావిష్ణూ తథైకకం
ఇయంతు శ్రీసమాఖ్యాతా రౌద్రీపాప వినాశినీ
అనయా ప్రత్యహం యస్తుకుర్యాల్లింగాభిషేచనం
జన్మ, జన్మ కృతం పాపం వర్ష మధ్యే ప్రణశ్యతి
రౌద్రీభి రేకాదశిభిః లఘురుద్రః ప్రకీర్తితః
అనేనసిక్తం య్యైర్లింగంతేన పశ్యంతి భాస్కరిమ్
ఏకాదశభిరే తైస్తు మహారుద్రః ప్రకీర్తితః
నిర్ధనోధనమాప్నోది మహాపాతక నాశనః
ఏకాదశ మహారుద్రైశ్చతిరుద్రః ప్రకీర్తితః
అతిపాపహరాయస్యా దృష్టాన్యానైవ నిష్కృతిః
మేరుతంత్రోక్త విధినాకుర్యాద్రుద్రాభిషేచనమ్ ॥

(అర్థము సుబోధకము)

— కర్మవిపాక గ్రంథోదాహృతాః —

(శాతాతపః)

అధ ఏకం నమకానువాకానా మనంతరం ఏకం చమకానువాకంజపేత్ పునః పూర్వవన్నమజపానంతరంద్వితీయ చమకానువాకం పఠేత్ ఏవమేకాదశవారం నమకానువాకాన్ పఠేత్ । క్రమేణైకమేకం చమకానువాకానుదీర

యేత్ । అనేనచ ప్రకారేణ నమస్త్వైకె కాదశానువాకానామే కాదశధావృత్తి ష్షడంగైకాదశినీత్యుచ్యతే । ఏషఏవరుద్రైకాదశినీ చేతివ్యప దేశద్వయవాన్ భవతి । ఏకాదశభిరేతాభిరేకాదశరుద్రో, ఇతి సంజ్ఞాం లభతే । ఏకాదశరుద్రః రుద్రైకాదశినీ పర్యాయనామ్నాభి రేకాదశసంఖ్యాకాభిర్మహరుద్రః కథ్యతే । మహారుద్రస్యైకాదశావృత్త్యాతిరుద్ర ఇతి॥

(వామదేవ సంహితాయాం)

శ్లో॥ నమస్త్వైకైకానువాకాంత సమగ్ర చమకం జపేత్
ఏకాదశానువాకోక్త సంఖ్యాక నమకం జపన్
రుద్రైకాదశినీ సంజ్ఞాం క్రియం కర్త్రాప్నుయాచ్ఛివే
రుద్రైకాదశినీమేకాం దశధాగుణితాం శివే
శ్రీరుద్ర సంజ్ఞామాచార్యాః ప్రాహురాగమపారగాః
శ్రీరుద్రైకాదశగుణం మహారుద్రం జగుశ్శివే
తమేకాదశధాభిన్నమతిరుద్రం జగుః పరం ॥ఇతి॥

సంహితాంతరే

రుద్రాధ్యాయాభిదం మంత్రం జపేచ్ఛశ్వద్యతవ్రత
చమకస్థానువాకైక శిరస్కం రుద్ర మభ్యసేత్
రుద్రైకాదశినీమేతాం ప్రాహురాగమపారగాః
ఏకాదశగుణావృత్త్యా శ్రీరుద్రమపి చోచ్యతే
మహారుద్ర మితిఖ్యాతం సర్వసంకల్పసిద్ధిదం
ఏకాదశగుణావృత్త మతిరుద్రం జగౌశ్రుతిః
అతిరుద్రాభిదానేన సర్వపాతకనాశనం ॥ఇతి॥

(అర్థము సుబోధకము)

## — రుద్రాదిత్యయోరభేద నిరూపణం —



వేదవిదాం వరాః వేదమన్త్ర తన్త్రైః వేదశాస్త్రార్థ తత్త్వావగన్తారః ఋష్యాదయః, నిరన్తరతపోఽనుష్ఠానేన జ్ఞానినః యోగముద్రయాచ కైలాసవాసినోఽమ్బికాపతేస్సాక్షాత్కారం ప్రాప్నువన్తి అన్యేషాం శివసాక్షాత్కారో దుర్లభ ఏవ ।

అతశ్శంకర స్సాధారణజనానామపి స్వసాక్షాత్కార లాభాయ నభోమండలే ఆదిత్యరూపం ధృత్వా నిత్యం విరాజితే ।

అతః తత్తద్వృత్త్యుపజీవినస్సర్వే అనేకశః కృత్తివాసో రూపిణం భాస్కరం స్వకార్యనిర్వహణాయ కాలనిర్ణయార్థం దినేదినే దర్శయన్త్యేవ ।

తత ఆదిత్యదర్శనం రుద్రదర్శనమేవేతి సమ్యక్ జ్ఞాత్వా రుద్రస్వరూపిణం సప్తసప్తిం యదిపశ్యేయుః తేషామైహికా ముష్మిక సుఖమవశ్యం కరతలామలకం భవిష్యతి ।

ప్రాతరుత్థాయ యేయే పద్మినీవల్లభం నమస్కుర్వన్తి తేతే అర్యమ్ణో రుద్రరూపత్వేన ఈశ్వరస్య ఐశ్వర్యప్రదత్వాచ్చ మహైశ్వర్యం లభన్తే "ఆదిత్యో రుద్ర ఏవ ఇతి విద్యారణ్యే భట్ట భాస్కరీయ మహాగ్రన్థేచ వర్ణితమ్ ॥

తా॥ వేదవేత్తలు మన్త్రతన్త్రాదికములచేతను, వేదశాస్త్రార్థ తత్వము దెలిసిన మునిప్రవరులు నిరంతరతపోఽనుష్ఠానము చేతను, జ్ఞానులు యోగదృష్టితోను కైలాసమందున్న శివునిఁ జూడగలుగుచుండిరి. తదితరులకు శివసాక్షాత్కారము దుర్లభమనుట సత్యేతరము కాఁజాలదు.

అందువలన చంద్రశేఖరుడు కృపాపూరిత హృదయుఁడై సామాన్యజనులకుఁ గూడ తన దర్శనమగుటకు గగనమండలమున నాదిత్య రూపముతో విరాజిల్లుచుండెను.

లోకములో వివిధవృత్తులతో జీవించు జనులందఱు చాలసార్లు రుద్రరూపియగు భాస్కరుని తమతమ పనులను పూర్తిచేసికొనుటకై కాల నిర్ణయముకొఱకు ప్రతిదినమును చూచుచునేయుండిరి.

ఆదిత్యదర్శనము రుద్రదర్శనమే యని చక్కగఁ దెలిసికొని రుద్రస్వరూపుడైన మిహిరదేవుని దర్శించినవారికి నైహికాముష్మిక సుఖ ములు కరతలామలకము లనుట ముమ్మాటికి నిజము.

ఎవరు ప్రాతఃకాలమున పద్మినీ వల్లభుని భక్తితో మ్రొక్కుదురో వారికి ఆదిత్యుడు రుద్రుడగుటచేతను, ఈశ్వరుడు ఐశ్వర్యప్రదుఁ డగుట వలనను మహైశ్వర్యములు లభించగలవు. ఆదిత్యుడు రుద్రుడే యని విద్యారణ్యమున భట్టభాస్కరీయమను సుద్గ్రంథమున వర్ణించబడినది.

## — పూజాదర్శన ఫలం —

శ్లో॥ పూజితం పూజ్యమానం వాయః పశ్యేద్భక్తితోహరం।
శ్రద్ధయామోదమానస్తు సోపియాగఫలం లభేత్ ॥

(అగ్నేయ పురాణం)

తా॥ భక్తిశ్రద్ధలతోచేయు శివపూజాభిషేకాదులనూ. పూజాభిషేకములు చేయువానిని, పూజింపబడే శంకరుని భక్తిశ్రద్ధలతో చూచి ఎవరు సంతోషించుచున్నారో వారు యజ్ఞఫలమును పొందుదురు.

## — ఆగమోక్త రుద్రాభిషేక ఆచరణ —

శ్లో॥ శైవాగమోక్తవిధినా నరోరుద్రం యజేత్సుధీః
శైవాగమోక్తముల్లంఘ్య యోన్యమార్గే ప్రవర్తతే
నతస్యగతిరస్తీతి సత్యం సత్యం న సంశయః ॥

(శైవాగమే)

తా॥ బుద్ధిమంతులైన మానవులు శైవాగమముల యందు చెప్పబడిన ప్రకారముగానే శివుని పూజించెదరు. ఇతర విధానములుగా చేసిన యెడల సద్గతి దొరుకుట దుర్లభము. ఇది నిజము నిజము; సంశయము లేదు.

— రుద్రాభిషేక పూజానంతరం కర్తుస్స్నాన నిషేధః —

శ్లో॥ రుద్రాభిషేక పూజాదీన్నిర్వర్త్య తదనంతరం
స్నానం కరోతి చేత్కర్తా రౌరవం నరకం వ్రజేత్ ॥

(మహారుద్రకల్పే)

తా॥ శివునకు అభిషేకపూజాదులను సమాప్తిచేసిన తరువాత కర్త స్నానము చేయరాదు. స్నానము చేసిన రౌరవాది నరకమును పొందును.



# శ్రీ గణపత్యథర్వశీర్షోపనిషత్

ఓం సహనావవతు .... .... .... ద్విషావహై॥ ఓం

స్వస్తిన ఇంద్రోవృద్ధశ్రవాస్స్వ స్తినః పూషా విశ్వవేదాః ।

స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనే మిస్స్వస్తినో బ హస్పతిర్దధాతు ॥

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥

ఓం లం నమస్తే గణపతయే । త్వమేవ ప్రత్యక్షం తత్వమసి । త్వమేవ కేవలం కర్తాసి। త్వమేవ కేవలం ధర్తాసి । త్వమేవ కేవలం హర్తాసి। త్వమేవ సర్వం ఖల్విదం బ్రహ్మాసి । త్వం సాక్షాదాత్మాసినిత్యం । ఋతంవచ్మి । సత్యంవచ్మి । అవత్వంమాం । అవవక్తారం ॥ అవశ్రోతారం ॥ అవదాతారం । అవధాతారం । అవానూచానమవశిష్యం । అవపశ్చాత్తాత్ । అవపురస్తాత్ । అవోత్తరాత్తాత్ । అవదక్షిణాత్తాత్ । అవచోర్ధ్వాత్తాత్ । అవాధరాత్తాత్ । సర్వతో మాం పాహి పాహి సమంతాత్ । త్వం వాఙ్మయస్త్వం చిన్మయః త్వమానందమయస్త్వం బ్రహ్మమయః । త్వం సచ్చిదానందా ద్వితీయోసి। త్వం ప్రత్యక్షం బ్రహ్మాసి। త్వం జ్ఞానమయో విజ్ఞానమయోసి । సర్వం జగదిదంత్వత్తో జాయతే । సర్వం జగదిదం త్వత్తస్తిష్ఠతి। సర్వం జగదిదం త్వయిలయమేష్యతి । సర్వం జగదిదం

త్వయిప్రత్యేతి । త్వం భూమిరాపోఽనలోఽనిలోనభః । త్వం చత్వారి వాక్పదాని। త్వం గుణత్రయాతీతః। త్వం దేహత్రయాతీతః । త్వంకాలత్రయాతీతః । త్వం మూలాధారస్థితోసి నిత్యం। త్వం శక్తిత్రయాత్మకః । త్వాం యోగినోధ్యాయంతి నిత్యం। త్వం బ్రహ్మత్వం విష్ణుస్త్వం రుద్రస్త్వ మింద్రస్త్వ మగ్నిస్త్వం వాయుస్త్వం సూర్యస్త్వం చంద్రమాస్త్వం బ్రహ్మభూర్భువస్వరోం । గణాదీన్పూర్వముచ్చార్య వర్ణాదీన్ తదనన్తరం। అనుస్వారః పరతరః । అర్ధేందులసితం । తారేణ ఋద్ధం। ఏతత్త వ మనుస్వరూపం । గకారః పూర్వరూపం అకారో మధ్యమరూపం । అనుస్వార శ్చాంత్యరూపం ॥ బిందురుత్తరరూపం । నాదస్సంధానం । సంహితాసంధిః । సైషాగణేశీ విద్యా। గణకఋుషిః । నిచృద్గాయత్రీ ఛందః । శ్రీ మహాగణపతిర్దేవతా । ఓం గం గణపతయేనమః । ఏకదంతాయ

విద్మహే వక్రతుండాయధీమహి। తన్నో దంతి ప్రచోదయాత్

ఏకదంతం చతుర్హస్తం పాశమంకుశ ధారిణం । రదంచవరదం హస్తైర్బిభ్రాణం మూషకధ్వజం । రక్తం లంబోదరం శూర్పసుకర్ణకం రక్తవాససం । రక్తచందనలిప్తాంగం రక్తపుష్పైస్సు పూజితం । భక్తానుకంపినం దేవం జగత్కారణ

మచ్యుతం । ఆవిర్భూతంచ సృష్ట్యాదౌ ప్రకృతేః పురుషాత్పరం । ఏవం ధ్యాయతియో నిత్యం సయోగీ యోగినాం వరః। ఓంనమోవ్రాతపతయే నమోగణపతయేనమః ప్రమథపతయే నమస్తే అస్తు లంబోదరాయైకదంతాయ విఘ్నవినాశినే శివసుతాయ శ్రీ వరదమూర్తయే నమోనమః ॥

## — అథ ఫలశ్రుతిః —

ఏతదథర్వశిరోయోఽధీతే। సబ్రహ్మభూయాయ కల్పతే। ససర్వవిఘ్నైర్న బాధ్యతే । ససర్వతస్సుఖమేధతే । సపంచ మహాపాతకోపపాతకాత్ప్రముచ్యతే । సాయమధీయా నోదివసకృతం పాపం నాశయతి । ప్రాతరధీయానోరాత్రికృతం పాపం నాశయతి సాయంప్రాతః ప్రయుంజానో పాపో అపాపోభవతి । ధర్మార్థ కామ మోక్షంచ విందతి । ఇద మథర్వశీర్షమ శిష్యాయ న దేయం। యోయది మోహాద్దాస్యతి సపాపీయాన్భవతి। సహస్రావర్తనాద్యం కామమధీతే తం తమనేన సాధయేత్ ॥ అనేనగణపతి మభిషించతి సవాగ్మీభవతి। చతుర్థ్యామనశ్నన్ జపతిసవిద్యావాన్ । భవతి। ఇత్యథర్వణవాక్యం । బ్రహ్మద్యాచరణం విద్యాత్ । నబిభేతికదాచనేతి । యోదూర్వాంకురైర్యజతి సవైశ్రవణోపమోభవతి। యోలాజైర్యజతి సయశోవాన్భవతి సమేధావాన్భవతి । యోమోదక సహస్రేణయజతి సవాంఛితఫలమవాప్నోతి । యస్సాజ్య సమిద్భిర్యజతి ససర్వం లభతే సర్వం లభతే । అష్టౌ బ్రాహ్మణాన్సమ్యగ్గ్రాహయిత్వా

సూర్యవర్చస్వీభవతి। సూర్యగ్రహే మహానద్యాం ప్రతిమా సన్నిధౌ జప్త్వా స సిద్ధమంత్రో భవతి। మహావిఘ్నాత్ప్రముచ్యతే। మహాదోషాత్ప్రముచ్యతే। మహాపాపాత్ప్రముచ్యతే। ససర్వవిద్భవతి ససర్వవిద్భవతి యఏవంవేద॥ ఏవం గణపత్యథర్వ శీర్షోపనిషత్ ॥ సహనావవతు .... .... ద్విషావహై॥ స్వస్తిన .... దధాతు ॥

*శ్లో॥ గణేశాథర్వ శీర్షోపనిషదం విఘ్ననాశినీం।
పఠన్రుద్రం యోభిషించే త్సర్వవిఘ్నైర్నబాధ్యతే॥
శివయోరర్చనాకాలే మన్త్రపుష్పాదికే శుభే।
పఠిత్వాఽనన్తపుణ్యాని లభతే నాత్రసంశయః॥

(గణపతిమంత్రపురచ్చరణ విధౌ)

తా॥ సర్వవిఘ్ననివారకమగు నీ గణేశాథర్వ శీర్షోపనిషత్తును పఠించుచు నెవరు రుద్రాభిషేకము చేయునో వారు సమస్త విఘ్నముల చేతనూ బాధింపఁబడరు. మరియు పార్వతీపరమేశ్వరుల పూజాదికమున మన్త్రపుష్పసమయమున పఠించి మంత్రపుష్పము నర్పించిన నిస్సందేహముగ విశేషైశ్వర్యమును, గొప్ప పుణ్యమును లభించగలవు.

ఇతి శ్రీ పార్వతీపరమేశ్వర, భక్తపరమాణునా, వేగినాద్యన్వవాయేన, కూచ్యుపనామకేన, వీరభద్ర శర్మణా, సఙ్గ్రథితైషా భావార్థసహితా, రుద్రాఽభిషేక ధర్మదీపికా, శ్రీ సాంబసదాశివార్పణమస్తు॥ శ్రీః

శ్రీరస్తు.　　　　శ్రీ మహాగణాధిపతయేనమః　　　　అవిఘ్నమస్తు

# మహాన్యాసపూర్వక సశాస్త్రీయ రుద్రాభిషేకవిధి

## (మహాపాశుపత విధానసహితము)

శ్లో॥ వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।
నిర్విఘ్నం కురు మే దేవ సర్వకార్యేషు సర్వదా ॥

### — ప్రదక్షిణ విధి —

*శ్లో॥ నవమాసయుతానారీ పూర్ణకుమ్భం ధృతాసతీ
పదేపదంచ నిక్షిప్యయథా గచ్ఛతిసాఽలసా
తథాభక్తియుతో భూత్వా ప్రదక్షిణ విధించరేత్ ॥

(స్మృతివాక్యం)

తా॥ 9 మాసములు నిండిన గర్భవతి నిండు నీళ్ళబిందె భుజము మీద పెట్టుకొని ఎంత జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ నెమ్మదిగా నడచునో అదే విధముగా భగవంతునికి భక్తులు నెమ్మదిగా ప్రదక్షిణము చేయ వలయును.

### — చండీ ప్రదక్షిణ విధి —

*శ్లో॥ వృషంచండం వృషంచైవ సోమసూత్రం పునర్వృషం
చండీశం సోమసూత్రంచ పునశ్చండం పునర్వృషం ॥
శంభోఃప్రదక్షిణంకుర్యాత్సోమసూత్రంనలంఘయేత్
లంఘనాదేకమేకంస్యా దలంఘ్యమయుత్రయం ॥

(లింగపురాణే)

తా॥ ధ్వజస్తమ్భమువద్దనుండి బయలుదేరి ప్రదక్షిణముగా చండీశ్వరుని వద్దకు వెళ్ళి తిరిగి వెనుకకు నందీశ్వరునివద్దకు అనగా ధ్వజస్తంభమువద్దకు వచ్చి, తిరిగి అప్రదక్షిణముగా నందీశ్వరుని వద్ద నుంచి సోమసూత్రిం వరకూ వచ్చి, తిరిగి వెనుకకు మరలి నందీశ్వరుని వద్దనుండి చండీశ్వరునివద్దకు వచ్చి, అటనుండి ధ్వజస్తంభమును చుట్టి సోమసూత్రిమువరకూ వచ్చి అటనుండి వెనుకకు మరలి చండీశ్వరుని దర్శించి, తిరిగి నందీశ్వరునివద్దకు రావలెను ఇది యొక ప్రదక్షిణము. ఇటుల ముమ్మారు చేయవలెను. శివునికి ప్రదక్షిణము చేయునపుడు సోమసూత్రిమును దాటకూడదు. అలాదాటి చేసిన ఏ ప్రదక్షిణమైననూ ఒకటియే సంఖ్యలోనికి వచ్చును. ఇట్లు 1 చండీ ప్రదక్షిణము చేసిన ముప్పదివేల ప్రదక్షిణములు చేసిన ఫలము వచ్చును.

*శ్లో॥ అపసవ్యంయతీనాంతు సవ్యంతు బ్రహ్మచారిణాం
సవ్యాసవ్యం గృహస్థస్య శంభోర్నిత్య ప్రదక్షిణమ్ ॥
సోమసూత్రద్వయం యత్రియత్రివా విష్ణుమందిరమ
అపసవ్యం నకుర్వీత కుర్యాదేవ ప్రదక్షిణమ్ ॥

తా॥ యతులకు అపసవ్యముగాను, బ్రహ్మచారులకు సవ్యము గాను, గృహస్థులకు సవ్యాపసవ్యముగాను శివ ప్రదక్షిణము విధింప బడినది.

రెండు సోమసూత్రములున్న శివాలయమునకు, విష్ణ్వాలయమున కున్ను అపసవ్యప్రదక్షిణము పనికిరాదు సవ్యముగానే చేయవలయును

## — పూజాద్రవ్యస్థాన విధి —

శ్లో॥ స్థాపయేద్దక్షిణేభాగే పూజాద్రవ్యాణి చాత్మనః
సువాసితాంబు సంపూర్ణం సవ్యే కుంభం సుశోభనం
ప్రక్షాళనాయ కరయోః పాత్రే పృష్ఠే నివేశయేత్
ఘృతవిజ్వలితాన్ దీపాన్ స్థాపయేత్పరితశ్శుభాన్
దర్పణం చామరం ఛత్రం తాళవృంతం చ పాదుకా
యధాశ్రుతంతు సంస్థాప్య సంస్కృత్యాత్మసిచాత్మవాన్
(మేరుతంత్రే)

తా॥ పూజాద్రవ్యములను తనయొక్క కుడివైపున ఉంచుకొనవలయును. జలకలశము (ఆచమనముచేయు చెంబు) కూడ కుడివైపుననే యుంచవలయును. హస్తప్రక్షాళనార్థమైన పాత్రి తనకు కొంచెము వెనుకవైపున నుంచవలయును. ఘృతదీపములను స్వామి సన్నిధి నన్నివైపులను శక్తికొలది యుంచవలయును. చామర ఛత్రి దర్పణాదులను యథా శాస్త్రముగా నుంచవలయును.

## — నందీశ్వర నమస్కార విధి —

*శ్లో॥ వృషస్యవృషణం స్పృష్ట్వా ఈశ్వరస్యావలోకనం
శృంగమధ్యేశివం దృష్ట్వా పునర్జన్మన విద్యతే॥

శృంగయోర్వామహస్తస్య తర్జన్యం గుష్ఠకేన్యసేత్
అండంసవ్యేనచ స్పృష్ట్వా శృంగమధ్యేశివం యజేత్॥

*శ్లో॥ సాంతంయాం తంత్రివారం ప్రణవకసహితం యో౽బ్రవీచ్చప్రదోషేపశ్యన్ దేవేశలింగం వృషవృషణకర శృంగమధ్యేచ దృగ్భ్యాం। వేదాస్సాంగాహ్యాదితాః క్రమపదసహితా స్సప్తకోట్యశ్చ మంత్రాః। స్త్రైలోక్యం తస్యవశ్యం సభవతి శివసాయుజ్యవాన్ ధౌతపాపః ॥

(అగమకారిత)

(శైవకారికావృత్తౌ అర్చన ప్రకరణమ్)

తా॥ నందీశ్వరునియొక్క రెండు కొమ్ములయందు ఎడమచేతి యొక్క అంగుష్ఠ (బొటనవ్రేలు) తర్జనీలు (చూపుడువ్రేలు) రెండును ఉంచి కుడిచేతితో నందీశ్వరుని యొక్క అండములను స్పృశించి ఓం హరః ఓం హరః ఓం హరః అని పలుకుచు ఆ రెండు కొమ్ముల మధ్యనుంచి శంకరుని దర్శించినచో పదక్రమ సహితముగా వేదాంగములతో వేదముల పఠించిన ఫలమున్ను 7 కోట్ల మహామంత్రములను జపించిన ఫలితమున్ను పొంది సర్వపాపములచేతా విడువబడినవాడై అందరికు మంచివాడై అంతమందు శివసాయుజ్యమును పొందును. కావున సర్వదా శివుని కెదురుగా నుండి శివునే చూచుచున్న నందీశ్వరుని దర్శించి యతని అనుమతి తీసికొని శివుని పూజింపవలయును.

## — నందీశ్వర ప్రార్థనా —

శ్లో॥ నందీశ్వర నమస్తుభ్యం సాంబానంద ప్రదాయక
మహాదేవస్య సేవార్థమనుజ్ఞాం దేహిమేప్రభో ।
వేదపాదం విశాలాక్షం తీక్ష్ణశృంగం మహోన్నతం
ఘంటాంగళేధారయన్తం స్వర్ణరత్నవిభూషితం
సాక్షాద్ధర్మతనుందేవం శివరూపం వృషంభజే ॥

## — నందీశ్వర నమస్కారః —

ఉక్షం విష్ణుమయం విషాణకులిశం రుద్రస్వరూపం ముఖం
ఋగ్వేదాదిచతుష్టయంపదయుతంసూర్యేన్దునేత్రద్వయం
నానాభూషణభూషితం సురనుతం వేదాన్తవేద్యం వరం
అండంతీర్థమయం సుధర్మహృదయం శ్రీనందికేశంభజే ॥

(పై మంత్రములచే నందీశ్వరునికి ప్రార్థనా నమస్కారములు చేయవలయును.)

## — గర్భాలయ ప్రవేశ విధి —

ఆదౌ శివాలయం ప్రతిగత్వా దక్షిణపాదం నిక్షిప్య పూర్వ గోపురాదంతః ప్రవిశ్య భద్రమంటపం ప్రాప్య భైరవ ప్రార్థనాం కుర్యాత్ ॥

తా॥ మొదట శివాలయమునకేగి కుడికాలుపెట్టి తూర్పుగోపురము నుండి లోపల ప్రవేశించి భద్రమండపమును పొంది భైరవుని ప్రార్థించవలయును.

## — భైరవ ప్రార్థనా —

శ్లో॥ పరిపూజనార్థం శివపాదపద్మయోః
భజన్ వరిజామ్యద్య శివాన్తికం ప్రతి ।
శివాజ్ఞయా భైరవదేవ ! దేవ !
కవాట ముద్ఘాటయ విశ్వమూర్తే ।

## — అదౌ ఘంటానాదమ్ —

శ్లో॥ ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రక్షసాం ।
కురుఘంటారవం తత్రదేవతాహ్వాన లాంఛనమ్ ॥

## — తతః గణ నమస్కారః —

శ్లో॥ శ్రీనన్ది భృంగిరిటువీరక వీరభద్ర
చణ్డీశ్వర ప్రమథ ముఖ్యమహాగణేభ్యః ।
శ్రీరుద్రమన్త్ర నుతరుద్ర సహస్రకోటి
కోటిభ్య ఏవ ముహురస్తునమో మహద్భ్యః ।

శ్లో॥ శివాజ్ఞాపాలకా స్సర్వేగణాః ప్రమథసంజ్ఞి కాః ।
నానారూపధరా స్సర్వాన్కామాన్మమదిశన్తువై ॥

మం॥ నమ అవ్యాధినీభ్యో వివిధ్యంతీభ్యశ్చ =

గణేభ్యోగ్గణపతిభ్యశ్చవో నమః ॥

ఇతి గణ నమస్కారం కృత్వా

(ఈ పై మంత్రములతో ప్రమథగణములకు నమస్కారము చేయవలెను.

ఆచమ్య :—

శ్లో॥ హస్తాదౌ బ్రహ్మతీర్థంచ హస్తాగ్రే దేవతీర్థకం
హస్త పార్శ్వే ఋషేస్తీర్థం తత్పార్శ్వే పితృతీర్థకం
తన్మధ్యే చాగ్నితీర్థంచ పఞ్చతీర్థక్రమోదితః ॥
తస్మాత్ బ్రహ్మతీర్థేనాచమ్య

తా॥ దక్షిణ హస్తాదియందు బ్రహ్మతీర్థము, హస్తాగ్రమందు దేవతీర్థము, హస్త వామపార్శ్వమందు ఋషితీర్థము, హస్త దక్షిణపార్శ్వమందు పితృతీర్థము, హస్త మధ్యయందు అగ్నితీర్థము వసించి యుండును గాన బ్రహ్మతీర్థముచేతనే ఆచమనము చేయవలయును.

సంకల్ప్య । దేశకాలౌ సంకీర్త్య । కేశవాయస్వాహా = శ్రీకృష్ణాయనమః ఆదౌభూతశుద్ధిం కుర్యాత్ । సర్షపాన్ వికిరన్ మంత్రం పఠేత్ ॥

(ఆవాలను చల్లుతూ ఈక్రింది మంత్రము పఠించవలెను.)

శ్లో॥ అపసర్పన్తుతే భూతా - యేభూతా భూమి సంస్థితాః
యేభూతా విఘ్నకర్తారః - తేగచ్ఛన్తు శివాజ్ఞయా ॥
అపక్రామన్తు భూతాని - పిశాచా స్సర్వతోదిశం
సర్వేషామవరోధేన - పూజాకర్మ సమారభే ॥

ఇతి వామపాదతలపార్ష్ణ్యేన భూమిం త్రిః ప్రహృత్య
దేవా ఆయాన్తు । యాతుధానా అపయాన్తు । విష్ణో
యజనమ్ రక్షస్వ । ఇతి భూమౌ ప్రాదేశం కుర్యాత్ ॥

(తన ఎడమకాలియొక్క ఎడమ పార్శ్వముతో 3 మార
భూమిపై కొట్టి భూమియందు ప్రాదేశము చేయవలెను.)

— మనుష్యగంధ నివారణ మంత్రము —

ఏవాపిత్రే ఇత్యస్య మంత్రస్య । వామదేవఋషిః
బృహస్పతిర్దేవతా । త్రిష్టుప్ఛందః । మనుష్యగంధ నివార
వినియోగః ॥

మం॥ ఏవా పిత్రే విశ్వదేవాయ వృష్ణే యజ్ఞైః
ధేమ నమసా హవిర్భిః । బృహస్పతే సుప్రజా వీరవంతో
వయం స్యామ పతయో రయీణాం ॥

• (పైన చెప్పబడిన విధానము గృహనదీతీరాదులయందు చేయ
శివార్చనాభిషేకాదులయందు మాత్రమాచరింపవలయునని కొందరిమతము.
దేవాలయములందు పైవిధానము చేయుటలేదు. భూతపిశాచాదులను పా
ద్రోలుటకు, తన దేహదుర్గంధమును తొలగించుటకు చెప్పబడినది.)

ఉత్తిష్ఠన్తు .... సమారభే, ఓంభూః .... ప్రచో దయాత్, ఓమాపో .... వరోమ్ మమోపాత్తదురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వరప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే=అస్మి న్వర్తమాన = సంవత్సరే .... అయనే .... ఋతౌ .... మాసే .... పక్షే .... తిథౌ .... వాసరే శుభనక్షత్ర .... ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్ గోత్రః నామధేయః ధర్మపత్నీసమేతోఽహం శ్రీమతః గోత్రస్య నామధేయస్య ధర్మ పత్నీసమేతస్య అనాద్యవిద్యావాసనయా అస్మిన్ సంసారే విచి త్రాభిః కర్మగతిభిః విచిత్రాసు నానాయోనిషు పునఃపునరనే కధా జనిత్వాకేనాపి పుణ్యవిశేషేణ ఇదానీన్తన మానుష్యజన్మ ప్రాప్తవతః మమ-గోత్రస్య .... నామధేయస్య ఉపాత్తదురిత క్షయద్వారా పరమేశ్వర ప్రీత్యర్థం

శ్రీమన్మహాదేవస్య భగవతః ప్రపఞ్చ బాహ్యాభ్యన్తర పరిపూర్ణస్య కనక రజత వజ్ర వైడూర్య గోమేధిక మరకత మాణిక్య పుష్యరాగ ప్రవాళ స్ఫటికాది దివ్యశిఖర పరివృత కైలాసవాసినః సర్వేశ్వరస్య అష్టైశ్వర్య ప్రదాయకస్య, త్రిపురాంధక తారకాది క్రూరదైత్యేయ మర్దనస్య, శూలా ద్యాయుధధారిణః, మదనాన్తకస్య, బ్రహ్మశిరః ఖండనస్య, మాధవసాయకస్య, సర్వలోకశరణ్యమూర్తేః, సచ్చిదానంద విగ్రహస్య ఇన్ద్రాద్రి బాణ బలి మార్కండేయ గౌతమాద్యనేక శిష్ట జనసేవితస్య, విఘ్నేశ్వర వీరభద్రషడానన జనకస్య, గౌరీ

మనోనాయకస్య, శ్రీ సామ్బసదాశివస్య పరిపూర్ణానుగ్రహ ప్రాప్త్యర్థం.

ఇహ జన్మని జన్మాన్తరేషుచ బాల్య యౌవన కౌమార వార్ధకేషు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాసు రహసి ప్రకాశేచ జానతోఽజ్ఞానతశ్చ మయాకృత సమస్తదురిత క్షయద్వారా ఐహిక వాంఛిత సుఖభోగపూర్వక దేవహిత సంపూర్ణాయుష్య సిద్ధ్యర్థం.

పిణ్డనైసర్గిక అంశ యోగజీవదశాద్యాయుర్దాయషట్క యవనబాదరాయణ దేవల సిద్ధాచార్య నీలకంఠ బ్రహ్మగుప్త శివగుప్త మంత్రేశ్వర కాళిదాస వృద్ధ పరాశరజైమిని వరాహ మిహిరాదికృత సకలహోరాశాస్త్రానుసారేణ కాలచక్రగౌరీనక్ష త్రాది సకలజాతకానుసారేణ ఆదిత్యాది నవానాం గ్రహాణాం మధ్యే యేయేగ్రహాః అరిష్టస్థానేషు స్థితాః తైస్తైస్సంసూచిత సంసూచ్యమానసంసూచిష్యమాణ సర్వారిష్టపరిహారార్థమ్.

శుభస్థాన స్థితగ్రహేభ్య స్సకాశాదత్యన్త శుభఫలా వాప్త్యర్థం మహాదశాఽంతర్దశా విదశా సూక్ష్మదశా ప్రాణదశాసు తత్తద్దశా సంధిషు క్రూరదశాయాం క్రూరాన్తర్దశాప్రవేశకాలే తత్తద్దశాధిపతిభిః కరిష్యమాణ సర్వారిష్ట పరిహారార్థమ్

మమ శరీరే త్వగసృఙ్మాంసమజ్జా। శుక్లాదిసప్త ధాతుభ్యః దోషత్రయజనిత సర్వామయ నిర్హరణార్థమ్।

ఆధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవిక భూమ్యన్తరిక్ష దివ్య మహోత్పాత దుస్స్వప్న దుశ్శకున అద్భుతదర్శనాత్సంభవిత సర్వారిష్ట నివృత్త్యర్థంమమబాహ్యాభ్యన్తరయోః మాముద్దిశ్య శత్రుప్రభృతిభిః క్రియమాణ కరిష్యమాణ మన్త్ర తన్త్ర యన్త్ర శల్యవిషమూలికా చూర్ణప్రయోగా ద్యాభిచారికక్రియాది జనిత సర్వోపద్రవ దుష్టారిష్టపరిహారార్థం

అలక్ష్మీపరిహారద్వారా మహాలక్ష్మీ ప్రాప్త్యర్థం ధర్మాऽవిరోధేన నష్టద్రవ్యప్రాప్త్యర్థం వేదోక్తాయుర్యుత పుత్రపౌత్రాద్యనవిచ్ఛిన్న సత్సంతాన ప్రాప్తిద్వారా పితౄణ విముక్త్యర్థం మమ గృహే ధనధాన్య స్వర్ణ రౌప్య వస్త్రకాంస్యాదిలోహగృహోపకరణ సమృద్ధ్యర్థం వివిధ రసవర్గ సమృద్ధ్యర్థం

గంగాది పుణ్యనదీస్నాన ఫలసిద్ధ్యర్థం బదరికారణ్యాది పుణ్యక్షేత్ర సందర్శన ఫలసిద్ధ్యర్థమ్ అష్టాదశపురాణ శ్రవణ ఫలసిద్ధ్యర్థం భక్తిజ్ఞాన వైరాగ్యసిద్ధ్యర్థం దేహాన్తే కైవల్య సిద్ధ్యర్థమ్ ॥

బోధాయనాది బ్రహ్మర్షి సాంప్రదాయసిద్ధం యథా శాస్త్రం .... .... నామకరుద్రాభిషేకం స్వయం (బ్రాహ్మణ ద్వారావా) కరిష్యే ॥

(*ఈక్రింది సంకల్పము పాశుపతవిధానమైనచో చెప్పవలెను)
పాశుపత వజ్రగ్రథిత మహామృత్యుంజయ సంపుటిత రుద్రవిధానేన మహాన్యాసపూర్వక రుద్రాభిషేకం (స్వయం) విప్రద్వారా కరిష్యే ॥

## — కేవల మోక్షాపేక్షార్థ స్సంకల్పః —

ఏవం గుణవిశేషణ .... ప్రీత్యర్థమ్ అనాద్యవిద్యావాసనయా మానుషజన్మ ప్రాప్తవతః .... గోత్రస్య=నామధేయస్య అజ్ఞాన ప్రయుక్తసంసారిణః మమ హిరణ్యగర్భాది స్థావరాన్తేషు శరీరేషు యదేకం చైతన్యమస్తి తదేవాహ మస్మీతి దృఢజ్ఞాన సిద్ధ్యర్థం, యో బ్రహ్మాదిస్తంబపర్యన్తానాం సర్వేషాం ప్రాణినాం దేహమధ్యేత త్తద్దేహసాక్షిత్వేన భాసమానః పరిపూర్ణాత్మాస్తిసోఽయం పరమాత్మా కేవలం ముముక్షోః పురుషస్యమే స్వరూపమిత్యేవం రూపసాక్షాత్కారదృఢత్వ సిద్ధ్యర్థం, యస్మిన్ కాలేద్వైతభావంనాస్తి నిద్రాపి నాగచ్ఛతి తస్మిన్ కాలే ఉపలభ్యమానం యత్సుఖమస్తి సబ్రహ్మానన్ద ఇతి బ్రహ్మానన్దానుభవ సిద్ధ్యర్థం, మనోవ్యాపారాభావసమయేయత్సుఖం భాసతే తత్సుఖమాత్మస్వరూప మిత్యాత్మ నిశ్చయదృఢత్వసిద్ధ్యర్థం, ఇదం సర్వమాత్మైవ ప్రతీయమానంతు రూపరసాదికం జగన్మాయామయం నత్వేతద్వస్తుతోఽస్తీతి తత్వనిశ్చయ దృఢత్వసిద్ధ్యర్థం, నిత్యనిర్వికార అసంగ అద్వితీయ పరిపూర్ణ సచ్చిదానంద స్వప్రకాశచిదేకరసబ్రహ్మానుభవ సిద్ధ్యర్థం, బ్రహ్మసత్యం జగన్మిథ్యా, తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి, అయమాత్మా బ్రహ్మ, ప్రజ్ఞానంబ్రహ్మేతి వాక్యార్థజ్ఞాన సిద్ధ్యర్థం, శ్రీ ఉమామహేశ్వర ప్రసాద సిద్ధ్యర్థం = రుద్రాభిషేకం కరిష్యే ॥

ఆదౌ నిర్విఘ్న పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే .... ....

శ్లో॥ కలశస్యముఖేత్యాది సాధ్యాస్సంతిదేవాః
ఇత్యంతం కృత్వా ॥

—: ఋత్విగ్వరణ విధానము :—

*శ్లో॥ తతోవిప్రం సమాహూయ వేదశాస్త్రార్థకోవిదం
ఆచారం వరయేత్తద్వ ద్బ్రహ్మాణం శ్రోత్రియం గురుం
తతోపిఋత్విజశ్శాంతాన్ వరయేన్మంత్రతః పుమాన్
వేదాధ్యయన సంపన్నా న్వరానాగమ పారగాన్
సర్వాఙ్గసహితాన్ విప్రానాహూయైకా దశానపి
ఈర్ష్యాసూయాది దూరాంశ్చస్ఫుటువాచ
స్సమాహితాన్ ॥

తా॥ వేదశాస్త్రార్థవేత్తయూ నైష్ఠికుడు శ్రోత్రియుడు మంత్ర సిద్ధుడు ఐన బ్రాహ్మణుని గురునిగా ఆచార్యునిగా ఎన్నుకుని అటులనే ఇంకొక విప్రోత్తముని బ్రహ్మగా స్వీకరించవలయును. (ఆచార్య బ్రహ్మ వరణలు ఒక విప్రునకే ఇచ్చుట కలదు.)

అటుపిమ్మట వేదాధ్యయన సంపన్నులూ, శాంత స్వభావుల
ఆగమవేత్తలూ, అవయవలోపము లేనివారూ, సుస్పష్టముగా మంత్రము
నుచ్చరించువారూ, నిర్మల స్వభావులైనవారు, ఒడుదుడుకు (తొంద
పాటు) లేనివారునూ అగు 11 గురు బ్రాహ్మణులను ఋత్విజులుగా స్వీ
రించవలెను.

—: ఋత్విగ్వరణ సంకల్పము :—

పూర్వోక్త = ప్రీత్యర్థం, మయా సంకల్పిత .... నామక
రుద్రాభిషేక పూజాదికేషు । సకల మంత్ర తంత్ర కలాపా
సత్కర్మ నిర్వహణార్థం । ఆచార్యా ద్యృత్విగ్వరణం కరిష్యే।

—: ఆచార్య వరణమ్ :—

కర్తా :— మయా ఆచరిష్యమాణ .... నామక రుద్రాభి
షేక పూజాదికేషు సకల కర్మకర్తుం । కారయితుం। ఆచార్యం
త్వామహం వృణే (యజమాని ఫలపుష్పాక్షత దక్షిణసహిత
తాంబూలము నీయవలెను.)

విప్రః :— వృతోస్మి కరిష్యామి (ఇతి ప్రతివచనమ్)
కర్తా:—శ్లో॥ ఇంద్రాదీనాం యథాస్వర్గే లోకే సురగురుస్తథా।
ఆచార్యోభవవిప్రేన్ద్ర । మమ రుద్రాభిషేచనే॥

— అథ బ్రహ్మవరణమ్ —

కర్తా—మయా ఆచరిష్యమాణ .... .... నామక రుద్రాభిషేక
పూజాదికేషు సర్వకర్మద్రష్టారం బ్రహ్మాణంత్వా మహం
వృణే ॥

విప్రః:—వృతోస్మి కరిష్యామి (ఇతి ప్రతివచనమ్)

కర్తా:- శ్లో॥ యథాదివౌకసాం బ్రహ్మ దేవలోకే పితామహః
రుద్రపూజాభిషేకేషు బ్రహ్మభవ తథాద్విజ ॥

— అథ ఋత్విగ్వరణమ్ —

కర్తా :— మయా ఆచరిష్యమాణ .... నామక రుద్రాభిషేక పూజాదికాన్ కర్తుం ఋత్విజం త్వా మహం వృణే॥

ఋత్విక్:— వృతోస్మి కరిష్యామి (ఇతి ప్రతివచనమ్)

(ఋత్విజులను తమతమ శక్త్యనుసారముగా నాహ్వానించి ఒక్కొక్కరికే వరణలు పై విధముగా నీయవలయును. మరియు కర్త అంజలి బద్ధుడై యీ క్రింది విధముగ ప్రార్థించవలయును.)

— ఋత్విక్ప్రార్థనా —

కర్తా:- శ్లో॥ సర్వే స్వకర్మకుశలా స్సర్వే శ్రీ రుద్రరూపిణః
స్వస్వకర్మ వినిర్వర్త్య కృతార్థం కురుతాదరాత్॥

*శ్లో॥ ఇతి సంప్రార్థ్యతాన్ సర్వాన్ యథావిభవమర్చయేత్

తా॥ ఈవిధముగా వారి నందఱిని ప్రార్థించి వస్త్ర హిరణ్య తాంబూలాదులచే నర్చించవలయును.

—౦—

## — అఖణ్డదీపవిధి —

*శ్లో॥ రుద్రాభిషేకపూజాదౌ - దీపం ప్రజ్వాలయేత్సుధీః
అఖణ్డదీపహీనాయా - సా పూజా నిష్ఫలాభవేత్ ॥
(రుద్రకల్పే)

తా॥ రుద్రాభిషేక ప్రారంభమందు అఖండ దీపారాధన చేయవలయును. అఖండదీపారాధన చేయకుండా చేసిన రుద్రాభిషేక పూజాదులు నిష్ఫలమగును.

## — దీపతైలాని —

శ్లో॥ కపిలాదిఘృతంచైవ తిలతైలమథాపివా
బిల్వాదివృక్ష తైలంచ । దీపతైలమిహోచ్యతే ॥
(మేరుతంత్రే)

తా॥ కపిల గోవునేయి, నువ్వులనూనె బిల్వాది వృక్షజాతుల యొక్క నూనె దీప తైలములని చెప్పబడినవి.

## — దీపతైలఫలాని —

శ్లో॥ గోఘృతాత్ జ్ఞానసిద్ధిశ్చ - మోక్షప్రాప్తిస్తతః పరం
సంపద్వృద్ధిర్యశో వృద్ధిస్తిలతైలం దదాతిచేత్ ॥
(భవిష్యన్మహాపురాణం)

తా॥ ఆవునేతి దీపారాధన, జ్ఞానసిద్ధి, అంతమందు మోక్షప్రాప్తియని చెప్పబడినది. నువ్వులనూనె దీపారాధన సంపద్వృద్ధియు, కీర్తివృద్ధియు అని భవిష్యన్మహాపురాణమున చెప్పబడినది.

## — దీపవర్జ్యతైలాని —

శ్లో॥ ఏరణ్డనిమ్బతైలాదీన్ వర్జయేచ్ఛివపూజనే ॥

(ప్రేరుతంత్రే)

తా॥ ఆముదము. వేపనూనె, ఆవనూనె, అవిశనూనె మొదలగు తైలములతో శివుని పూజించు సమయమున దీపారాధన చేయకూడదు.

## —: అఖండదీప ప్రమాణమ్ :—

*శ్లో॥ దీపంసప్తాఙ్గుళోత్సేధం దర్శయేచ్ఛివసన్నిధౌ ।

తా॥ శివసన్నిధిని 7 అంగుళముల ఎత్తులో అఖండ దీపారాధన చేయవలెను.

*శ్లో॥ ఉత్తమాజస్రదీపస్య మానం సప్తాఙ్గుళోచ్ఛ్రయం
మాధ్యమంత్ర్యఙ్గుళం ప్రోక్తమేకాఙ్గుళ్యధమం స్మృతం

తా॥ అఖండ దీపారాధన 7 అంగుళముల యెత్తు కలిగిన ఉత్తమము 3 అంగుళముల యెత్తు కలిగిన మధ్యమము 1 అంగుళము ఎత్తు ఉన్న అధమము గాన ధాన్యముగాని బియ్యముగాని పైన చెప్పబడిన ఎత్తునకు సరిపడునట్లు పోసి అందుపై అఖండ దీపపాత్రి నుంచవలెను.

## —: దీపవర్తి లక్షణమ్ :—

*శ్లో॥ ఏక త్రి పఞ్చవా సప్త నవ వర్తిర్యుతా తథా
మధ్యమాధమ దీపస్తు సప్తాఙ్గుళ సముచ్ఛ్రయః

తా॥ 1-3-5-7-9 వర్తులతో (దారములతో) కూడిన (పేనిన వర్తితో వెలిగించిన దీపములు మధ్యమాధమ ఫలముల నిచ్చును 7 అంగుళముల ఎత్తులో వెలిగించినా ఉత్తమ దీపములు కానేరవు.

*శ్లో॥ ద్వాత్రింశత్ షోడశద్వాదశాష్టవర్తిసు సంయుతా
మధ్యదీప సమాయుక్తా దీపలక్షణముచ్యతే

తా॥ 32-16-12-8 గాని చుట్టునూ దీపములనుంచి మధ్య దీపము నుంచవలెను. అనగా 32 సంఖ్య వర్తులతో దృఢముగా పేనిన వర్తి అఖండదీప పాత్రియొక్క మధ్యను వెలిగించి పాత్రలోనే మధ్యదీపమునకు చుట్టూ దీపములు పైన వివరించిన సంఖ్యప్రకారము ఉంచవలయును

## — దీపస్థానఫలమ్ —

*శ్లో॥ అథాత స్సంప్రవక్ష్యామి శివదం శివదీపకం
సర్వపాపప్రశమనం సర్వోపద్రవ నాశనమ్ ॥

ఇత్యారభ్య :—

పూర్వద్వారాశ్రయేదీపః శివస్యాతిప్రియంకరః
పశ్చిమే వృషయేదేయః శేషకార్యేషుచోత్తరే ॥

(మేరుతంత్రే)

తా॥ మంగళప్రదమైన శివదీపము సర్వపాపహరము, సర్వోపద్రవ నాశనము అగుచున్నది.

పూర్వద్వార సన్నిధి నుంచిన దీపము శివునకు ప్రీతికరము పశ్చిమ భాగమున పెట్టిన దీపమువలన వర్షము కురియును. మిగిలిన సర్వకామ్యములయందును ఉత్తరదిశను దీపారాధన చేయవలెను.

అన్యచ్చ :— (గ్రంధాన్తరే)

శ్లో॥ దక్షిణేఘృతదీపోవై తైలదీపస్తు శూలినః
వామే ప్రజ్వాల్య సద్భక్త్యా దేవదేవస్య సన్నిధౌ ॥

తా॥ ఆవునేతి దీపారాధన శివునకు కుడిభాగము నందునూ. నువ్వులనూనె దీపారాధన శివునకు ఎడమ భాగము నందునూ ఉంచవలెను

## — దీపనష్ట ప్రాయశ్చిత్తమ్ —

*శ్లో॥ నష్టేదీపం ప్రమాదాద్వా మనురష్టోత్తరం జపేత్ ।
• పునః ప్రజ్వాల్యతచ్ఛేషపూజాదీన్ వైసమాపయేత్ ॥
(మరీచికల్పే)

తా॥ ప్రమాదవశమున అఖండదీపమునకు నష్టము కలిగినయెడల శివపంచాక్షరీ మంత్రమును 108 మారులు జపించి మరల దీపము వెలిగించి మిగిలిన పూజాదులను చేసికొనవలెను.

— ० —

— అథ అఖణ్డదీపారాధన ప్రయోగః —

పూర్వోక్త .... ప్రీత్యర్థ మభిషేక పూజా సమాప్తి పర్యన్త మఖండ దీపారాధనం కరిష్యే ॥

—: అఖండ దీపారాధన క్రమము :—

రుద్రగాయత్ర్యాభస్మజలేన దీపస్థానస్థలం ప్రోక్షయేత్

మం॥ తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి తన్నోరుద్రః ప్రచోదయాత్॥ ఇతిస్థలశుద్ధిం కృత్వా దేవస్యత్వేతి దీపపాత్రమాదాయ

మం॥ దేవస్యత్వా సవితుః ప్రసవేశ్వినోర్బాహుభ్యాంపూష్ణోహస్తాభ్యా మాదదే ॥

రేవతీస్త్వేతి దీప పాత్రే దీప వర్తీః నిక్షిప్య

మం॥ రేవతీ స్త్వావ్యక్ష్ణ న్కృత్తికా శ్చక్రన్స్గ్ స్త్వా । ధి యోవయన్నవగ్నా అవృజన్త్స హస్రమస్తాగం అభితో అయచ్ఛన్॥ ఇతి నిక్షిప్య । ఘృతం మిమిక్షిరేతి గో ఘృతంవా తిలతైలంవా దీపపాత్రే నిరుప్య

మం॥ ఘృతం మిమిక్షిరే ఘృతమస్యయోని ర్ఘృతే శ్రితో ఘృతము వస్యధామ । అనుష్వ ధమా వహమ్మా దయస్వ స్వాహా కృతం వృషభ వక్షిహవ్యం

అగ్నినాగ్ని స్సమిధ్యతేతి దీపవర్తి రన్యవర్తినా ప్రజ్వాల్య ।

మం॥ అగ్నినాగ్ని స్సమిధ్యతేక విర్గృహ పతిర్యువా । హవ్యవాడ్జుహ్వాస్యః ॥

ఉద్దీప్యస్వేతి జ్యోతిష్మతీంత్వేతి మంత్రద్వయేన వహ్నౌ కళాంయజేత్

మం॥ ఉద్దీప్యస్వ జాతవేదోపఘ్నం నిర్ ఋతిం మమ పశూగ్ శ్చమహ్యామావహ జీవనంచ దిశోదిశ.

మం॥ జ్యోతిష్మతీం త్వా సాదయామి జ్యోతిష్కృతం త్వా సాదయామి జ్యోతిర్విదంత్వా సాదయామి భాస్వతీం

త్వా సాదయామి జ్వలంతీంత్వా సాదయామి మల్మలాభవంతీంత్వా సాదయామి దీప్యమానాం త్వా సాదయామి రోచమానాం త్వా సాదయామ్య జస్రాంత్వా సాదయామి బృహజ్జ్యోతిషం త్వా సాదయామి బోధయంతీంత్వా సాదయామి జాగ్రతీం త్వా సాదయామి॥ సంమ్రాజంచేతి నమస్కుర్యాత్

మం॥ సమ్రాజంచ విరాజంచాఽభిశ్రీర్యాచనో గృహేలక్ష్మీః రాష్ట్రస్యయాముఖేతయా మాసగ్ం సృజామసి॥

అథపత్రపుష్ప గంధాక్షతాదీన్ గృహీత్వా దీపదేవం సంప్రార్థయేత్ ॥

శ్లో॥ భోదీప! శివరూప స్త్వం-కర్మసాక్షీహ్య విఘ్నకృత్
యావత్పూజాసమాప్తి స్స్యాత్తావత్త్వం సుస్థిరోభవ॥
రక్త ద్వాదశయుక్తాయ దీపనాథాయనమః ॥ ఇతి

(ఈవిధముగా ప్రార్థించి పత్రపుష్పగంధాక్షతలను అఖండ దీపము వద్దనుంచి బెల్లం ముక్కగాని ఫలముగాని నివేదన చేయవలెను.

మరియు నేతితోగాని నూనెతోగాని తడిపిన వేరొక చిన్న వర్తిని అగ్గి పుల్లతో వెలిగించి ఆచిన్న వర్తితో అఖండదీపము వెలిగించవలయును. పుల్లతో దైవసన్నిధిని దీపము వెలిగించకూడదు. అట్లు వెలిగించిన వారిని దయ్యమై పుట్టుదురని శిష్టులు చెప్పుదురు).

— ఋషిదేవతా ఛందోవినియోగావశ్యకత —

*శ్రు॥ ఋషిర్దైవతశ్ఛందో బ్రాహ్మణాన్యుపక్రమ్య అథయో
మన్త్రేమన్త్రే వేద సర్వమాయురేతి శ్రియానభవత్య
యాతయో మాన్యస్య ఛందాంసిభవన్తి తస్మాదేతాని
మంత్రే మన్త్రే విద్యాదృషిణాంస భవతి బ్రహ్మణ
స్స్వర్గేలోకే మహీయతే ॥

(సామబ్రాహ్మణే)

*శ్లో॥ యేనయదృషిణా దృష్టం సిద్ధిః ప్రాప్తాచయేనవై
మన్త్రేణ తస్యతత్ప్రోక్తమృషేర్భావస్తదార్షకమ్।

తా॥ ఏఋషిచే ఏమంత్ర మావిష్కరింప బడినదో ఎవనిచే సిద్ధిపొందినదో ఆమంత్ర మతనిదిగా చెప్పబడుచున్నది.

— (యాజ్ఞవల్క్యః)

— ఛందః —

*శ్లో॥ ఛాదనాచ్ఛంద ఉద్దిష్టం వాససీ ఇవ చావృతే
ఆత్మానంఛాదితో దేవైర్మృత్యోర్భీతైస్తుపైపురా ॥
ఆదిత్యైర్వసుభీరుద్రైస్తేన ఛందోభిధాగతా ॥

తా॥ శరీరమునకు కప్పుకొనుటకు వస్త్రము లెట్లో ఆత్మను కప్పుటవలన ఛందమను పేరు వచ్చినది. పూర్వము మృత్యుభయము పొందిన దేవతలచే ఆత్మ అచ్ఛాదింపబడినది. వసురుద్రాదిత్యులచే కప్పబడినది గాన ఛందమని పేరు వచ్చినది.

(యాజ్ఞవల్క్యః)

*శ్లో॥ యస్యయస్యతు మంత్రస్య ఉద్దిష్టాదేవతాతుయా
తదాకరంభవేత్తస్య దేవత్వం దేవతోచ్యతే॥

తా॥ ఏయే మంత్రమున కేయే దేవత ఉద్దేశింపబడినదో ఆ దేవతాకారము ఆమంత్రము జపించుటచే నేర్పబడును. కావున ఆ మంత్రమునకు ఆ దేవతయని చెప్పబడుచున్నది.

(యాజ్ఞవల్క్యః)

— వినియోగః —

*శ్లో॥ పురాకల్పే సముత్పన్నా మంత్రాః కర్మార్థమేవచ
అనేనేదంతు కర్తవ్యం వినియోగస్స ఉచ్యతే ॥

(యాజ్ఞవల్క్యః)

వ॥ పూర్వకాలమున కర్మార్థమై మంత్రములు పుట్టబడినవి. ఈ మంత్రముచే నిది చేయవలెననునదే వినియోగమనబడును. కావున ప్రతి మంత్రమునకు ఋషిఛందోదేవతా వినియోగములను తప్పక చెప్పవలయుననుట,

— ఋష్యాద్యనుచ్చారణమువలన సంభవించెడిదోషము —

*శ్లో॥ అవిదిత్వా ఋషింఛందో దైవతం యోగమేవచ
యోఽధ్యాపయేద్యాజయేద్వాపాపీయాన్
జాయతేతుసః ॥

(యాజ్ఞవల్క్యః)

వ॥ ఋషిఛందో దేవతా వినియోగములు లేకుండ ఎవరు మంత్రమును పఠించుచున్నారో ఇతరులచే పఠింపఁజేయుచున్నారో వారు పాపాత్ములగుదురు.

— (౦) —



ద్వాత్రిగ్ంశా త్రయస్త్రిగ్ంశేషు శ్రియధ్వమ్ । దివాస్త్రిరేకాద
శాస్త్రి త్రయస్త్రిగ్ంశాః । ఉత్తరేభవత । ఉత్తరవర్త్మాన ఉత్తర
సత్వానః । యత్కామ ఇదంజుహోమి । తన్మే సమృధ్యతామ్ ।
వయగ్ంస్యామ పతయోరయీణాం । భూర్భువస్సువస్స్వాహా ॥ ఓం
నమో భగవతే రుద్రాయ । నమస్తే రుద్రమన్యవ=జమ్మేదధామి॥
త్వమగ్నే త్వమగ్నే శతరుద్రీయ మిత్యస్త్రాయఫట్ ॥

ఓంశాంతిశ్శాంతిశ్శాంతిః ॥

— ౦ —

— సద్యోజాతాది పంచబ్రహ్మ మంత్ర విశిష్టత —

* సద్యోజాతాంది పంచబ్రహ్మ మంత్రాన్ సకృత్ జపే ద్యది తజ్జపః సప్తకోటి మహామంత్ర పురశ్చరణతుల్య ఇతి నిరూపయన్ తన్మంత్ర వివరణమాహ ।

*1. ఆరాధ్యదేవతానుగ్రహమునకై మనమాచరించెడి కృషిని సాధన యందురు. ఈ సాధనకు మంత్ర సంకేత, యంత్రసంకేత, పూజా (తంత్ర) సంకేతములు తెలియవలెను. మహామంత్రములకు కవచః హృదయ, పంజర, మాల, అష్టోత్తరశత, సహస్రనామస్తోత్రములనే బాహిరమైన షడంగములు కలవు ఇవిగాక ఋషి, ఛందో, దేవతా, బీజ, శక్తి, కీలకముల నెడు షడంగములు అంతరములైనవి కలవు.

అమ్నాయ మంత్రములన్నియు పరమేశ్వరుని పంచముఖములనుండి ఆవిర్భవించినవే!

1. సద్యోజాత ముఖమునుండి గాయత్రీ మొదలైన రెండుకోట్ల మంత్రము లావిర్భవించినవి. వీనిని "వైదిక మంత్రము" లందురు. ఇవి పూర్వామ్నాయ మంత్రములు.

2. వామదేవ ముఖమునుండి శైవాగమాంతర్గతము లైన మంత్రములు ఒకకోటి జనించినవి. ఇవి దక్షిణామూర్తి మొదలగు మంత్రములు. వీనినే "దక్షిణామ్నాయమంత్రము" లందురు.

3. అఘోర ముఖమునుండి వైష్ణవాగమోక్తములైన కోటిమంత్రము లుద్భవించినవి. ఇవి 'పశ్చిమామ్నాయ మంత్రములు' లని చెప్పబడుచున్నవి.

4. తత్పురుష ముఖమునుండి 2 కోట్ల మంత్రములు పుట్టినవి. మహావిద్యా మొదలైన మంత్రములివియే! మరియు నివి "ఉత్తరామ్నాయ మంత్రములు" గా ప్రసిద్ధి పొందినవి.

5. ఈశాన ముఖమునుండి ఆత్మానందప్రదములైన కోటి మంత్రములు బయల్వెడలినవి. వీనిని "ఊర్ధ్వామ్నాయ మంత్రము" లందురు.

మొత్తము సప్తకోటి మహామంత్రములును, పరమేశ్వరుని పంచముఖోద్భూతములే యని తెలియవలెను. ఇటువంటి "సద్యోజాతాది" మహామంత్రములు మహామహిమాన్వితములైన పరమేశ్వరునియొక్క పంచముఖములనుండి ఆవిర్భవించి, ఆ ముఖములను ప్రస్తుతించుటచేత వీనికి "సద్యోజాతాది పంచ బ్రహ్మమంత్రముల" నెడి పేరు వచ్చినది. ఈ ఐదు మహా మంత్రముల నొక్కసారి భక్తిశ్రద్ధలతో జపించినవారికి సప్త కోటి మహామంత్ర పురశ్చరణవలన కలుగు ఫలముకలిగి తీరునని "శైవాగమతంత్రసార సంగ్రహా"ది మహా గ్రంథముల యందు చెప్పబడినది.

*శ్లో॥ ఏక ఏవ శివస్సాక్షా త్సత్యజ్ఞానాది లక్షణః ।
వికారరహిత శ్శుద్ధస్స్వశక్త్యా పంచధాస్థితః ।

వ్యా॥ ఇతి సృష్టిస్థిత్యాది పంచకృత్య శక్తిభిః
సద్యోజాతాది పంచబ్రహ్మరూపో జాత ఇత్యర్థః ॥
(సూ॥ సం॥ యజ్ఞవైభవఖండే)

*తా॥ సత్యజ్ఞానానంద స్వరూపుడు వికారరహితుడునగు పరమశివుడొకడైనను సృష్టి, స్థితి, లయ తిరోధానానుగ్రహములను పంచకృత్యశక్తులవలన సద్యోజాత వామదేవ అఘోర తత్పురుషేశానులను ఐదు భేదములచే నొప్పుచున్నాడు. కావున సద్యోజాతాది పంచబ్రహ్మమంత్రములచే జపార్చనాఽభిషేకాదుల నొనర్చిన మహాఫలముకల్గును.

భూర్భువస్సువరోమితి దిగ్బంధః ॥
అథపఞ్చాఙ్గం సకృజ్జపేత్ ॥

1 సద్యోజాతం ప్రపద్యామి = భవవోద్భవాయ నమః ॥

2 వామదేవాయ = మనోన్మనాయ నమః ॥

3 అఘోరేభ్యో = రుద్రరూపేభ్యః ॥

4 తత్పురుషాయ = ప్రచోదయాత్ ॥

5 ఈశానస్సర్వ = సదాశివోమ్ ॥

— ఏవంపఞ్చాఙ్గగం నకృజ్ఞపేదష్టాంగం ప్రణమ్య —

హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేకఆసీత్।
సదాధారపృథివీం ద్యాముతేమాం కస్మైదేవాయ హవిషా
విధేమ । ఉరసానమామి ॥ 1.

యఃప్రాణతో నిమిషతో మహిత్వైక ఇద్రాజాజగతోబ
భూవ। య ఈశే అస్య ద్విపదశ్చతుష్పదః కస్మైదేవాయ
హవిషావిధేమ । శిరసానమామి ॥ 2.

బ్రహ్మజజ్ఞానం ప్రథమం పురస్తాద్విసీమతస్సురుచో
వేనఆవః । సబుధ్నియా ఉపమా అస్యవిష్ఠాస్సతశ్చయోని
మసతశ్చవివః ॥ దృష్ట్యానమామి ॥ 3.

మహీద్యౌఃపృథివీచన ఇమం యజ్ఞం మిమిక్షతామ్।
పిప్రృతాం నోభరీమభిః । మనసానమామి ॥ 4.

ఉపశ్వాసయపృథివీ ముతద్యాం పురుత్రాతే మనుతాం విష్ఠితం జగత్ । సదుందుభేసజూరిందేత్రిః దేవైర్దూరాద్దవీయో అపసేధశత్రూన్ । వచసానమామి ॥ 5.

అగ్నేనయసుపథారా యేఅస్మాన్ విశ్వాని దేవవయునానివిద్వాన్ । యుయోధ్యస్మజ్జుహురాణ మేనోభూయిష్ఠాం తేనమఉక్తింవిధేమ । పద్భ్యాంనమామి ॥ 6.

యాతే అగ్నే రుద్రియా తనూస్తయానః పాహి తస్యాస్తే స్వాహా యాతే అగ్నే యాశయా రజాశయా హరాశయా తనూర్వర్షిష్ఠా గహ్వరేష్ఠోగ్రం వచో అపావధీం త్వేషం వచో అపావధీగ్ స్వాహా । కరాభ్యాం నమామి ॥ 7.

ఇమంయమ ప్రస్తరమాహిసీదాంగిరోభిః పితృభిస్సం

విద్వాన॑: । అత్త్వా॒మన్త్రా॒: కవిశ॒స్త్వావ॑హ॒న్త్వేనా॒ రాజన్

హ॒విషా॑మాదయస్వ । కర్ణాభ్యాంనమామి ॥ 8.

శ్లో॥ ఉరసా శిరసాదృష్ట్యా మనసా వచసాతథా ।
పద్భ్యాంకరాభ్యాంకర్ణాభ్యాంప్రణామోఽష్టాంగఉచ్యతే ॥
ఇతి సాష్టాంగం ప్రణమ్య ॥

తా॥ వక్షము, శిరము, దృష్టి, మనస్సు వాక్కు, పాదములు, హస్తములు, కర్ణములు. ఈ ఎనిమిది అంగములచే నమస్కరించిన సాష్టాంగ నమస్కార మనబడును. (వక్షస్థల శిరస్సులతో పృథివి తాకి దృష్టితో శివుని చూచి మనస్సులో రుద్రునికి వందనముచేసి మాటచే "నమః" అని రెండుపాదాగ్రములు ఒక్కొక్కటి హా॥నను రెండు చేతులు రెండుచెవులు నేలకుతాకి బోర్లగిల పరుండి నమస్కరించుట సాష్టాంగ నమస్కారము.)

— • —

## — అథ రుద్ర ధ్యానమ్ —

*శ్లో॥ న్యాసానేవం విధాయాఽథ ధ్యాయే దాత్మానమీశ్వరం।
(మేరుతంత్రే)

అథాత్మానగ్ంశివాత్మానగ్ం శ్రీరుద్రరూపిణమేవం ధ్యాయేత్॥

శ్లో॥ అథాత్మానగ్ం శివాత్మానం పంచాస్యం చింతయేద్బుధః।
శుద్ధస్ఫటికసంకాశం త్రినేత్రం పంచవక్త్రకం॥
గంగాధరం దశభుజం సర్వాభరణభూషితం।
నీలగ్రీవం శశాంకాంకం నాగయజ్ఞోపవీతినం॥
వ్యాఘ్రచర్మోత్తరీయంచ వరేణ్యమభయప్రదం।
కమండల్వక్షసూత్రాభ్యామన్వితం శూలపాణినం॥
జ్వలంతం పింగళజటా శిఖాముద్యోత ధారిణమ్।
అమృతేనాప్లుతం హృష్టముమాదేహార్ధ ధారిణమ్॥
దివ్యసింహాసనాసీనం దివ్యభోగ సమన్వితం।
దిగ్దేవతా సమాయుక్తం సురాసుర నమస్కృతం॥
నిత్యంచశాశ్వతం శుద్ధంధ్రువమక్షర మవ్యయం।
సర్వవ్యాపినమీశానం రుద్రం వైవిశ్వరూపిణమ్॥
ఏవం ధ్యాత్వాద్విజస్సమ్యక్ తతోయజనమారభేత్।
ఇతి పంచమోన్యాసః॥

## — అథ షష్ఠోఽధ్యాయః —

## — అథ రుద్ర స్నానార్చనాది ప్రయోగః —

అథాతో రుద్ర స్నానార్చనాభిషేక విధిం వ్యా స్యామః ॥ ఉదితఏవ తీర్థే స్నాత్వోదేత్య శుచిః ప్రయతో బ్ర చారీ శుక్లవాసాః తస్య దక్షిణా ప్రత్యగ్దేశే తన్ముఖంస్థి ఆత్మని దేవతా స్థాపయేత్ ॥

*ప్రజననే బ్రహ్మతిష్ఠత్వితాద్యారభ్య ।

శ్లో॥ తిష్ఠన్తు మామితి ప్రోచ్య ప్రపంచం మనసాహ్వయేత్ ।

(మేరుతంత్రే

ప్రజననే బ్రహ్మతిష్ఠతు । పాదయోర్విష్ణుస్తిష్ఠతు । హ యోర్హరస్తిష్ఠతు । బాహ్వో రిన్ద్రస్తిష్ఠతు । జఠరే అగ్నిస్తిష్ఠ హృదయే శివస్తిష్ఠతు । కంఠే వసవస్తిష్ఠన్తు । వక్త్రే సరస్వ తిష్ఠతు । నాసికయోర్వాయుస్తిష్ఠతు । నయనయోః సూర్య చంద్రమసౌ (చంద్రాదిత్యౌ) తిష్ఠేతాం । కర్ణయోరశ్వినౌ తి తాం । లలాటే రుద్రాస్తిష్ఠన్తు । మూర్ధ్న్యాదిత్యాస్తిష్ఠన్తు : శిర మహాదేవస్తిష్ఠతు । శిఖాయాం వామదేవస్తిష్ఠతు । పృష్ఠేపినా తిష్ఠతు । పురతశ్శూలీ తిష్ఠతు । పార్శ్వయోశ్శివాశంకరౌ తి తాం । సర్వతో వాయుస్తిష్ఠతు । తతో బహిస్సర్వతోఽగ్నిజ్వాల మాలాపరివృతా స్తిష్ఠన్తు । సర్వేష్వంగేషు సర్వదేవతాః యథ స్థానం తిష్ఠన్తు । మాంరక్షన్తు । యజమానగ్ం రక్షన్తు

(శాతాతపమతే। షడఙ్గన్యాసపక్షే ప్రజననాది షోడశాఙ్గన్యాసష్షః) ॥

అగ్నిర్మేవాచిశ్రిత ఇత్యాద్యైర్యథాలింగమంగాని స్వాంగానిచ సంస్పృశేత్ ॥

అగ్నిర్మేవాచిశ్రిత ఇత్యాది మన్త్రములతో లింగాంగములను, తనయందు లింగభావన జేసికొని తన యవయవములను గూడ స్పృశించవలయును.)

మం॥ అగ్నిర్మేవాచిశ్రితః । వాగ్ఘృదయే । హృదయం మయి । అహమమృతే । అమృతం బ్రహ్మణి । ఇతి జిహ్వామ్ ॥

వాయుర్మేప్రాణేశ్రితః । ప్రాణోహృదయే । హృదయం మయి । అహమమృతే । అమృతం బ్రహ్మణి ఇతి నాసమ్ ॥

సూర్యోమే చక్షుషిశ్రితః । చక్షుర్ హృదయే । హృదయం మయి । అహమమృతే । అమృతం బ్రహ్మణి ఇతి చక్షుషి ॥

చంద్రమా మే మనసి శ్రితః । మనో హృదయే ।
హృదయం మయి । అహమమృతే । అమృతం
బ్రహ్మణి । ఇతి వక్షః ॥

దిశో మే శ్రోత్రే శ్రితాః । శ్రోత్రగ్ం హృదయే ।
హృదయం మయి । అహమమృతే । అమృతం
బ్రహ్మణి । ఇతి శ్రోత్రే॥

ఆపో మే రేతసి శ్రితాః । రేతో హృదయే । హృదయం
మయి । అహమమృతే । అమృతం బ్రహ్మణి ।
ఇతి గుహ్యమ్ ॥

పృథివీ మే శరీరే శ్రితా । శరీరగ్ం హృదయే । హృద
యం మయి । అహమమృతే । అమృతం బ్రహ్మణి ।
ఇత శరీరమ ॥

ఓషధి వనస్పతయో మే లోమసు శ్రితాః । లోమాని

హృదయే । హృదయం మయి । అహమమృతే ।
అమృతం బ్రహ్మణి । ఇతి లోమాని ॥

ఇన్ద్రో మే బలే శ్రితః బలగ్ం హృదయే । హృదయం
మయి । అహమమృతే । అమృతం బ్రహ్మణి ।
ఇతి బాహ్వోః ॥

పర్జన్యో మే మూర్ధ్ని శ్రితః । మూర్ధా హృదయే ।
హృదయం మయి । అహమమృతే । అమృతం
బ్రహ్మణి । ఇతి మూర్ధ్ని ॥

ఈశానో మే మన్యౌ శ్రితః । మన్యుర్ హృదయే ।
హృదయం మయి । అహమమృతే । అమృతం
బ్రహ్మణి । ఇతి మనసి ॥

ఆత్మా మ ఆత్మని శ్రితః । ఆత్మా హృదయే । హృద

యం మయి । అహమమృతే । అమృతం బ్రహ్మణి ।
(తదేవ) ఇతి మనసి.

పునర్మ ఆత్మా పునరాయురాగాత్ । పునఃప్రాణః
పునరాకూత మాగాత్ । వైశ్వానరోరశ్మిభిర్వా
వృధానః । అనస్థిష్ఠత్వమృతస్యగోపాః । ఇతి
సర్వాంగం ॥

అథైనం వ్యాహృతిభిరుత్తరతః । భూర్భువస్సువః
చండీశ్వరాయనమః । ఇతి శిరసినిర్మాల్యం విసృజ్య । చండీశం
ధ్యాయేత్ ॥

శ్లో॥ శివభక్తాయ శుద్ధాయ శివాజ్ఞాపరిపాలినే ।
నిర్మాల్య పరితుష్టాయ చండీశాయ నమోనమః ॥
ఇతి ధ్యాత్వా ॥

— నిర్మాల్య విసర్జన విధి —

శ్లో॥ అంగుష్ఠతర్జన్యగ్రాభ్యాం నిర్మాల్యమపనోదయేత్
అపనీతంచ నిర్మాల్యం చండీశాయ నివేదయేత్
అశూన్యమస్తకం లిఙ్గం సదాకుర్వీత పూజనమ్ ॥

*తా॥ బొటనవేలు చూపుడువ్రేళ్ళతో శివుని శిరస్సుపై నున్న నిర్మాల్యమును (పత్రపుష్పాక్షతాదులను) ఉత్తరదిశకు తీయవలెను. తీసిన నిర్మాల్యమును చండీశ్వరునకు సమర్పించవలెను. మరల పుష్పమునుగాని పత్రమును గాని లింగముపై నుంచి పూజాభిషేకాదులు చేయవలెను.

## — జలకలశార్చనాక్రమము —

*శ్లో॥ శంభోర్దక్షిణ పార్శ్వస్థజలకుంభం ప్రపూజయేత్ ।
అభిమంత్ర్యాబ్లింగమంత్రైర్జలం సమ్యగ్విధానతః ॥
బ్రహ్మాండోదరతీర్థానిచా కృష్యాంఽకుశముద్రయా ।
ప్రచ్చార్యసలిలం శుద్ధం విధినా కూర్మ ముద్రయా ॥
నిర్విషీకరణార్థంచ తార్క్ష్యముద్రాం ప్రదర్శయేత్ ।
అమృతీకరణార్థంవై ధేనుముద్రాం తథైవచ ॥
జలమధ్యే లిఖేద్బీజ మమృతం శ్రద్ధయాన్వితః ।
పుష్పాక్షత సుగంధాని జలకుంభే వినిక్షిపేత్ ॥
మంత్రపూతజలేనైవ శివస్నానం సమాచరేత్ ।
నిష్ఫలం భవతి స్నానం కుర్యాద్యదిత దన్యథా ॥
(రావణః)

* తా॥ శివుని కుడిపార్శ్వమందున్న జల కుంభము (తీర్థపుబిందె) పూజించవలయును. ఆ జలమును ఆపోహిష్ఠామ....ఇత్యాది అబ్లింగ మంత్రములచే నభిమంత్రించవలయును. అంకుశముద్రచే బ్రహ్మాండోదరతీర్థాని మొదలగు

మంత్రములచే నాకర్షించవలయును పవిత్రమైన కుంభస్థమగు జలమును కూర్మముద్రచే కదుపవలయును. అజలములోని విషమును తొలగించుటకు తార్క్ష్యముద్రను ప్రదర్శించవలయును ఆజలమును అమృతముగా చేయుటకు ధేనుముద్రను ప్రదర్శించ వలయును. శ్రద్ధాయుక్తుడై ఆ జలమధ్యయందు "వం" అను అమృతబీజమును పుష్పముతో వ్రాయవలయును. పువ్వులు, అక్షతలు, గంధము జలకుంభమునందుంచ వలయును.

ఇట్టి మన్త్రపూతజలముచేతనే శివాభిషేకము చేయవల యును. సత్ఫలితమును తప్పక యిచ్చును.

పైన చెప్పినదానిని ధిక్కరించి మరియొక విధముగా చేసిన సర్వము నిష్ఫలమగును. అని మహాపాశుపతయోగి యైన రావణుడు వచించెను.

— ముద్రాణాం వినియోగకాలాః —

*శ్లో॥ అర్చనే జపకాలేచ ధ్యానే కామ్యేచ కర్మణి
స్నానేచావాహనే శంఖే ప్రతిష్ఠాయాంచ రక్షణే
నైవేద్యే చతథాఽన్యత్ర తత్తత్కల్ప ప్రకాశితే
స్థానేముద్రాః ప్రదష్టవ్యాః సర్వలక్షణ లక్షితాః ॥
(తంత్రసారే)

ఈశ్వర ఉవాచ। ముద్రాప్రదర్శనావశ్యకత —

శ్లో॥ ఫలస్యసిద్ధయేదేవి ముద్రాయుక్తోను సిద్ధ్యతి
తథాముద్రా విహీనశ్చేత్కోటి కోటిజపేనతు

నసిధ్యతి మహామంత్రస్తస్మాన్ముద్రాశ్చ ధారయేత్
అథముద్రాః ప్రవక్ష్యామి సర్వతంత్రేషు గోపితాః
యాభిర్విరచితాభిశ్చ మోదంతే మంత్రదేవతాః ॥
(తంత్రసారమహాగ్రంథే)

*తా॥ అర్చనాద్యుపచారములయందు సర్వలక్షణ లక్షితములగు ముద్రలను ప్రదర్శింపవలయును అని తంత్రసారమున చెప్పబడినది.

మరియు ముద్రాహీనుడైనచో కోట్లకొలది జపముచేసినను మహామంత్రము సిద్ధించదు సర్వతంత్రముల యందు రహస్యముగా నుంచబడిన ముద్రలను చెప్పెదను. అట్టి ముద్రల రచించిన మంత్రదేవతలు సంతోషమును పొందుదురు అని శివుడు పార్వతికి చెప్పెను.

— ముద్రాప్రదర్శన ఫలం —

*శ్లో॥ ముదం కరోతి దేవస్య ద్రావయే ద్దుఃఖపాతకే
ఇతిముద్రా నిరుక్తిస్స్య మంత్రశాస్త్రేపి శ్రూయతే
ముద్రాశ్చదర్శయేద్యత్నా ద్దేవసాన్నిధ్య కారణం
దర్శితాస్తాస్తు దేవానాం మోదకాద్ద్రావకాన్మనే ॥
(అగస్త్యసంహిత)

*తా॥ ముద్రాశబ్దమున మొదటి యక్షరమగు 'ము' అనుదానికి దేవునకు ముదమును చేయునది యనియు 'ద్రా' అనుదానికి దుఃఖపాపములను తరిమివేయును అని యర్థము.

కనుక దైవానుగ్రహకారణములయిన ముద్రలను ఆయా సమయములయందు ప్రయత్నముచేసి ప్రదర్శించవలయును.

అట్లు చూపబడిన ముద్రలు దేవతలకు సంతోషమును కలిగించును. పాపమును పారద్రోలును.

* ఏతాముద్రా లక్ష్య సంగ్రహ ।
తంత్రసారాది మహాగ్రన్థేభ్య ఉదాహృతాః ॥

ఇందు పొందుపరచిన ముద్రాలక్షణములు లక్ష్యసంగ్రహ తంత్రసారాది మహాగ్రంథములం దుదహరించబడినవి.

— దక్షిణపార్శ్వస్థకలశారాధనము —

పూర్వోక్త = ప్రీత్యర్థమ్ । శంభోర్దక్షిణపార్శ్వస్థ కలశారాధనం కరిష్యే ॥

శ్లో॥ కలశస్య ముఖే విష్ణుః — సమాశ్రితాః ॥

మం॥ అకలశేషుధావతి సః త్రే పరిషిచ్యతే ।
ఉక్థైర్యజ్ఞేషువర్ధతామ్ ॥
ఆపోవాఇదగంసర్వం- భూర్భువస్సువరాపఓమ్ ।
ఆపోహిష్ఠామయోభువః = ఆపోజనయథాజనః ॥

శ్లో॥ బ్రహ్మాండోదరతీర్థాని కరైస్స్పృష్టానితేరవే ।
తేనసత్యేనమేదేవ తీర్థందేహి ! దివాకర ః

మం॥ భాస్కరాయ విద్మహే మహద్ద్యుతికరాయ ధీమహి
తన్నో ఆదిత్యః ప్రచోదయాత్ ॥
అంకుశముద్రయా తీర్థాన్యాకృష్య ॥

— అంకుశ ముద్రా లక్షణమ్ —

*శ్లో॥ వామాంగుష్ఠంతు తర్జన్యాసంగృహ్యాదక్షిణేనతు ।
కృత్వోత్తానం తథాముష్టిరంగుష్ఠంతుప్రసారయేత్ ॥

తా॥ ఎడమబొటనవ్రేలిని కుడిచూపుడువ్రేలితో చుట్టి కుడి బొటనవ్రేలు ఊర్ధ్వముగా పిడికిలిచేసి అంగుష్ఠ ప్రసారముచేసిన అంకుశముద్రయగును

గ్రంథాంతరే :—

శ్లో॥ మధ్యమానామికాభ్యాంచ కనిష్ఠాంగుళినాతథా ।
ముష్టింకృత్వా కించిధోముఖీచేత్స్వ్యతర్జనీ ।
అంకుశీముద్రికాజ్ఞేయా తీర్థాకర్షణకర్మణి ॥

తా॥ మధ్యమానామికా కనిష్ఠాంగుళులచే ముష్టినిచేసి వంచిన చూపుడువ్రేలు అధోముఖముకలదైనచో అంకుశముద్రయగును.

కూర్మముద్రయా కలశోదకం ప్రచ్ఛాద్య (ప్రచ్ఛాద్య)

— కూర్మముద్రా లక్షణమ్ —

*శ్లో॥ ఆకుంచితాంగుళితలం వామహస్తస్య గోపయేత్ ।
దక్షహస్తే తలేనాథ పూర్ధ్వస్పృష్టేన యత్నతః ॥

కుంచితే దక్షిణే వక్త్రం కృత్వా తర్జన్యనామికే ।
పూర్వపాదౌదు కృత్వాచ బద్ధ్వాసంపుటసంజ్ఞయా॥
కుంచితాంగుళిహస్తేన కుర్యాచ్చేత్త్రప్రయత్నతః ।
మంత్రజాపీ మంత్రవేదీ ముద్రా కూర్మన్యసాన్మృతా
కూర్మాఖ్య ముద్రా సకలం దదాతి నిజవాంఛితమ్ ॥

తా॥ ఎడమచేతియొక్క వంచబడిన (అధోముఖముగా) వ్రేళ్ళ ప్రదేశమును కుడిహస్తముచే పైకి పృష్ఠభాగము కలుగునట్లు కప్పి కుడిచేతి ముఖభాగమును వంచి తర్జన్యనామికలను ముందుపాదములుగా చేసి కుంచితాంగుళి హస్తముతో చేసిన కూర్మముద్ర యగును. ఈముద్ర తన మనోవాంఛితము నీడేర్చును.

నిర్విషీకరణార్థం తార్క్ష్యముద్రాం ప్రదర్శ్య

— తార్క్ష్యముద్రా లక్షణమ్ —

*శ్లో॥ హస్తౌతు విముఖౌ కృత్వా గ్రథయిత్వా కనిష్ఠికే
మిథస్తర్జని కేశ్లిష్టే శ్లిష్టా వంగుష్ఠకౌతథా
మధ్యమానామికేద్వేతు ద్వౌపక్షౌ విచాలయేత్
ఏషాగరుడముద్రాఖ్యా నిర్విషీకరణామతా ॥

*తా॥ ఎడమచేతి పృష్ఠమున కుడిచేతి పృష్ఠమునుంచి చిటికెనవ్రేళ్ళు, చూపుడువ్రేళ్లు బొటనవ్రేళ్ళు ఒకదానికొకటి తగిల్చి మధ్యమానామికలను రెక్కలవలె విదల్చవలయును. అట్లుచేసిన తార్క్ష్యముద్ర యగును. ఈ ముద్ర విషమును హరించునని చెప్పబడినది.

అమృతీకరణార్థం ధేనుముద్రాం ప్రదర్శ్య ॥

— ధేనుముద్రా లక్షణమ్ —

*శ్లో॥ హస్తద్వయే తథావక్త్రే సమ్ముఖేచ పరస్పరమ్
వామాఙ్గుళీర్దక్షిణానామఙ్గుళీ నాఙ్చసంధిషు
ప్రవేశ్య మధ్యమాభ్యాంచ తర్జన్యౌతుప్రయోజయేత్
కనిష్ఠే ద్వేఽనామికాభ్యాంయుజ్యాత్సాధేనుముద్రికా
భవేదియం ధేనుముద్రారాజ్య భక్తిప్రదాయినీ ॥

తా॥ రెండుచేతులు దేవుని కభముఖముగానున్నా మరియు నొకదానికొకటి అభిముఖముగా దగ్గరగా నుంచి ఎడమచేతి అనామికపై కుడిచేతి చిటికినవ్రేలినిన్నీ, మరియు ఎడమచేతి చిటికెనవ్రేలిపై కుడిచేతి యుంగరపువ్రేలున్ను, ఎడమచేతి మధ్యవ్రేలిపై కుడిచేతి చూపుడువ్రేలున్ను, ఎడమ చేతి చూపుడువ్రేలిపై కుడిచేతి మధ్యవ్రేలున్నూ ఉంచిన ధేను ముద్రయగును. ఈ ధేనుముద్ర దైవసన్నిధిని ప్రదర్శించిన రాజ్యప్రాప్తియు, భక్తియుఁ గలుగును.

కలశజలే అమృతబీజం (వం) లిఖిత్వా । గంధపుష్పా క్షతాదీన్ నిక్షిప్య । కలశం సంప్రార్థయేత్ ॥

(కలశజలమందు పుష్పములో "వం" అను నక్షరమును వ్రాసి సుగంధాక్షతాదులను ఉంచి ఈక్రింది విధముగా ప్రార్థన చేయవలయును.

## జలకలశ ప్రార్థనామంత్రః

శ్లో॥ దేవదానవసంవాదే మధ్యమానే మహోదధౌ ।
ఉత్పన్నోసితధాకుంభ ! విధృతో విష్ణునాస్వయమ్ ॥
త్వత్తోయే, సర్వతీర్థాని దేవాస్సర్వేత్వయిస్థితాః
త్వయితిష్ఠన్తి భూతాని త్వయిప్రాణాః ప్రతిష్ఠితాః
శివస్స్వయం త్వమేవాసి విష్ణుస్త్వంచ ప్రజాపతిః
ఆదిత్యావసవోరుద్రా విశ్వేదేవాస్సపైతృకాః
త్వయితిష్ఠంతిసర్వేపి, యతః కామఫలప్రద
త్వత్ప్రసాదాదిదంకర్మ కర్తుమీహే జలోద్భవ
సాన్నిధ్యం కురమేదేవ ప్రసన్నోభవ సర్వదా ॥

ఇతి జలకలశంసంప్రార్థ్య । కుంభముద్రాంప్రదర్శయేత్॥

తా॥ ఓజలకలశమా! దేవదానవ కలహము కారణముగ మహోదధి మథింపబడినప్పుడు నీవుజన్మించితివి. నిన్ను శ్రీ మహావిష్ణువేస్వయముగా గ్రహించెను. నీజలమునందు అన్ని తీర్థములు గలవు. దేవతలు గలరు. అన్ని భూతములు గలవు. నీయందు ప్రాణములు ప్రతిష్ఠింపబడినవి. నీవే బ్రహ్మ విష్ణు శివ స్వరూపమవు. నీయందు ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, విశ్వేదేవతలుః పితృదేవతలున్ను ఉన్నారు.

నీవు ఈప్సితార్థముల నొసంగుదువు గాన నీయనుగ్రహమువలననే నీకర్మచేయుటకు నిష్టపడుచుంటిని. నాకు

సాక్షాత్కరించి నన్ననుగ్రహించుము. (ఈ విధముగా జలకలశమును ప్రార్థించి యీ కలశోదకముచేతనే యభిషేకము చేయవలయును. అట్లుచేసిన ఫలము కరతలామలకమగును.)

— కుంభముద్రా లక్షణమ్ —

*శ్లో॥ దక్షాఙ్గుష్ఠం పరాఙ్గుష్ఠే క్షిప్త్వాహస్తద్వయేనతు ।
సావకాశాంత్వేకముష్టిం కుర్యాత్కుంభాఖ్యముద్రికా॥

తా॥ కుడిబొటనవ్రేలిని ఎడమ బొటనవ్రేలిమీద ఉంచి హస్తద్వయముచే లోపల అవకాశము కలుగునట్లు పిడికిలి (ముష్టి) పెట్టిన కుంభముద్ర అగును.

— పూజాద్రవ్యశుద్ధి —

*శ్లో॥ పుష్పనైవేద్య గంధాదీన్ "హ్రీంఫ్రహాంపట్" ఇతి మన్త్రితః దృష్టం వాచాత్మవిజ్ఞాతం సమ్యక్పుష్పాది దూషణం। అస్పృశ్యస్పర్శనం వాపి యదన్యాయార్జితం చవా। తథా నిర్మాల్య సంస్పృష్టం కీటాద్యారోహణం చయత్ । తత్పూర్వన్నాశమాయాతి నైవేద్యాద్యవలోకనాత్ ॥

(ఇతి మేరుతంత్రే)

*తా॥ పుష్ప, నారికేళ, ఫల, గంధాక్షత, పత్రాది పూజాద్రవ్యములయందు "హ్రీం ఫ్రహాం పట్" అను మంత్రముచే జలమును ప్రోక్షించిన స్పర్శదోషము, అన్యాయార్జితాది ద్రవ్యదోషములు మొదలగున వన్నియు నైవేద్య దృష్టి దోషము వలన కలిగిన దోషముతోసహా నశించును.

“హ్రీం హూం ఫట్” ఇతి కలశోదకేన దేవమాత్మా
నం పూజాద్రవ్యాణిచ సంప్రోక్ష్య

— శంఖపూజా విధానం —

తదంగ శంఖపూజాం కరిష్యే ॥

కలశోదకేనశంఖం ప్రక్షాళ్య । శంఖముదకేన పూర
యిత్వా । శంఖంగంధపుష్పాక్షతైరభ్యర్చ్య । శంఖమూలే
బ్రహ్మాణమావాహయామి । శంఖమధ్యే విష్ణుమావాహయామి।
శంఖాగ్రేసోమమావాహయామి ॥

శ్లో॥ శంఖం చంద్రార్క దైవత్యం కుక్షౌవారుణదైవతం ।
పృష్ఠే ప్రజాపతిశ్చన్ద్ర అగ్రే గఙ్గా సరస్వతీ ।
త్రైలోక్యేయానితీర్థాని వాసుదేవస్య చాజ్ఞయా ।
శంఖేతిష్ఠన్తి సర్వాణి తస్మాచ్ఛంఖం ప్రపూజయేత్ ॥

శంఖమూలే బ్రహ్మణేనమః । శంఖమధ్యే విష్ణవేనమః ।
శంఖాగ్రే సోమాయనమః । ప్రణవేన ద్వాదశవారమభిమంత్ర్య।
“హ్రీం హూం ఫట్” ఇతి శంఖోదకేన దేవమాత్మానం
పూజాద్రవ్యాణిచ సంప్రోక్ష్యకలశే కించిన్నిక్షిప్య । తచ్ఛేష
మీశాన్యే దేశేవిసృజేత్ ॥ గాయత్ర్యాపునశ్శంఖం పూరయిత్వా॥

శ్లో॥ త్వంపురాసాగరోత్పన్నః విష్ణునావిధృతః కరే ।
సర్వదేవహితార్థాయ పాఞ్చజన్య నమోస్తుతే ॥

తా॥ ఓ పాఞ్చజన్యమా ! పూర్వము నీవు సముద్రము నుండి పుట్టితివి. శ్రీ మహావిష్ణుహస్తముచే లోకకళ్యాణము కొఱకు గ్రహింపఁబడితివి.

శ్లో॥ ఆరాధితోమనుష్యైస్త్వం సిద్ధైర్దేవాసురాదిభిః ।
ఆరాధయామిభక్త్యాత్వాం మాంగృహాణమహేశ్వర ॥
హృదయే లింగరూపమావాహ్య। మనసాధ్యాయేత్ ॥

శ్లో॥ గోత్రాపీఠం మహాన్తం జలధరకలశం స్వచ్ఛమాకాశ
లిఙ్గం। శ్రీతారా పుష్పమాలం, గ్రహగణ కుసుమం
సూర్యచంద్రాగ్ని నేత్రమ్ । పూతం సప్తాబ్ధికుక్షిం, గి
శిఖరభుజం, సప్తపాతాళపాదమ్। ఆశావక్త్రం, ప్రసిద్ధ
భవహరణచణం దివ్యలిఙ్గం నమామి ॥
ఇతి ధ్యాత్వా । లింగముద్రాం ప్రదర్శ్య
మనసా పంచపూజాం కుర్యాత్ ॥

(తన హృదయ పద్మమునందు పైశ్లోకార్థ ప్రతిపాద మైన మహాలింగ స్వరూపమును ప్రతిష్ఠించుకొని లింగముద్రను ప్రదర్శించి, మనసాధ్యానించి పంచోపచార మానసపూ చేయవలయును.)

| | | | |
|---|---|---|---|
| లం పృథివీతత్త్వాత్మనే | ఉమా=నమః | గన్ధం | పరికల్పయామి |
| హం ఆకాశ | " | పుష్పం | " |
| యం వాయు | " | ధూపం | " |
| రం తేజో | " | దీపం | " |
| వం అమృత | " | అమృతనైవేద్యం | |
| సః సర్వ | " | సర్వోపచారాన్ | |

— లిఙ్గముద్రా లక్షణమ్ —

*శ్లో॥ ఉధృత్య దక్షిణాఙ్గుష్ఠం వామాఙ్గుష్ఠేన యోజయేత్,
వామాఙ్గులీ ర్దక్షిణీభిరంగుళీభశ్చ వేష్టయేత్ ।
లిఙ్గముద్రేయ మాఖ్యాతా శివసాన్నిధ్యకారిణీ ॥

తా॥ కుడి బొటనవ్రేలిని ఎత్తి దానిని ఎడమ బొటన వ్రేలితో కలిపి ఎడమవ్రేళ్ళను కుడివ్రేళ్ళతో చుట్టపెట్టిన లింగ ముద్ర యగును. ఇది శివసాన్నిధ్యమును కలిగించును.

అన్యచ్చగ్రంధాన్తరే :—

*శ్లో॥ అంగుష్ఠోర్ధ్వం తథాముష్టిం కృత్వావామేన వేష్టయేత్

తా॥ కుడి బొటనవ్రేలు ఊర్ధ్వముగా ముష్టినిచేసి ఆ బొటనవ్రేలిని ఎడమ బొటనవ్రేలితో చుట్టిన లిఙ్గముద్ర యగును అని గ్రన్థాన్తరమున గలదు.

త్ర్యంబకం యజామహే, ఇత్యనైసమారాధయేత్ ।

।                    ॥

త్ర్యంబకం యజామహే — మామృతాత్ ॥

ఇతి స్థాపనముద్రాం దర్శయిత్వా

— స్థాపన ముద్రా లక్షణమ్ —

*శ్లో॥ అధోముఖాభ్యాం హస్తాంభ్యాం స్థాపినీ ముద్రికామతా।

తా॥ రెండు చేతులను బోర్లించి బొటనవ్రేళ్ళను ఉంగరంవేలి మొదటు తగిల్చిన స్థాపనముద్ర యనబడును.

(చరలింగాదులయందే స్థాపనముద్ర వేయవలెనుగాని దేవాలయాదులయందు ప్రతిష్ఠింపబడిన లింగములయందు స్థాపనముద్ర ప్రదర్శించ నక్కరలేదని కొందఱి మతము)

*ఆవాహనహీనాన్పంచ షడ్వా త్ర్యంబక మిత్యనేనా౽ వాహనం కుర్యాత్ ॥

(చరలింగమునందు 5-6 మారులు త్ర్యంబకమంత్రము నుచ్చరించి ఆవాహన చేయవలెను.)

*(కొందరు జలకుమ్భార్చన చేయకుండా "అథైనం గంధాక్షత" అని లింగము నర్చింతురు "హ్రీమ్ హ్రామ్ ఫట్" అనే బీజాక్షరముల నుచ్చరించి పూజాద్రవ్యములను మంత్ర పూత జలముతో శుద్ధిచేసినగాని "అథైనం గంధాక్షత" అని లిఙ్గము నర్చించరాదు. అర్చకస్వామి ప్రాతఃకాల నిత్యార్చన చేసి లిఙ్గమూర్తిని పూజించియుండుటచేత లిఙ్గమూర్తి ఆరోజు పూజార్హుడై యున్నాడు. గాన జలకుంభార్చన (తీర్థపుబిందె) అయిన తరుహాతనే "అథైనం గంధాక్షత" మని లిఙ్గమూర్తి నర్చించుట విధి.)

అథైనం గంధాక్షత పత్రపుష్పధూపదీప నైవేద్య తాంబూలై రభ్యర్చ్య । ఆత్మానం ప్రత్యారాధయేత్

మం॥ ఆత్వావహన్తుహరయస్సచేతసశ్శ్వైతై

రశ్మైస్సహ కేతుమద్భిః । వాతాజవైర్బలవద్భి

ర్మనోజవైరాయాహి శీఘ్రం మమ హవ్యాయశర్వోమ్॥

మం॥ చత్వారిశృఙ్గాత్రయో అస్యపాదాద్వేశీర్షే

సప్తహస్తాసోఅస్య । త్రిధాబద్ధో వృషభో రో

రవీతి మహోద్దేవో మర్త్యాగ్ం ఆవివేశ ॥

ఈశానమావాహయామి ॥

ఇతి దక్షిణనాసాయాం పుష్పేణ పీఠస్థే లిఙ్గే సం యోజ్యాఽ వాహ్య ॥ (బోధాయనము)

(కుడిముక్కులోనుండి వదలిన గాలిని ఒకపుష్పముపై విడిచి ఆ పుష్పముతో లిఙ్గమును స్పృశించుచూ తనఆత్మను లింగమందు ప్రవేశపెట్టినట్లు భావించవలెను)

వాఙ్మనశ్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణప్రాణాః ।

ఇహాఽగచ్ఛ సుఖం చిరంతిష్ఠన్తు స్వాహా ॥

శ్లో॥ మణ్డలాంతరగతం హిరణ్మయం భ్రాజమానవపుషం శుచిస్మితం । చణ్డదీధితిమఖండవిగ్రహం చింతయేన్మునిసహస్రసేవితమ్ ॥

శంకరస్య చరితాకథామృతం చంద్రశేఖర గుణాను

కీర్తనం । నీలకంఠతవపాదసేవనం సంభవన్తు మమ జన్మ జన్మని ॥

శ్లో॥ ప్రసన్నో భవదేవేశ సుముఖో భవశంకర ।
శాంతో భవ గిరీశత్వం మమచాభి ముఖో భవ ॥

శ్లో॥ స్వామిన్ సర్వ జగన్నాథ యావత్పూజాఽవసానకం ।
తావత్త్వం ప్రీతిభావేన లింగేఽస్మిన్ సన్నిధిం కురు॥

స్థిరో భవ వరదో భవ, సుముఖో భవ, సుప్రసన్నో భవ, ఆవాహితో భవ, స్థాపితో భవ, సన్నిహితో భవ, సన్నిరుద్ధో భవ, అవకుణ్ఠితో భవ, మమేష్టకామ్యార్థసిద్ధిదో భవ, ప్రసీద, ప్రసీద.

ఆవాహన, స్థాపన, సన్నిధాపన, సన్నిరోధన, అవకుణ్ఠన, దిగ్బంధన, వందన, ధేను, యోనిముద్రాః ప్రదర్శ్య॥

*(సాల[illegible]మమందు నర్మదా బాణలింగములందు ప్రతిష్ఠిత లింగములందు ఆవాహన విసర్జనలు చెయరాదు ఆవాహన ఆత్మావహం త్వేత్యాదులచే చరలింగములందే చేయవలెను)

## — ఆవాహనముద్రా లక్షణమ్ —

*శ్లో॥ హస్తాభ్యామఞ్జలింబద్ధ్వాఽనామికా మూలపర్వణి
అంగుష్ఠే నిక్షిపేత్సేయం ముద్రాహ్యావాహినీమతా॥

(తంత్రరాజే)

తా॥ అంజలి ఘటించి ఉంగరపు వ్రేళ్ళ మొదటికణుపుల యందు బొటనవ్రేళ్ళ మొదటి కణుపులయందు బొటనవ్రేళ్ళ నుంచిన ఆవాహనముద్ర యనబడును.

— సన్నిధాపనముద్రా లక్షణమ్ —

*శ్లో॥ ఉత్తానాం గుష్ఠయోగేన ముష్టికృతకరద్వయః
సన్నిధీకరణీ నామముద్రా దేవార్చనావిధౌ ॥

(తంత్రరాజే)

తా॥ రెండు పిడికిళ్ళను ఒకదాని కొకటి అభిముఖముగా నుంచి బొటనవ్రేళ్ళను ఊర్ధ్వముఖముగా నుంచిన సన్నిధాపన ముద్ర యగును.

— సన్నిరోధనముద్రా లక్షణమ్ —

*శ్లో॥ అంగుష్ఠ గర్భిణీసైవముద్రా స్యాత్సన్నిరోధినీ ॥

తా॥ బొటనవ్రేళ్ళను ముడిచి పిడికిళ్ళను బిగించి రెండును పరస్పరము నభిముఖముగా నుంచిన సన్నిరోధన ముద్ర యగును,

— అవకుణ్ఠనముద్రా లక్షణమ —

*శ్లో॥ సవ్యహస్త కృతాముష్టిర్దీర్ఘాధోముఖ తర్జనీ
అవకుణ్ఠన ముద్రేయ మభితో మ్రుద్రితామతా ॥

(లక్ష్యసంగ్రహే)

తా॥ కుడిచేతి పిడికిలి దీర్ఘముగా, క్రింది ముఖముగల చూపుడువేలు కలదైనచో అవకుంఠనముద్ర యగును.

## — ధేనుముద్రా లక్షణమ్ —

[ 131 వ పేజీలో చూడుడు. ]

## — యోనిముద్రా లక్షణమ్ —

శ్లో॥ మధ్యమే కుటిలేకృత్వా తర్జన్యుపరి సంస్థితే
ఆనామికా మధ్యగతే తద్వైవహి కనిష్ఠికే
సర్వాస్సర్వత్ర సంయోజ్య అంగుష్ఠ పరిపీడితాః
ఏషాతు ప్రథమాముద్రా యోనిముద్రేతి సంజ్ఞికా॥

తా॥ మధ్యము వ్రేళ్ళు కొంచెము వంచి చూపుడు వ్రేళ్ళ చివరి భాగములపై మధ్యమ వ్రేళ్లు అగ్రభాగములను తగిల్చి ఉంగరపు వ్రేళ్ళను పరస్పరము తర్జనీమధ్యమములలో నుంచి రెండు మధ్య వ్రేళ్ళ క్రింద ఆవిధముగానే చిటికెన వ్రేళ్ళ నుంచి బొటన వ్రేళ్ళతో నొక్కబడిన యోనిముద్ర యగును.

శ్లో॥ అథసంప్రార్థ్యదేవేశం సద్యోజాతాది పఞ్చభిః
మన్త్రైష్షోడశధాభక్తైష్షోడశాను పచారకాన్
ఆసనాది నమస్కార పర్యన్తాన్ పరిపూజయేత్
భవాయ దేవాయ నమ-ఇతి మన్త్రాష్టకేనచ
అష్టమూర్తిం మహేశానం తత్పత్నీరపి పూజయేత్
తత్త న్నామాన మీశానం తత్పత్నీరపి తర్పయేత్ ॥

(రావణః)

తా॥ సద్యోజాతాది పంచబ్రహ్మ మంత్రముల చేత నున్నూ త్ర్యంబక శివపంచాక్షరీ మంత్రము చేతనున్నూ

మహాదేవునకు ఆసనాది నమస్కార పర్యన్త షోడశోపచారపూజ చేసి "భవాయ దేవాయ నమః" అను 8 మంత్రములచేత అష్టమూర్తియైన మహేశ్వరునీ శివపత్నినీ అష్టపుష్పములచే పూజించి ఆ నామములుగల ఈశ్వరునీ రుద్రపత్నినీ ఉద్దేశించి తర్పణము చేయవలయును.

— సద్యోజాతాది మంత్రవిధానపూజా —

త్ర్యంబకం యజామహే = మామృతాత్। ఓమ్నమశ్శివాయ।
కద్రుద్రాయ = హరే॥ ఇత్యావహయామి.
త్ర్యంబకం = మామృతాత్
ఓమ్నమశ్శివాయ। సద్యోజాతం ప్రపద్యామీత్యాసనమ్.
త్ర్యంబకం = మామృతాత్। ఓమ్నమశ్శివాయ। సద్యోజాతా
యవై నమోనమః। ఇతిపాద్యమ్
త్ర్యంబకం = మామృతాత్। ఓమ్నమశ్శివాయ। భవేభవేనాతి
భవేభవస్వమామ్। ఇత్యర్ఘ్యమ్
త్ర్యంబకం — మామృతాత్। ఓమ్నమశ్శివాయ। భవోద్భ
వాయనమః ఇత్యాచమనీయమ్.
త్ర్యంబకం = మామృతాత్। ఓమ్నమశ్శివాయ। వామదేవా
యనమః అభింగాభిశ్చస్నానమ్ ఆపోహిష్ఠాదిభిః
త్ర్యంబకం — తాత్। ఓమ్నమశ్శివాయ। జ్యేష్ఠాయనమః।
ఇతివస్త్రమ్। తూష్ణీమాచమనం.
త్ర్యంబకం=తాత్। ఓమ్నమశ్శివాయ। శ్రేష్ఠాయనమః।

ఇత్యుపవీతమ్.

త్ర్యంబకం = తాత్ । ఓమ్‌నమశ్శివాయ । రుద్రాయనమః ।

ఇత్యాభరణాని.

త్ర్యంబకం = తాత్ । ఓమ్‌నమశ్శివాయ । కాలాయనమః ,

ఇతిగంధమ్.

త్ర్యంబకం = తాత్ । ఓమ్‌నమశ్శివాయ । కలవికరణాయ నమః । ఇత్యక్షతాన్.

త్ర్యంబకం = తాత్ । ఓమ్‌నమశ్శివాయ । బలవికరణాయ నమః । ఇతిపుష్పమ్.

త్ర్యంబకం = తాత్ । ఓమ్‌నమశ్శివాయ । బలాయనమః ॥

ఇతిధూపమ్.

త్ర్యంబకం = తాత్ । ఓమ్‌నమశ్శివాయ । బలప్రమథనాయ నమః । ఇతదీపమ్.

త్ర్యంబకం = తాత్ । ఓమ్‌నమశ్శివాయ । సర్వభూతదమనాయనమః । ఇతి నైవేద్యమ్ ॥ తూష్ణీమాచమనం.

త్ర్యంబకం = తాత్ । ఓమ్‌నమశ్శివాయ । మనోన్మనాయ నమః । ఇతి తాంబూలమ్.

త్ర్యంబకం = తాత్ । ఓమ్‌నమశ్శివాయ । అఘోరేభ్యః .... రుద్రరూపేభ్యః ఇత్యుత్తరనీరాజనమ్.

త్ర్యంబకం = తాత్ । ఓమ్‌నమశ్శివాయ । తత్పురుషాయ .... ప్రచోదయాత్ ఇతి మంత్రపుష్పమ్.

త్ర్యంబకం = తాత్ । ఓమ్‌నమశ్శివాయ । ఈశానస్సర్వ .... సదాశివోమ్ ॥ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.

*ఇతి సర్వత్ర త్ర్యంబకస్యావృత్తిః । సర్వత్రమూల మంత్రస్యవా ఆవృత్తిః । మూలమంత్రశ్చ । ఓమ్‌నమశ్శివాయేతివా । ఓమ్ నమశ్శంభవేచేతివా । ఓమ్ నమోభగవతే రుద్రాయేతివా ॥

*— అష్టమూర్తులు —

శ్లో॥ యాసృష్టి (స్స్రష్టురాద్యావహతి విధిహుతం
యాహవిర్యాచహోత్రీ
యే ద్వేకాలం విధత్త శ్రుతివిషయగుణాయాస్థితా
వ్యాప్యవిశ్వమ్
యామాహు స్సర్వభూత ప్రకృతిరితియయా
ప్రాణినః ప్రాణవన్తః
ప్రత్యక్షాభిః ప్రపన్న స్తనుభిరవతు వస్తాభిరష్టాభిరీశః ॥
(కాళిదాసకృత ప్రార్థనాశ్లోకః)

* రుద్రోఽష్టమూర్తిః

1 — జలమయీతనుః
2 — తేజోమయీతనుః (అగ్నిః)
3 — యజమానరూపాతనుః (హోతా)
4 — సూర్యరూపాతనుః
5 — చంద్రరూపాతనుః
6 — ఆకాశమయీతనుః
7 — పృధివీమయీతనుః
8 — వాయురూపాతనుః

* ఈశ్వరుఁ డష్టతనూరూపుఁ డగుటచే నష్టమూర్తి నామ మన్వర్థము. ఆ యష్టమూర్తులను స్మరించుచు అష్ట పుష్పములతో పూజించిన ఫలము వర్ణనాతీతము.

ఉపమన్యువు మునికుమారుఁడు. అతఁడు తల్లి యాజ్ఞాను సారము దారిద్ర్యమును నిర్మూలించుకొనుటకై శివపంచాక్షరిని జపించుటకు విపినమున కేగెను. అచట రుద్రుఁ డష్టమూర్తి యగుటచే నెనిమిది యిటుకలతో అతడొక చిన్న దేవళమును నిర్మించి యందు మృల్లింగమును స్థాపించి భవాయేత్యాది మంత్రములను జపించెను. ఆ యష్టేష్టికల నష్టమూర్తులుగ భావించి యష్టమూర్తిని ధ్యానించుటచేతనే తపస్సిద్ధి లభించి అష్టైశ్వర్యములను వడసెనని శివపురాణమున చెప్పఁబడినది. కావున అష్టమూర్తి పూజ అష్టపుష్పములతోఁ జేసిన అష్టైశ్వర్య ములు లభించును.

శ్లో॥ అర్కచంపక పున్నాగనంద్యావర్తంచ పాటలమ్ ।
బృహతీకరవీరాణి ద్రోణపుష్పాణి చార్చయేత్ ॥
అష్టభిస్తనుభిర్నిత్యం విరాజన్తం మహేశ్వరమ్ ।
అష్టైశ్వర్యప్రదం వన్దేశుద్ధమవ్యయమద్వయమ్॥ (ఉమ।)

అథాస్యాష్టభిర్మంత్రైరష్టౌ పుష్పాణి

భవాయ దేవాయనమః। అర్కపుష్పం సమర్పయామి
(జిల్లేడు)

శర్వాయ దేవాయనమః । చంపకపుష్పం సమర్పయామి
(సంపెంగ)
ఈశానాయ దేవాయనమః । పున్నాగపుష్పం సమర్పయామి
(సురపొన్న)
పశుపతయే దేవాయనమః । నంద్యావర్త పుష్పం సమర్ప
యామి (నందివర్ధనం)
రుద్రాయ దేవాయనమః । పాటల పుష్పం సమర్పయామి
(కలిగొట్టు)
ఉగ్రాయ దేవాయనమః । బృహతీ పుష్పం సమర్పయామి
(వాకుడు)
భీమాయ దేవాయనమః । కరవీర పుష్పం సమర్పయామి
(కరివేరం, ఎఱ్ఱగన్నేరు)
మహతే దేవాయనమః । ద్రోణ పుష్పం సమర్పయామి
(తుమ్మి)
భవస్యదేవస్య పత్న్యైనమః । అర్కపుష్పం సమర్పయామి
శర్వస్యదేవస్య పత్న్యైనమః । చంపకపుష్పం సమ....మి
ఈశానస్యదేవస్య పత్న్యైనమః । పున్నాగపుష్పం సమర్ప।
పశుపతేర్దేవస్య పత్న్యైనమః । నంద్యావర్త పుష్పం సమ।
రుద్రస్యదేవస్య పత్న్యైనమః । పాటలీ పుష్పం సమ .... మి
ఉగ్రస్యదేవస్య పత్న్యైనమః । బృహతీ పుష్పం సమ....మి
భీమస్యదేవస్య పత్న్యైనమః । కరవీర పుష్పం సమ....మి
మహతోదేవస్య పత్న్యైనమః । ద్రోణ పుష్పం సమ .... మి

— అష్టవిధ అంతః కుసుమపూజా —

*శ్లో॥ అహింసా ప్రథమం పుష్పం పుష్పమింద్రియ నిగ్రహమ్
సర్వభూతదయాపుష్పం క్షమాపుష్పం విశేషతః
శాంతిపుష్పం తపఃపుష్పం ధ్యానపుష్పం తథైవచ
సత్యమష్టవిధం పుష్పమేతైస్తుష్యతిశంకరః ॥

(లైఙ్గే శివతోషిణ్యామ్)

తా॥ 1. సర్వభూతములను మరియు తన హృదయమును మాటలచేత, చేతలచేత, తలంపులచేతనూ కూడ హింసింపకుండుటయే అహింసాపుష్పము.

2 అంతరింద్రియ బహిరింద్రియముల ప్రభావమునకు లొంగకుండుటయే ఇంద్రియ నిగ్రహమను పుష్పము.

3. సర్వభూతములను ఆత్మైక్యముతో దయతో చూచుటయే సర్వభూతదయాపుష్పము.

4. సర్వదా సర్వసమర్థుడయ్యునూ ఓర్పు కలిగి యుండుటయే క్షమాపుష్పము.

5. మనోబుద్ధులను నిశ్చలముగానుంచి ప్రశాంతితో నుండుటయే శాంతి పుష్పము.

6. ఇష్టదైవమును హృదయమున నిలిపి ఇంద్రియముల నరికట్టి ఇష్టదేవతానుగ్రహప్రాప్తికై సదా తపించుటయే తపోపుష్పము.

7. విషయములను విషమువలె త్యజించి ఇష్టదేవతా నామరూపములను మనస్సులో ధ్యానించుటయే ధ్యానపుష్పము

8. ఎట్టి పరిస్థితులకు లొంగక సర్వదా సత్యమును పలుకుటయే సత్యపుష్పము.

ఈ ఎనిమిది గుణములను పుష్పములచేత శంకరుని పూజించిన ఆ మహాదేవుడు సంతుష్టి పొందును. గాన ప్రయత్నముచే ఈ ఎనిమిది గుణముల నలవర్చుకొనవలెను.

పత్రపుష్పాక్షతసుగంధోదకైః । భవాయేత్యాదిభిస్తర్పయేత్

— తర్పణమ్ —

భవందేవంతర్పయామి । శర్వందేవంతర్పయామి ।
ఈశానందేవంతర్పయామి । పశుపతిందేవంతర్పయామి ।
రుద్రందేవంతర్పయామి । ఉగ్రందేవంతర్పయామి ।
దేవంతర్పయామి । మహాన్తందేవంతర్పయామి ॥

౨

భవస్య దేవస్య పత్నీస్తర్పయామి ।
శర్వస్య దేవస్య పత్నీస్తర్పయామి ।
ఈశానస్య దేవస్య పత్నీస్తర్పయామి ।
పశుపతేర్దేవస్య పత్నీస్తర్పయామి ।

రుద్రస్య దేవస్య పత్నీస్తర్పయామి ।
ఉగ్రస్య దేవస్య పత్నీస్తర్పయామి ।
భీమస్య దేవస్య పత్నీస్తర్పయామి ।
మహతో దేవస్య పత్నీస్తర్పయామి ॥

ఇతి తర్పయిత్వా ॥

అథాస్యాఘోరేభ్య ఇతితిసృభిః । సదాశివోమిత్యేతైరఘోర తనూరుపతిష్ఠతే ॥

అఘోరేభ్యో = రూపేభ్యః। తత్పురుషాయ = ప్రచోదయాత్

ఈశానస్సర్వవిద్యానా = సదాశివోమ్ ॥

అథ తత్పురుషాయేతి రుద్రగాయత్రీం జపేత్

తత్పురుషాయ విద్మహే = తన్నో రుద్రః ప్రచోదయాత్ ॥

ఇతి దశకృత్వ శ్శతకృత్వసహస్రకృత్వశ్చాఽపరిమిత కృత్వోవా । దశవారం వాజపిత్వా ॥

* (అటు పిమ్మట (1) అఘోరేభ్యో (2) తత్పురుషాయ (3) ఈశాన స్సర్వవిద్యానాం అను మూడు మన్త్రములనూజపించిన అఘోరతనువు (రుద్రుడు) సాక్షాత్కరించును. కావున మూడు మన్త్రములనూ పఠించవలయును.)

* అనంతరము "తత్పురుషాయ" అను రుద్రగాయత్రిని (పదిసార్లు లేక నూరుసార్లుగాని లేక వెయ్యిసార్లు

గాని యంతకు నెక్కువగాని కనీసము పదిసార్లయినను
జపించవలయును.]

అథైనమాశిషమాశాస్తే ॥

ఆశాస్తేయం యజమానోఽసౌ । ఆయురాశాస్తే ।
సుప్రజాస్త్వమాశాస్తే । సజాతవనస్యామాశాస్తే । ఉత్త
రాం దేవయజ్యామాశాస్తే । భూయోహవిష్కరణమా
శాస్తే । దివ్యం ధామాశాస్తే । విశ్వం ప్రియమాశాస్తే ।
యదనేనహవిషాశాస్తే । తదస్యాత్తదృధ్యాత్ । తదస్మై
దేవారాసన్తాం । తదగ్నిర్దేవోదేవేభ్యోవనతే । వయ
మగ్నేర్మానుషాః । ఇష్టంచ వీతంచ । ఉభేచనోద్యావా
పృథివీ అగంహసస్పాతాం । ఇహగతిర్వామస్యేదంచ ।
నమోదేవేభ్యః ॥

ఆథైతస్యమూర్ధ్నిహిరణ్మయేన కలశేన సంతతధారాం
నిషించేత్ ॥

(*అటుపిమ్మట శంకరుని శిరస్సునందు బంగారుకలశ ముతో నవిచ్ఛినధార పడునట్లు అభిషేకము చేయవలయును.)

— ఖడ్గమృగ శృఙ్గాగ్రజలాభిషేకఫలం —

శ్లో॥ గణ్డకస్య విషాణాగ్రాత్ పతితేనామ్బసాసతా ।
యదిరుద్రాభిషేకస్స్యాత్ ఫలం కోటిగుణం లభేత్ ॥

(మార్కండేయః)

తా॥ ఖడ్గమృగముయొక్క కొమ్ములో జలముపోసి దాని యగ్రభాగము ద్వారా సంతతధారతో శివు నభిషేకించిన కోటిరెట్లు ఫలితము లభించును.

* కతిచిత్ విప్రాశ్శివాభిషేకసమయే మహేశ్వరస్య మూర్ధ్ని ఉద్ధరణ్యా విచ్ఛిత్తిధార మభిషేకం కుర్వన్తి । తత్ నశాస్త్ర సమ్మతమ్ ॥

తస్మాత్ కమండలునా సంతతధారయా అభిషేకః కర్త వ్యః ॥

యద్వా:— సువర్ణనిర్మిత గోముఖం రజతగోముఖంవా తామ్రగోముఖంవా అరకూటగోముఖంవాకారయిత్వా ఖడ్గ మృగ శృంగాగ్రేయునక్త్వాతత్పతితధారయావా అభిషేకంకు ర్యాత్ ఇతి శిష్టాచారపద్ధతిః । శాస్త్రసమ్మతః పన్థాః॥

* (కొందఱు బ్రాహ్మణులు అభిషేక సమయమున శివుని శిరస్సునందు ఉద్ధరణితో సన్తతధారాపాత శూన్య

ముగ నభిషేకము చేయుచున్నారు ఈ పద్ధతి శాస్త్రసమ్మతము కానేరదు.

అందువలన కమండులువుతో సంతతధార పడునట్లు అభిషేకము చేయవలయును లేక బంగారముతోగాని, వెండితో గాని, రాగితోగాని, ఇత్తడితోగాని గోముఖమును చేయించి ఖడ్గమృగముయొక్క కొమ్ముచివర దానిని ఖచ్చితముచేసి దాని ద్వారా సంతతధార పడునట్లు అభిషేకము చేయవలయును. ఇయ్యది శిష్టు లాచరించునదియు, శాస్త్ర సమ్మతముగూడనై యున్నది. ఇదియే మంచిమార్గము.)

పయసా, సర్పిషా. దధ్నా, మధునాచే క్షుర సేనామ్ర రసేన నారికేళసలిలేన, పుష్పోదకేన, ఫలోదకేన, గంధోదకేచ తదభావే శుద్ధోదకేనవా, అదౌశంచమ ఇత్యేకానువాకం నమస్తే రుద్రమన్యవ ఇత్యేకాదశానువాకాన్ అగ్నావిష్ణూ సజోషసేత్యేక మేకమనువాక మేకైకవారం జపేత్। చిత్రిస్రుగితి సప్తానువాకా నంభస్యపారే బ్రహ్మణోమహిమాన మిత్యన్తం। త్వమగ్నే త్వమగ్నే ప్రతిపూరుషం ప్రతిపూరుషగ్ం రుద్రోవాఏష,రుద్రోవాఏష,ఆశుశ్శి శానస్త్సేసహోమసురాణాగ్ం సువర్గాయ। సజోస్రాసావాదిత్యాసోమ రాదస్రిమ్ । ప్రజాపతే రక్ష్యశ్వయత్ప్రజాపతర్ద్వాన సృజత సహస్రవృదియం భూమిరాదేవోయాతు చక్షుషోహేతే ప్రాజాపత్యావైపశవః । పవమానస్సువర్జనస్సృేమ

వా ఏషులోకే ప్రష్వచాం ప్రాచీం మితోఽసి దశశాంతీర్జ పిత్వా ॥

సర్వేషాం వారేవారే పునరారాధయేత్ । ఏతదుత్త మారాధనం ప్రోక్తమ్ ॥

తేనాభిషిక్తే నోదకేనాక్షిభ్యాంతే నాసికాభ్యామిత్య నువాకేన లింగాద్భిశ్చ శీర్షాది పాదపర్యన్తం పుష్పేణ సంమృజ్య మార్జయేత్ ।

సదా పాపక్షయార్థీ, వ్యాధినాశనార్థీ, శత్రునాశనార్థీ, జీవితార్థీ, కామ్యార్థీ, మోక్షార్థీ, శ్రీకామః, శాంతికామః, పుష్టి కామ తుష్టికామోవృద్ధికామః, ప్రజాకామో మేధాకామః, ఆయు ష్యకామః, అన్నాద్యకామః, కుర్యాదేవం కుర్వన్సిద్ధి మవాప్నోతి ఆచార్యాయ దక్షిణాదశగావస్సవత్సాస్సువర్ణశృంగాః రౌప్య ఖురాః రత్నమణిమయభూషితాః వృషభా ఏకాదశ ॥

తదలాభే ఏకాం గాం దద్యాదేకాదశ బ్రాహ్మణాన్ భోజయే దశ్వమేధ శతసహస్రక్రతు ఫలమవాప్నోతీత్యాహ భగవాన్ బోధాయనః ॥

— ఋత్విగ్దక్షిణా —

బంగారు కొమ్ములు, వెండి డెక్కలు, రత్నహారము లతో అలంకరించబడిన దూడలుగల పది ఆవులను,

11 వృషభములను అభిషేకము చేయించిన వారికి దక్షిణగా నీయవలెను. శక్తిలేనివారు ఒక గోవునైన ఈయవలెనని బోధాయనులవారు వచించిరి.

(*గాన ఈనాటి దేశకాలపరిస్థితుల ననుసరించి యథాశాస్త్రముగా అభిషేకము చేయించుకొని ఋత్విగ్దక్షిణ తృప్తిగా నిచ్చుట సమంజసము. తమశక్తి ననుసరించి ఇచ్చిన నక్షయ ఫలము కలుగును. ఈవిధముగా నభిషేకము చేయించినవారిని సంతృప్తిపరచుట విధి. "హతోయజ్ఞస్త్వదక్షిణః")

## — పాత్రాసాదన విధి —

తతో మహాదేవస్యపురతః అష్టదళమండలే

శ్లో॥ అర్ఘ్యం వాయుప్రదేశేతు నైర్ఋత్యాం పాద్యమేవచ
ఈశానేస్యా దాచమనం స్నానం చైవాగ్నికోణకే
మధుపర్కం మధ్యమేతు పూజయేత్పంచపాత్రకే ॥

## — అర్ఘ్యపాద్య ఆచమన లక్షణాని —

శ్లో॥ తత్రార్ఘ్యపాత్రేదాతవ్యం గంధపుష్పయవాఽక్షతాః
కుశాగ్రతిలదూర్వాశ్చ సర్ష పాశ్చార్ఘ్య సిద్ధయే ॥

తా॥ అర్ఘ్యసిద్ధికొరకు అర్ఘ్యపాత్రయందు గంధము, పుష్పము, యవలు, అక్షతలు, దర్భాగ్రములు, నువ్వులు, గరిక పోచలు, ఆవాలున్ను కొంచెము కొంచెముగ నుంచవలయును.

*శ్లో॥ పాద్యపాత్రేపిదాతవ్యం శ్యామాకంచ సుదూర్వకం
అబ్జంచ విష్ణుక్రాంత చ ప్రయత్నాత్పాద్యసిద్ధయే ॥

తా॥ పాద్యసిద్ధికొఱకు పాద్యపాత్రయందున్న గరిక పోచలు, పద్మదళములు, విష్ణుక్రాంత పుష్పములు ఉంచ వలయును.

*శ్లో॥ తథాఽచమనపాత్రేచ దద్యాజ్జాతిఫలంమునే
లవంగమపితక్కోలం శస్తమాచమనీయకే ॥

తా॥ ఆచమనపాత్రియందు జాజికాయ, లవంగము తక్కోలములు నుంచవలయును.

శ్లో॥ అభిషేకం తతఃకుర్యా దమృతైః పంచభిః క్రమాత్
పశ్చాచ్ఛుద్ధోదకేనాథ తతఃపూజన మాచరేత్
రౌద్రీస్థారాం తతః కుర్యాత్రోప్చ్యతే తద్విధానతః ॥
(మేరుతంత్రి)

తా॥ ఈపైన చెప్పినవిధముగా ఆయాస్థానములయందు ఆయా పాత్రిలను ఉంచి పంచామృతములచే మహాదేవు నభిషేకించిన పిమ్మట శుద్ధోదకముచే నభిషేకించి పూజించవలయును

— పంచామృతస్నాన సంకల్పః —

పూర్వోక్త ఏవంగుణ=ర్థం శ్రీ ఉమామహేశ్వరం పంచామృతైస్స్నాపయిష్యే॥ తదంగ పంచద్రవ్య దేవతాపూజాం కరిష్యే ॥

— తత్క్రమః (పంచద్రవ్యపాత్రా సాదనమ్) —

శ్లో॥ మధ్యేపయస్తథా పూర్వేదధ్యాదీన్ విన్యసేత్క్రమాత్ ।
మూలమంత్రేణగాయత్ర్యాతత్తన్మంత్రైః ప్రపూజయేత్॥

పంచామృతపాత్రాణి, ప్రత్యేకం, ప్రత్యేకం, స్థాపయిత్వా. పూజయేత్, మధ్యేక్షీరమ్, పూర్వేదధి, దక్షిణే ఘృతమ్ పశ్చిమేమధు, ఉత్తరే శర్కరా॥

అస్యశ్రీ పంచద్రవ్య మహామంత్రస్య గౌతమవామదేవ పరమేష్ఠి ప్రజాపతిర్విశ్వామిత్రా ఋషయః । సోమోవాయు రవిర్విశ్వేదేవాస్సవితారో దేవతాః । గాయత్ర్యుష్ణిగనుష్టుప్ బృహతీపంక్తయశ్ఛందాంసి । పంచద్రవ్యదేవతా ప్రసాద సిద్ధ్యర్థే పంచద్రవ్యారాధనే వినియోగః ॥

1 మం॥ తత్పురుషాయ విద్మహే=ప్రచోదయాత్ । భూర్భువస్సువః తత్సవితుర్వ=యాత్ । ఇతి క్షీరపాత్ర మభిమంత్ర్య । ఆప్యాయస్వ—సంగథే । క్షీరేచంద్ర మావాహయామి ॥

2 మం। అఘోరేభ్యో=రూపేభ్యః । ఓమ భూర్భువస్సువః । తత్సవితుర్వరేణ్యం=ప్రచోదయాత్ । ఇతి దధిపాత్ర మభిమంత్ర్య । దధిక్రావుణో=తారిషత్ । దధౌ వాయుమావాహయామి ॥

3 మం॥ సద్యోజాతం ప్రప=నమః । ఓం భూర్భువస్సువః । తత్సవితుర్వ=ప్రచోదయాత్ । ఇత్యాజ్య పాత్ర

మభిమంత్ర్య । శుక్రమసి=రశ్మిభిః । ఆజ్యేరవిమా
వాహయామి॥

4 మం॥ వామదేవాయ నమో = నమః । ఓమ్ భూర్భువస్సు
వః।తత్సవితుర్వరేణ్యం=యాత్ । ఇతి మధుపాత్ర
మభిమంత్ర్య । మధువాతా=భవంతునః। మధౌ
విశ్వాన్ దేవా నావాహయామి ॥

5 మం॥ ఈశానస్సర్వ=సదాశివోమ్ । ఓమ్ భూర్భువస్సువః।
తత్సవితుర్వరేణ్యం = యాత్ । ఇతి శర్కరా
పాత్రమభిమంత్ర్య । స్వాదుఃపవస్వ=అదాభ్యః ।
శర్కరేసవితారమావాహయామి ॥

(ఆవాహయామి యనునప్పుడు తత్తత్పాత్రలను దక్షిణహస్త
ముతో అభిమంత్రించవలయును.)

పంచద్రవ్యదేవతాభ్యఃలమితిపంచపూజాంకుర్యాత్ లం ।
పృథివీతత్వాత్మనే గంధం పరికల్పయామి । హం ఆకాశతత్వా
త్మనే పుష్పం పరి=మి । యం వాయు తత్వాత్మనే ధూపం
పరి=మి । రం తేజోతత్వాత్మనే దీపం పరి=మి । వం అమృత
తత్వాత్మనే అమృతనైవేద్యల పరి=మి। సః సర్వతత్వాత్మనే
సర్వోపచారపూజాం పరి=మి ॥

పఞ్చామృతస్నానాదౌపంచ వక్త్రధ్యానమ్ కుర్యాత్ ॥

శ్లో॥ ధ్యాయామిపురుషం వక్త్రమఘోరం ముఖమేవచ ।
సద్యోజాతం వామదేవమీశానం మనసామమ ॥
పఞ్చవక్త్రముద్రాం ప్రదర్శయేత్ ॥

## — పఞ్చాస్యముద్రా లక్షణమ్ —

శ్లో॥ దక్షవామకరాఙ్గుళ్యోర్మిళితాశ్చేత్పరస్పరం ।
పఞ్చాస్యనామ్నీ ముద్రేయ భక్తిశౌర్యవిధాయినీ ॥

తా॥ కుడిచేతివ్రేళ్ళ చివరిభాగములు ఎడమచేతివ్రేళ్ళ చివరిభాగములు ఒకదానితో నొకటి కలిసిన పఞ్చాస్య ముద్ర యగును. ఇది భక్తిని, శౌర్యమును కలుగజేయును.

శ్లో॥ పంచామృతైశ్చస్నపనం తత్స్నానం తైశ్చకారయేత్ ॥

1. ఓమ్ఆప్యాయస్వ=సంగథే॥

శ్లో॥ గోక్షీరధామన్ దేవేశ గోక్షీరేణమయాకృతం।
స్నపనం దేవదేవేశ గృహాణశశిశేఖర ॥

శ్రీఉమా=నమః । క్షీరస్నాన సమర్పయామి । క్షీర స్నానానంతరం శుద్ధోదకస్నానం । ఓమ్ఆపోహిష్ఠా = యథాచనః । క్షీరస్నానానంతరం శుద్ధోదకస్నానం సమర్ప యామి ॥

ఏవం ప్రకారేణ కారయేత్ ॥

2 ఓమ్ దధిక్రావ్ణ్ణో = తారిషత్ ॥

శ్లో॥ దధ్నాచైవమయాదేవ స్నపనం క్రియతేతవ ।
గృహాణశంభోయద్దత్తం ప్రసన్నోమేభవావ్యయ ॥

శ్రీఉమా=నమః । దధిస్నానం సమర్పయామి । ఓమ ఆపోహిష్ఠా=యథాచనః । దధిస్నానానంతరం శుద్ధోదకస్నానం సమర్పయామి ॥

3. ఓమ్శుక్రమసిజ్యోతిరసి=రశ్మిభిః ॥

శ్లో॥ సర్పిషాదేవదేవేశ స్నపనం క్రియతేతవ ।
మృత్యుంజయ గృహాణేనం శ్రద్ధయా సురసత్తమ॥

శ్రీఉమా=నమః । ఆజ్యస్నానం సమర్పయామి ॥

ఓమ్ ఆపోహిష్ఠా=యధాచనః । ఆజ్యస్నానానంతరం శుద్ధోదకస్నానం సమర్పయామి ॥

4. ఓమ్ మధువాతా=భవంతునః ॥

శ్లో॥ ఇదంమధుమయాదత్తం తవతుష్ట్యర్థమేవచ ।
గృహాణశంభో! కృపయా మమశాంతిప్రదోభవ ॥

శ్రీఉమా=నమః । మధుస్నానం సమర్పయామి ।
ఓమ్ఆపోహిష్ఠా=యధాచనః। మధుస్నానానంతరం శుదోదకస్నానం సమర్పయామి ॥

ఓమ్ స్వాదుః పవస్వ=అదాభ్యః ॥

శ్లో॥ సితయాదేవదేవేశస్నపనం క్రియతేమయా ।
గృహాణరుద్ర! సర్వజ్ఞ! సుప్రసన్నోభవప్రభో! ॥

శ్రీఉమానమః=శర్కరోదకస్నానం సమర్పయామి
ఓమ్ ఆపోహిష్ఠా=యధాచనః శుద్ధోదకస్నానం
నమ=మి సర్వత్ర శుద్ధోదకస్నానమ్
పఞ్చామృతస్నానానన్తరంగన్ధోదకాద్యైస్స్నాపయిష్యే

(1) అపరస్సు యోగంధో గంధర్వేషు చ యద్యశః ।

దైవో యో మానుషో గన్ధస్సమాగన్ధస్సురభిర్జుషతామ్॥

శ్రీ ఉమా = నమః । గన్ధోదకస్నానం సమర్పయామి॥

(2) యోపాం పుష్పం వేద। పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి।

చన్ద్రమా వా అపాం పుష్పం । పుష్పవాన్ప్రజావాన్పశు

మాన్భవతి । య ఏవం వేద ।

పుష్పావతీః ప్రసూవతీః = ఇష్ణవః

శ్రీ ఉమా = నమః । పుష్పోదకస్నానం సమర్పయామి॥

(3) యాః ఫలినీర్యా = న్త్వగ్ంహసః ॥

శ్రీ ఉమా = నమః । ఫలోదకస్నానం సమర్పయామి॥

(4) ఆయనే తే పరాయణే = గృహా ఇమే ॥

శ్రీ ఉమా = నమః । అక్షతోదకస్నానం స = మి॥

(5) తత్సువర్ణగ్ం హిరణ్యమభవత్ ।

యత్సువర్ణగ్ం హిరణ్యందదాతి ॥

శ్రీఉమా = నమః । సువర్ణోదకస్నానం స = మి ॥

(6) మానోమహాన్త = రుద్రిరిషః ॥

శ్రీఉమా = నమః । బిల్వోదకస్నానం స = మి ॥

(7) మానస్తోకేతనయే = నమసావిధేమతే ॥

శ్రీఉమా = నమః । భస్మోదకస్నానం స = మి ॥

(8) కాండాత్కాండాత్ప్రరోహన్తీ పరుషః పరుషః పరి।

ఏవానోదూర్వేప్రతను సహస్రేణ శతేనచ

శ్రీఉమా = నమః । దూర్వోదకస్నానం స=మి ॥

(9) త్ర్యంబకం యజామహే=మామృతాత్ ॥

శ్రీఉమా = నమః । రుద్రాక్షోదకస్నానం స=మి॥

(10) స్వాద్వీం త్వాస్వాదునా । తీవ్రాంతీవ్రేణ । అమృతా

మమృతేన । మధుమతీం మధుమతా ॥

శ్రీఉమానమః । ఇక్షురసస్నానం సమర్పయామి ॥

(11) సహిరత్నానిదాశుషే । సువాతిసవితాభగః ॥ తం
భాగం చిత్రమీమహే ॥
శ్రీఉమా=నమః । నవరత్నోదకస్నానం స = మి ॥

(12) సద్యోజాతం ప్రపద్యామి=భవోద్భవాయనమః ॥
శ్రీఉమా=నమః । ద్రాక్షరసస్నానం స= మి ॥

(13) వామదేవాయనమో =మనోన్మనాయనమః ॥
శ్రీఉమా =నమః । ఖర్జూరఫలరసస్నానం స = మి॥

(14) అఘోరేభ్యోథఘోరేభ్యో=రుద్రరూపేభ్యః ।
శ్రీఉమా=నమః । కస్తూరీసలిలస్నానం స =మి ॥

(15) తత్పురుషాయ విద్మహే=ప్రచోదయాత్ ॥
శ్రీఉమా=నమః । జమ్బూఫలరసస్నానం

(16) ఈశానస్సర్వవిద్యానా=సదాశివోమ్ ॥
శ్రీఉమా=నమః । అమృతరసస్నానం స=మి ॥

(17) అదితిర్దేవాగంధర్వామనుష్యాః పితరోసురాస్తేషాగ్ం
సర్వభూతానాం మాతామేదినీ మహతామహీ

సావిత్రీ గాయత్రీ జగత్యుర్వీ పృథ్వీబహులా
విశ్వాభూతాకతమాకాయసా సత్యేత్యమృతేతి
వసిష్ఠః ॥
శ్రీఉమా=నమః । హరిద్రోదకస్నానం స=మి ॥

(18) అన్నపతేన్నస్యనోదేహ్యనమీవస్యశుష్మిణః ।
ప్రప్రదాతారంతారిషఊర్జంనోధేహిద్విపదేచతుష్పదే॥
శ్రీఉమా=నమః । అన్నేనాభిషేకయామి ॥

(అన్నాభిషేకః ప్రత్యేక ప్రక్రియాం)

## — రుద్ర శబ్దార్థం —

* సర్వలోకేశ్వరుడైన రుద్రునియందు భక్తివిశ్వాసములు లేనివాడు అభిషేకార్చనలు చేయకూడదు.

"నారుద్రో రుద్ర మర్చయేత్" అని బోధాయనవాక్యమ్ న, రుద్రః, రుద్రభిన్నః, రుద్రం నార్చయేత్ ॥

మరియు "రుతాశబ్దేన, అజ్ఞానం దూరీకరోతీతిరుద్రః" అన్యచ్చ "రుజం ద్రావయతి, ఖండయతీతిరుద్రః" అనగా అజ్ఞానమును దూరము చేయువాడు గనుక రుద్రుడని పిలువబడుచున్నాడు మరియు రోగమును అనగా భవరోగమును మరియు దేహసంబంధమైన రోగమునుగూడనూ ఖండించు

చున్నాడు కనుక రుద్రుడని పిలువబడుచున్నాడు. గాన అటు వంటి రుద్రుని రుద్రమంత్రములచేత తత్తద్ద్రవ్యములతో అభి షేకపూజాదుల నొనర్చిన మహాఫలము కలిగితీరును.

— అభిషేక ద్రవ్యఫలము —

శ్లో॥ పయసా సర్వసౌఖ్యాని దధ్నాఽరోగ్యం బలంయశః।
ఆజ్యేనైశ్వర్యవృద్ధిశ్చ దుఃఖనాశశ్చ శర్కరా ॥
తేజోవృద్ధిశ్చ మధునా ధనమిక్షురసేనవై।
సర్వసంపత్సమృద్ధిశ్చ నారికేళజలేనచ ॥
మహాపాపాని నశ్యంతి తక్షణాద్భస్మవారిణా।
గంధతోయేన సత్పుత్ర లాభశ్చాఽత్రనసంశయః॥
భూలాభః పుష్పతోయేణ భాగ్యం బిల్వజలేనవై ॥
దూర్వాజలేనలభతేనాఽన్యథా నష్టసంపదః ॥
అపమృత్యుహరంచైవ తిలతైలాభిషేచనం।
రుద్రాక్షసలిలేనైవ మహతీం శ్రియమాప్నుయాత్ ॥
స్వర్ణోదకాభిషేకేన ఘోరదారిద్ర్య నాశనం।
అన్నేన రాజ్యసంప్రాప్తి ర్మోక్షమాయుస్సు జీవనం ॥
ద్రాక్షారసేన సర్వత్ర విజయం లభతే ధ్రువం।
ఖర్జూరఫలసారేణ శత్రుహాని ర్భవిష్యతి ॥
వైరాగ్యం లభతే జంబూఫలసారేణవై జగుః।
కస్తూరీ సలిలేనైవ చక్రవర్తిత్వ మశ్నుతే ॥

నవరత్నామ్బునా ధాన్య గృహ గోవృద్ధి రుచ్యతే ।
రసాలఫలసారేణ దీర్ఘవ్యాధి వినాశనం ॥
హరిద్రవారిణా లింగస్నానంవై మంగళప్రదమ్ ।
రుద్రస్నానఫలాన్యే తాన్యుచ్యంతే మునిభిః పురా ॥

(రుదరికామ్యార్చనావిధౌ)

తా॥ ఆవుపాలతో శివు నభిషేకించి సర్వసౌఖ్యములు, ఆవు పెరుగుతో ఆరోగ్య బల యశస్సులు కలుగును. ఆవునేయితో ఐశ్వర్యవృద్ధి, మెత్తని పంచదారతో దుఃఖనాశనము, తేనెతో తేజోవృద్ధి, చెరుకురసముతో ధనవృద్ధి, కొబ్బరినీళ్ళతో సర్వ సంపద్వృద్ధి, భస్మజలముతో మహాపాపహరము, సుగంధోదక ముతో పుత్రలాభము, పుష్పోదకముతో భూలాభము, బిల్వజల ముతో భోగభాగ్యములు, దూర్వోదకముతో నష్టద్రవ్యప్రాప్తి, నువ్వులనూనెతో అపమృత్యుహరము, రుద్రాక్షోదకముతో మహ దైశ్వర్యము, సువర్ణజలముతో దరిద్రనాశనము, అన్నముతో రాజ్యప్రాప్తియు, ఆయుర్వృద్ధి, సుఖజీవనము, మోక్షప్రాప్తి, ద్రాక్షపండ్లరసముతో సకలకార్యజయము, ఖర్జూరఫలరసముతో శత్రువులకు హాని, నేరేడుపండ్ల రసముతో వైరాగ్యము, కస్తూరీ జలముతో చక్రవర్తిత్వము, నవరత్నజలముతో ధాన్య, గృహ, గోప్రాప్తి, మామిడిపండ్ల రసముతో దీర్ఘవ్యాధి నాశనము, పసుపునీళ్ళతో సౌభాగ్యము మంగళప్రదము

ఆయా ద్రవ్యములతో పరమశివున కభిషేకము చేసిన ఆయా ఫలములు కలుగునని పూర్వము మహర్షులచే చెప్ప బడినది.

*శ్లో॥ దశాపరాధాస్తోయేన క్షీరేణ శతనాశనం।
సహస్రం శమతేదధ్నా ఘృతేనత్రి సహస్రకం॥
మధునా పంచసాహస్రం శర్కరాష్ట సహస్రకం।
అయుతం చేక్షుసారేణ నియుతామ్రరసేనచ॥
నారికేళోదకంచైవ చాయుతత్రయ నాశనం॥
ద్రాక్షారసేనార్బుదంచ తైలేనత్వర్బుదద్వయం।
అనంతం గంధతోయేన అభిషేకం శివస్యచ॥

(ఇతి యోగజాగమే)

తా॥ శంకరునకు స్వచ్ఛమైన జలముచే అభిషేకము చేసిన 10 అపరాధములు చేసిన దోషము పోవును. ఆవుపాలతో 100, ఆవుపెరుగుతో 1,000, ఆవునేయితో 3,000 పట్టుతేనెతో 5,000 పంచదారపానకముతో 8,000 చెరకు రసముతో 10,000 మామిడిపండ్లరసముతో 20 000 కొబ్బరినీళ్ళతో 30,000 ద్రాక్ష పండ్లరసముతో 1 అర్బుదము నువ్వులనూనెతో 2 అర్బుదములు పన్నీరుతో లెక్కలేనన్ని అపరాధములు చేసిన దోషముపోవును గాన వారి శక్త్యానుసారముగా పైద్రవ్యములతో రుద్రునభిషేకించి దోషవిముక్తు లగుదురుగాక,

## — రుద్రాక్షోత్పత్తిః —

శివః :—

*శ్లో॥ దివ్యవర్ష సహస్రాణి చక్షురున్మీలితం మయా ।
భూమావక్షి పుటాభ్యాంతు పతితాజలబిందవః ॥
తత్రాశ్రుబిందవో జాతాః మహారుద్రాక్ష వృక్షకాః ।
స్థావరత్వమనుప్రాప్య భక్తానుగ్రహకారణాత్ ॥
భక్తానాం ధారణాత్పాపం దివారాత్రికృతం హరేత్ ॥
(పురాణవాక్యం)

తా॥ "వేయి దివ్యసంవత్సరములు నాచే నేత్రము తెరువబడినది. నా కనులనుండి భూమిపై నీటిబిందువులుపడినవి. ఆ నీటిబిందువులే మహారుద్రాక్ష వృక్షములై పుట్టి, నా భక్తులను అనుగ్రహించుటకొరకు స్థావరత్వమును (వృక్షరూపములను) పొందినవి అటువంటి రుద్రాక్షలు ధరించిన భక్తులు రాత్రింబవళ్ళు చేసిన పాపములు తక్షణమే హరించును" అని శివుడే చెప్పెను.

## — రుద్రాక్షమహిమా —

*శ్లో॥ రుద్రాక్ష మూలం తద్బ్రహ్మ తన్నాళం విష్ణురుచ్యతే ।
తన్ముఖం రుద్ర ఇత్యాహుః తద్బిందు స్సర్వదేవతాః ॥
(శివకల్పే)

తా॥ రుద్రాక్ష యొక్క మూలము బ్రహ్మ, రుద్రాక్ష యొక్క నాళము (రంధ్రము) విష్ణువు, రుద్రాక్ష

యొక్క ముఖము రుదుండు, రుద్రాక్ష బిందువు సర్వదేవతా స్వరూపము అని పెద్దలు చెప్పుదురు.

— రుద్రాక్ష జలాభిషేకఫలం —

*శ్లో॥ రుద్రమన్త్రైశ్చ రుద్రస్య రుద్రాక్ష సలిలైశ్చయః।
కరోతి భక్త్యాఽభిషేకం పునర్జన్మ నవిద్యతే॥
(మహారుద్ర పురశ్చరణవిధౌ)

తా॥ రుద్రమంత్రములచే రుద్రునకు రుద్రాక్షజలము చేత భక్తితో ఎవరు అభిషేకము చేయుదురో వారికి జన్మరాహిత్యము కలగును.

— భస్మాభిషేక ఫలం —

*శ్లో॥ భూలోకే యానిపుష్పాణి యానిపత్రఫలానిచ
తస్మాత్కోటిగుణం పుణ్యం విభూత్యాచాభిషేచనమ్
విభూతిపూజనాచ్చైవ సర్వైశ్వర్య ప్రదాయకం
తిలాక్షతై రక్షతైశ్చ పూజయే దంబికాపతిమ్
శ్వేతాక్షతామోక్ష కరాశ్శతృనాశం తిలాక్షతాః॥
(రుద్రకామ్యార్చనావిధౌ)

తా॥ భూలోకమున ఎన్ని పుష్పములు, పత్రములు, ఫలములు గలవో వాని నన్నిటిచే శివుని పూజించిన ఎంత ఫలితము కలుగునో యా ఫలమునకు కోటిరెట్లు శివుని విభూతిచే నభిషేకించిన కలుగును.

మరియు శివుని విభూతిచే నర్చించిన అష్టైశ్వర్యములు లభించును. కృష్ణతిలలచే తనూ (నల్లనువ్వులు) ముక్కు విరుగని శ్వేతతండులములచేతను శివుని పూజించిన అక్షతలు మోక్షమును, తిలలు శత్రునాశనమును సిద్ధింపజేయును

నవగ్రహదోషనివృత్త్యర్థకై చేయవలసిన నవధాన్యాభిషేకవిధులు వివరముగా "రుద్రాఽర్చనావిధి" యందు మాసార్చనా ప్రకరణమున చూడుడు.

— అథ మలాపకర్షణ స్నానమ్ —

*శ్లో॥ తతశ్శుద్ధాంబునాలింగమ బ్లింగైరభిషేచయేత్ ।
ఆపోహిష్ఠేతి తిసృభి ర్హిరణ్యాదిభిరత్రివై ।
పవమానానువాకేన త్ర్యంబకేత్యనయా ఋచా ।
తతః కుర్యాన్మన్త్రపూతకలశస్థేన వారిణా ।
మలాపకర్షణస్నానం కారయిత్వా యథావిధి ।
అన్యథాయదికుర్వీత తత్స్నానం నిష్ఫలంభవేత్ ॥

(మార్కండేయః)

తా॥ పరిశుద్ధిజలముచే ఆపోహిష్ఠామేత్యాద్యబ్లిఙ్గ మన్త్రములు మూఁడింటిచేతను, హిరణ్యవర్ణాశ్శుచయః పావకాః, పవమానస్సువర్జనః, ఇత్యాది మన్త్రములచే రుద్రునభిషేకించి పిమ్మట మన్త్రపూతమైన కలశ (తీర్థపుబిందె) జలముచే అభిషేకము చేయవలయును. మరియొక రీతిగచేసినచో నా యభిషేకము నిష్ఫలమగును.

పూర్వోక్త=ప్రీత్యర్థం ॥ ఉమామహేశ్వరం అభ్లింగాది మంత్రైర్మలాపకర్షణస్నానం కారయిష్యే ॥

1. ఆపోహిష్ఠా=యథాచనః ।

2. ఆపో వా ఇదగ్ం=ఆపఓమ్ ।

3. ఇమం మేగంగే =సుషోమయా ॥

4. హిరణ్యవర్ణా శ్శుచయః = బలమోజోనిధత్త ॥

5. పవమానస్సువర్జనః = సమ్భృత్తోరసః ।

బ్రాహ్మణేష్వమృతగ్ం హితమ్ । యేనదేవాః

పవిత్రేణ=మోర్జయన్త్యాపునాతు ॥

6. అపః ప్రణయతి।శ్రద్ధావా ఆపః । శ్రద్ధామేవా

రభ్యప్రణీయప్రచరతి । అపః ప్రణయతి । యజ్ఞోవాఆపః ।

యజ్ఞమేవారభ్యప్రణీయప్రచరతి । అపః ప్రణయతి। వజ్రోవా

అపః ॥ వజ్రమేవభ్రాతృవ్యేభ్యః ప్రహృత్య ప్రణీయప్రచరతి ।
అపః ప్రణయతి । అపోవైరక్షోఘ్నీః । రక్షసామపహత్యై ।
అపః ప్రణయతి । ఆపోవైదేవానాం ప్రియంధామ । దేవానా
మేవ ప్రియంధామ ప్రణీయప్రచరతి । అపః ప్రణయతి । ఆపో
వైసర్వాదేవతాః । దేవతా ఏవారభ్య ప్రణీయ ప్రచరతి ॥

శంచమేమయశ్చమే . సుదినంచమే ॥

పూర్వోక్త =ప్రీత్యర్థం । శ్రీఉమా=ప్రసాదసిద్ధ్యర్థం ।
అన్యోన్యసహాయేన అముకసంఖ్యాక రుద్రాభిషేకం కరిష్యా
మః తేషాం ప్రథమతః ప్రథమవారాభిషేకం కరిష్యామః ॥

అస్యశ్రీ రుద్రస్య ప్రశ్నస్యాఽనుష్టుప్ఛందః । అఘోర
ఋషిః సంకర్షణస్వరూపోయోఽసావాదిత్యః పరమపురుషస్స
ఏషరుద్రోదేవతా । అగ్నిక్రతుచరమాయామిష్టకాయాగ్ం శత
రుద్రీయే (ఏకాదశరుద్రీయే) జపాఽభిషేకేవినియోగః ॥

సకలస్య శ్రీరుద్రాధ్యాయస్య । శ్రీరుద్రోదేవతా। ఏకా
గాయత్రీఛందః । తిస్రోఽనుష్టుభస్తిస్రః పంక్తయస్సప్తాను
భోద్వేజగత్యౌ । పరమేశ్వరఋషిః । శ్రీఉమా =ప్రసాదసిద్ధ్యర్థే
=జపాఽభిషేకే వినియోగః ॥

చమకానువాకానామగ్నిఃకాండఋషిః । ఆద్యా గాయత్ర్యాగ్ని వైష్ణవీశిష్టంయజుః । వాజాదయోన్నాదివిశేషా దేవతాః। విరాట్ ఛందః । శ్రీఉమా = ప్రీత్యర్థే శ్రీఉమా = ప్రసాద సిద్ధ్యర్థే జపాఽభిషేకే వినియోగః ॥

నమశ్శంభవేచ । అగ్నిహోత్రాత్మనే । అంగుష్ఠాభ్యాం నమః=హృదయాయనమః ॥

మయోభవేచ । దర్శపూర్ణమాసాత్మనే। తర్జనీభ్యాంనమః =శిరసేస్వాహా ॥

నమశ్శంకరాయచ । చాతుర్మాస్యాత్మనే । మధ్యమాభ్యాంనమః=శిఖాయైవషట్ ॥

మయస్కరాయచ । నిరూఢపశుబంధాత్మనే । అనామికాభ్యాంనమః = కవచాయహుం ॥

నమశ్శివాయచ । జ్యోతిష్టోమాత్మనే । కనిష్ఠికాభ్యాం నమః = నేత్రత్రయాయవౌషట్ ॥

శివతరాయచ । సర్వక్రత్వాత్మనే । కరతలకరపృష్ఠాభ్యాంనమః=అస్త్రాయఫట్ ॥

భూర్భువస్సువరోమితదిగ్బంధః ॥

ధ్యానమ్ :—

శ్లో॥ ఆపాతాళనభస్థలాన్త భువన బ్రహ్మాండమావిస్ఫుర ।
జ్జ్యోతిస్స్ఫాటికలిఙ్గమౌళి విలసత్పూర్ణేన్దువాంతామృతైః ॥

అస్తోకాప్లుతలోకమీశమనిశం రుద్రానువాకాన్ జపన్ ।
ధ్యాయేదీప్సితసిద్ధయే ధృత(ద్రుత)పదంవిప్రోఽభిషించేచ్ఛివమ్॥

ఓం భూర్భువస్సువః ॥

ఉత్తరతశ్చండీశ్వరాయనమః । నిర్మాల్యంవిసృజ్య ।
త్ర్యంబకం=మామృతాత్ । ఓమనమశ్శివాయ ॥
ఇత్యావాహయామి॥

త్ర్యంబకం=మామృతాత్ । ఓమ్ నమశ్శివాయ ।

సద్యోజాతం ప్రపద్యామి । ఇత్యాసనం ॥

త్ర్యంబకం=మామృతాత్ । ఓమ్నమశ్శివాయ ।

సద్యోజాతాయవైనమోనమః । ఇతి పాద్యం ॥

త్ర్యంబకం=మామృతాత్ । ఓమ్ నమశ్శివాయ ।

భవేభవేనాతిభవేభవస్వమాం । ఇత్యర్ఘ్యం ॥

త్ర్యంబకం=మామృతాత్ । ఓమ్ నమశ్శివాయ ।

భవోద్భవాయనమః । ఇత్యాచమనీయం ॥

త్ర్యంబకం=మామృతాత్ । ఓమ్ నమశ్శివాయ ।

వామదేవాయనమః । ఇతి స్నానం ॥

## — నారికేళ లక్షణం —

( యోగజాగమే ఉత్తరభాగే )

శ్లో॥ అథవక్ష్యేసమాసేన నారికేళస్య లక్షణమ్ ।
నాతిస్థూలం నాతికృశం సుపక్వం సలిలాన్వితం ।
నిర్వ్రణం వర్తులంశుద్ధం నిస్త్వక్ దుర్గంధవర్జితం ।
శిఖామూలేగృహీత్వా ప్రక్షాళయేదస్త్రవారిణా ।

దేవస్యాగ్నేయ కోణస్థ పాషాణేతాడయేద్గురః ।
ప్రాదేశమాత్రముద్ధృత్య తాడయేన్నారికేళకం ।
ఏకేనైవ ప్రహారేణ ద్విధాగళనముత్తమం ।
గుణాంశ ఊర్ధ్వభాగస్స్యా దధోభాగః కరాంశకః ।
ఏవంచేద్ధన ధాన్యాది సమృద్ధిరితికీర్తితా ।
తాడితే నారికేళేతు బహూనిశకలానిచేత్ ।
స్త్రీణాంచ పురుషాణాంచ కలహస్స్యాత్పరస్పరం ।
విస్ఫోటునం శిఖాస్థానే కర్తుర్హానిర్భవిష్యతి ।
సమభాగే యదితథా స్త్రీణాం హానిర్భవేద్ధ్రువం ।
బహుధా స్ఫుటితేతస్మిన్ ధనధాన్యాది నాశనం ।
వక్రేసతి మహాక్షోభః దీర్ఘ పరిహారణాద్భయం ।
తద్దోషశమనార్థంచ మూలమంత్రం శతంజపేత్ ।
పునశ్శుద్ధఫలం గ్రాహ్యం యథావిధినివేదయేత్ ।
నివేదనేజలం త్యాజ్యం అభిషేకేఫలం తథా ।
ఏకస్మిన్ నద్వయం గ్రాహ్యం దేశికేన శుభార్థినా ॥

తా॥ ఎక్కువ లావుగాను, మిక్కిలి చిన్నదిగాను ఉండ కూడదు. బాగా పండినదియు, లోపల జలమున్నదియు, వంకర లేనిదియు, గుండ్రముగా నున్నదియు, శుద్ధమైనదియు, తొక్క లేనిదియు, దుర్వాసన లేనిదియు, సుళ్ళులేనిదియు, జుట్టుతో కూడినదియు, బొడిపెలు లేనిదియు, కొబ్బరికాయను సంపాదించి స్వామిని తలచికొట్టవలెను కొబ్బరికాయయొక్క జుట్టు పుచ్చుకొని రుద్రగాయత్రిచే కడిగి దేవున కాగ్నేయ

భాగమందున్న రాతిపై పగులగొట్టవలెను. జానెడు యెత్తుకి కొంచముపైగా యెత్తి పగులగొట్టవలెను. ఒక దెబ్బతో పగులుట ఉత్తమము. జుట్టు ఉన్నట్టిచెక్క చిన్నదిగాను, అడుగు చెక్క పెద్దదిగాను పగిలినయెడల ధనధాన్య ఐశ్వర్య సంపత్తి కలుగును. అనేక ముక్కలుగా పగిలినయెడల స్త్రీపురుషులకు కలహము సంభవించును. జుట్టులోనికి నిలువుగా పగిలిన కర్తకు హాని కలుగును. రెండు చెక్కలు సమానముగా పగిలిన స్త్రీలకు వ్యధకలుగును. వంకరగా పగిలిన దరిద్రము కలుగును పెద్దచప్పుడైన కర్తకు భీతి సంభవించును. జలము లేకపోయినచో కృషి నష్టము, దుర్వాసన ఉన్న కర్తకు బాధకలుగును. గాన ఇటువంటి దోషములు సంభవించకుండగా మంచి కొబ్బరికాయ యెంచి తెచ్చి మరీ పగులగొట్టవలెను. ఒకప్పుడు పై చెప్పిన దోషములలో ఏ దోషము సంభవించినా "శివపంచాక్షరిని" 108 సార్లు జపంచేసి తిరుగా మంచి కొబ్బరి ఫలము సంపాదించి శాస్త్రోక్తముగా కొట్టవలెను. కొబ్బరి ఫలము నివేదన నిమిత్తమైనచో జలము అభిషేకమునకు పనికిరాదు. అభిషేకార్థమైనచో నాచెక్కలు నివేదనకుపనికిరావు. ఒకే నారికేళఫలము అభిషేకమునకుగాని, లేక నివేదనకుగాని ఒక దానికే వినియోగించవలెను. ఇది శాస్త్ర విధియై యున్నది.

ఓమ్ నమో భగవతే రుద్రాయ ।

నమస్తే రుద్రమన్యవ = మృత్యవేస్వాహా మృత్యవేస్వాహా ।
ఓమ్‌నమో భగవతే రుద్రాయ విష్ణవే మృత్యుర్మేపాహి ।
అపమృత్యుర్నశ్యత్ । ఆయుర్వర్ధతామ్ ।

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

హరిః ఓమ్ । అగ్నావిష్ణూ సజోషసే=శరీరాణిచమే ।

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఓమ్ నమో భగవతే రుద్రాయ । ఉమా = నమః । అమృతాభి
షేకా అస్తు ॥

రుద్రనమకచమకములు ఈ గ్రంథమున పాశుపత
ప్రకరణమందు చూడుడు.

త్ర్యంబకం=ఓమ నమశ్శివాయ । జ్యేష్ఠాయనమః । వస్త్రం
సమర్పయామి ॥

తూష్ణీమాచమనం సమర్పయామి

త్ర్యంబకం = మామృతాత్ । ఓమ్ నమశ్శివాయ । శ్రేష్ఠా
యనమః । ఉపవీతం సమర్పయామి ।

త్ర్యంబకం = మామృతాత్ । ఓమ నమశ్శివాయ । రుద్రాయ
నమః । ఆభరణం సమర్పయామి ।

త్ర్యంబకం = మామృతాత్ । ఓమ్‌నమశ్శివాయ । కాలాయ
నమః । గంధం సమర్పయామి ।

త్ర్యంబకం=మామృతాత్ । ఓమ్‌నమశ్శివాయ । కలవికరణా
యనమః । అక్షతాన్ సమర్పయామి

త్ర్యంబకం=మామృతాత్ । ఓమ్‌నమశ్శివాయ । బలవికరణా
యనమః । పుష్పం సమర్పయామి

త్ర్యంబకం=మామృతాత్। ఓమ్‌నమశ్శివాయ। బలాయనమః।
ధూపమాఘ్రాపయామి

త్ర్యంబకం=మామృతాత్। ఓమ్‌నమశ్శివాయ। బలప్రమథనా
యనమః । దీపందర్శయామి

త్ర్యంబకం=మామృతాత్ । ఓమ్‌నమశ్శివాయ । సర్వభూత
దమనాయనమః । నైవేద్యం ।
తూష్ణీమాచమనీయం సమర్పయామి

త్ర్యంబకం=మామృతాత్ । ఓమ్‌నమశ్శివాయ । మనోన్మనా
యనమః । తాంబూలం సమర్పయామి

త్ర్యంబకం=మామృతాత్ । ఓమ్‌నమశ్శివాయ । అఘోరేభ్య
ఇతి ఉత్తరనీరాజనం సమర్పయామి

త్ర్యంబకం=మామృతాత్ । ఓమ్‌నమశ్శివాయ । తత్పురుషా
యేతి । సువర్ణ మంత్రపుష్పం స=మి

త్ర్యంబకం=మామృతాత్ । ఓమ్‌నమశ్శివాయ । ఈశాన
స్సర్వవిద్యానా మిత్యాత్మ ప్రదక్షిణ
నమస్కారాన్ సమర్పయామి ॥

పీతాంబరద్వయ మర్పించిన కోటి గుణితమగు ఫలము లభించును. కాని "పట్టువస్త్రములజత సమర్పించుచున్నాను. స్వీకరింపుము" మనిశ్లోకమునుచ్చరించుచు ప్రత్తిని వత్తిగానలిపి పసుపునీళ్ళలో ముంచి యిచ్చుట నేమనవచ్చునో యనూహ్యము. శివునకు మనము సమర్పించు వస్తువులే మనకు నభీష్టార్థముల నిచ్చునని శాస్త్రప్రమాణము.

మరియు 'అక్షయ్యముపతిష్ఠతు' అనిరిగాని 'నాదత్తముపతిష్ఠతు' అని యనలేదుగదా. పుట్టినవారికి పుట్టినదే సాక్షి.

గాయత్రీ మన్త్రకోటి వ్రాయు గృహస్థు పుస్తకము ప్రతి పేజీలోను నొకసారి గాయత్రీ మన్త్రాక్షరములను [24] వ్రాసి యా మన్త్రము క్రింద రూళ్ళలో "డిటో, డిటో" యని వ్రాసెనట ఫలముగూడ డిటోడిటో యని వ్రాసినట్లే యుండును.

కావున భక్తిశ్రద్ధలతో యథాశక్తి యా ద్రవ్యముల సంపాదించి పరమశివుని నర్చించినవారు సుఖశాన్తుల నంది చివరకు కైవల్యసౌధమున విహరింతురు.

[2] ఉపనిషత్ప్రతిపాదకములైన భావనలను నీక్రింద క్రోడీకరించితిని. ఆత్మకు నారాధ్యదేవతకు భేదము లేదని తెలిసికొని యాత్మస్వరూపమగు నారాధ్యదేవతకు నుక్తరీతిని భావనజేసిన మహాఫలితమును బొందవచ్చును. ఇతరపూజాదు లెన్నిచేసిననుః దుదకు గంతవ్యస్థాన మిదియే.

పూర్వోక్తమంతయు భావనాసౌధమునకు సోపాననివహమే. ప్రతియొక్కరు నీసౌధము నధిరోహించుటకు సాధన చేయ వలయును.

వివరించిన అంతరంగపూజను బ్రహ్మాకార వృత్తి యుక్తుఁడై యారాధ్యదేవతాలగ్న భావనగలవాడు బ్రహ్మై క్యతా సిద్ధిని బొందును.

మూ॥ చింతితకార్యాణ్యయత్నేన సిధ్యన్తి స ఏవ శివయో గీతి కథ్యత ఇత్యుపనిషత్ ॥

భా॥ "సిద్ధుడైన సాధకునికి చింతితకార్యములు అప్రయత్న ముగా ఫలించును. అతడే శివయోగి యని చెప్పఁ బడును", అని యుపనిషత్తు ఉద్ఘోషించుచున్నది.

మరియు నిత్యము అమూల్యములగు పట్టువస్త్రములను ధరించుచూ పంచభక్ష్య పరమాన్నములతో భుజించు భోగి సామాన్య గృహస్థయిన తన బంధువు ఇంటికి వచ్చినప్పుడు ఆగృహస్థు యాతనికి యాతిథ్య మిచ్చుచు "ఈ భోజనము మీకు తగినది కాదు_అల్పము-సామాన్యము అయిననూ నాయందనుగ్రహించి తృప్తిగా భుజించి నన్ను తృప్తిపరచు" డని ప్రార్థించును: భోజనానంతరమున మర్యా దకై యథాశక్తి వస్త్రములను సమర్పించుచు "ఇవి మీ కనర్హములు, స్వల్పములు ఐననూ నా తృప్తికొరకు స్వీక రింపు"డని పలుకుచు అతనికి మర్యాద చేయును. అపుడా

బంధువు బ్రహ్మానందముతో నా యాతిథేయసత్కారములను స్వీకరించును.

అట్లే జగదాధారుడును, అష్టైశ్వర్య ప్రదాతయును, సర్వసురపూజితుడునూ అగు పరమశివునకు మనము సమర్పించు నుపచార ద్రవ్యములు అత్యల్పములనియు మన తృప్తికొఱకై స్వీకరింపుడని భక్తిశ్రద్ధలతో ప్రార్థించుట ఎంతయో యుక్తము.

## — అథ రుద్రార్చనా ప్రారంభః —

ఆచమ్య॥ పూర్వోక్త = ప్రీత్యర్థమ్ పూర్వసంకల్పిత మనోభీష్ట సిద్ధ్యర్థం మయాకృత మహాన్యాసపూర్వక .... నామక రుద్రాభిషేక సంపూర్ణతా సిద్ధ్యర్థం ఆగమప్రాధాన్యేన పురాణమంత్రైనపాక సద్యోజాతాది పంచబ్రహ్మ మంత్రాద్యైశ్చ యథాశక్త్యా సంభవద్భిర్ద్రవ్యై రుపచారైశ్చ ఉమామహేశ్వర పూజాం కరిష్యే ॥

## — ధ్యానం —

శ్లో॥ శాన్తం పద్మాసనస్థం శశిధరమకుటం పఞ్చవక్త్రం
త్రినేత్రం। శూలం వజ్రంచ ఖడ్గం పరశుమభయదం
దక్షభాగేవ హస్తం। నాగం పాశంచ ఘంటాం ప్రళయ
హుతవహం సాంకుశం వామభాగే। నానాలంకార
యుక్తం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి॥

శ్లో॥ తతోధ్యాయే న్మహాదేవముమయాసహితం శివం
సర్వదేవమయం శాన్తం సచ్చిదానంద మవ్యయం ॥

— ధ్యాన ముద్రా —

*శ్లో॥ అన్యోన్యగ్రధితాంగుష్ఠా ప్రసారిత పరాంగుళిః
మహాముద్రేయ ముదితా పరజాగరణేప్రియే
ప్రయోజయేదిమాం ముద్రాం దేవతాధ్యాన కర్మణి॥

తా॥ ఎడమ బొటనవ్రేలిపై కుడి బొటనవ్రేలుంచి పరస్పరము పట్టుకొని ఇతరములైన వ్రేళ్ళను చాచియుంచిన మహాముద్ర యగును ఈ ధ్యానముద్రతో భగవంతుని ధ్యానించిన సత్ఫలము సిద్ధించును.

— ఉపచారభావన —

* మూ॥ కర్తవ్య మకర్తవ్య మౌదాసీన్యమితి వివేక భావనా యుక్త ఉపచారః॥

భా॥ దేవతకు బాహిరపూజావిధియందు రాజోపచారాదులు గలవు. అంతర పూజావిధానమున అనిత్యములైనవానిని త్యజించుటయు బ్రహ్మసత్యమే సత్యమగుటచే నివృత్తి మార్గ మవలంభించుటయు, వివేకభావమును కలిగించుకొనుటయు నిదే యాత్మరూపమైన దేవతోపచారము.

— అథ ఆవాహనమ్ —

శ్లో॥ "పూర్ణస్యావాహనంవ్యర్థ మితి మత్వాపి శంకర।
ఆవాహయామి భక్త్యాత్వాం మమశాన్తి ప్రదోభవ॥

తా॥ "సర్వవ్యాపకా! చరాచర ప్రపంచమంతయు వ్యాపించి పరిపూర్ణుడవైన నీ కావాహనము వ్యర్థమె" అని తలచియు భక్తితో నిన్నావ్హానించుచుంటిని నాకు శాన్తిని ప్రసాదించుము.

న॥ నమస్తే రుద్రమన్యవ = ముతతేనమః॥ ఓం నమశ్శివాయ
సద్యోజాతం ప్రపద్యామి=భవోద్భవాయ నమః॥

మం॥ త్ర్యంబకం యజామహే = మామృతాత్।
ఉమా = నమః। ఆవాహయామి। ఆవాహనం సమ=మి

— ఆవాహనముద్రా —

*శ్లో॥ హస్తాభ్యామంజలిం బద్ధ్వాఽనామికా మూలపర్వణి
అంగుష్ఠే నిక్షిపేత్సేయం ముద్రాహ్యావాహినీమతా॥

తా॥ అంజలి ఘటించి ఉంగరపువ్రేళ్ళ మొదటి కణుపులయందు బొటనవ్రేళ్ళ నుంచిన ఆవాహనముద్ర యగును.

— భావన —

* మూ॥ బాహ్యాన్తః కరణానాం రూపగ్రహణ యోగ్యతాఽ
స్త్వితాహ్యావాహనమ్॥

భా॥ త్వగాది బహిరింద్రియములందును, మనోబుద్ధ్యాద్యన్తరింద్రియములయందును ఆత్మదేవత విరాజిల్లుచున్నదని తెలిసికొని వాని స్వరూపావగాహన చేసికొనుటయే యావాహనము.

— అథ సింహాసనమ్ —

శ్లో॥ "సర్వాధారస్యాసనంచ కథ" మిత్యుచ్యతేఽపివా ।
పుష్పాసనం ప్రదాస్యామి మమ సంతృప్తయే సదా ॥

తా॥ "జగదాధార ! సర్వాధారుడవైన నీకు ఆసనమెట్లు?" అని చెప్పబడినను నా తృప్తికొఱకు భక్తితో నీకు పుష్పాసనమును సమర్పించుచున్నాను.

న॥ యాత ఇషుశ్శివతమా_మృడయ । ఓమ్ నమశ్శివాయ వామదేవాయనమో = మనోన్మనాయనమః ।

మం॥ అతే పితుర్మరుతాం సుమ్నయేతుమాన స్సూర్యస్య సందృశోయుయోథాః । అభినో వీరో అర్వతిక్షమేత ప్రజాయే మహిరుద్ర ప్రజాభిః ॥

ఉమా=నమః । పుష్పాసనం స[illegible]మి ॥

## — భావన —

*మూ॥ తస్య బాహ్యాన్తఃకరణానా మేకరూప విషయగ్రహణ మాసనమ్ ॥

భా॥ జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు అంతఃకరణ చతుష్టయముతో పదునాలుగు. ఇవి వేరువేరు ధర్మములు గలవి ఆధర్మములను నిరోధించి యవి యన్నియు బ్రహ్మపదార్థమే యని భావించుట ఆసనము.

## — అథ పాద్యమ్ —

శ్లో॥ స్వచ్ఛస్యపాద్యం సర్వేశ ! కిమర్థమితిచేత్సదా ।
తృప్త్యర్థం నిర్మలం పాద్యం దాస్యామి శశిశేఖర ॥

తా॥ "నిర్మలస్వభావా ! నిత్యస్వచ్ఛ స్వరూపునకు పాద్యమెందులకు?" అని యున్నను నా హృదయమాలిన్యము పోవుటకు నిర్మలపాద్యము నర్పించుచున్నాను.

న॥ యాతేరుద్ర శివాతనూర ఘోరా=కశీహి॥ ఓమ్ నమశ్శివాయ । అఘోరేభ్యో=రూపేభ్యః ॥

మం॥ త్వాదత్తేభీరుద్రశం తమెభిశ్శతం హిమా అశీయ భేషజేభిః । వ్య ? స్మద్వేషో వితరం వ్యంహోవ్యమీ

॥

వాశ్చాతయస్త్వా విషూచీః ॥

శ్రీ ఉమా = నమః । పాదయోః పాద్యం సమర్ప యామి ॥

— భావన —

మూ॥ రక్తశుక్లవదై కీకరణం పాద్యమ్ ॥

తా॥ నాదబిందువులకు అహమనే వర్ణద్వయమే శరీరమైనది. ఆరాధ్యదేవతావామపాదము రక్తవర్ణ విమర్శాంశము. దక్షిణపాదము శుక్లవర్ణప్రకాశాంశము గావున ఈ యుభయ పాద సమ్మేళన కాంతిపుంజమును ధ్యానించుచూ ఉభయపాదములకు భేదములేదని నిశ్చయించుకోవడమె పాద్యము.

— అథ అర్ఘ్యమ్ —

శ్లో॥ "నిత్యపూతస్య చార్ఘ్యేణకి" మిత్యుక్తమపి ప్రభో ।
అర్ఘ్యం దాస్యామితే శంభో జన్మరాహిత్య సిద్ధయే ॥

తా॥ త్రినయనా ! నిత్యపవిత్రునకు అర్ఘ్యమనవసరము అని చెప్పబడియున్నను నాకు జననమరణాదులు లేకుండుటకై అర్ఘ్యమును నీకు సమర్పించుకొనుచున్నాను.

న॥ యామిషుం గిరిశన్తహస్తే = పురుషం జగత్॥ ఓమ్ నమశ్శివాయ। తత్పురుషాయ విద్మహే = ప్రచోదయాత్ ॥

మం॥ శ్రేష్ఠో జాతస్య రుద్రశ్రియాసి తవస్తమస్తవసాం వజ్రబాహో । పర్షిణః పారమంహసః స్వస్తివిశ్వా అభీతీర పసాయుయోధి ॥

శ్రీ ఉమా=నమః । హస్తయోః । అర్ఘ్యం సమర్పయామి ॥

— భావన —

*మూ॥ ఉజ్జ్వలదామోదాను సన్ధాన మర్ఘ్యమ్ ॥

భా॥ ఆత్మయే యారాధ్యదేవతయని గ్రహించి బ్రహ్మానందాను సంధానము చేయుటయే యర్ఘ్యము.

*శ్లో॥ అఖిలాఘప్రశమనాద్ధన పుత్రవివర్ధనాత్ ।
అనర్ఘఫలదానాచ్చ అర్ఘ్యమిత్యభిధీయతే॥

తా॥ సమస్తపాపములచు పోగొట్టుటవలనను, ధనసుతాదులను వృద్ధిపొందించుటవలనను, అమూల్య ఫలముల నిచ్చుటవలనను అర్ఘ్యమని చెప్పఁబడుచున్నది.

— అథ ఆచమనీయమ్ —

శ్లో॥ "నిత్యశుద్ధస్యాచమనం కిమర్థ" మితి చోచ్యతే।
తథాప్యాచమనీయార్థం జలందాస్యామితేఽనఘ ॥

తా॥ సదాశివా ! నిత్యము పవిత్రతతో నొప్పు నీకు ఆచమన మెందులకు ? అనెడి యదార్థమున్నను నన్ను పూతునిఁ జేయుటకై నీకు ఆచమనము నర్పించుచున్నాను.

న॥ శివేనవచసాత్వా=సుమనా అసత్ ॥ ఓమ్ నమశ్శివాయ
ఈశానస్సర్వవిద్యానా=సదాశివోమ్ ॥

మం॥ మాత్వారుద్ర చుక్రుధామా నమో భిర్మాదుష్టుతే
వృషభ మాసహూతీ। ఉన్నో వీరాం అర్పయభేష
జేభిర్భిషక్త మంత్వాభిషజాం శృణోమి ॥
శ్రీ ఉమా=నమః। ముఖే ఆచమనం సమర్పయామి ॥

— భావన —

*మూ॥ స్వచ్ఛం స్వతస్సిద్ధమిత్యాచమనీయమ్ ॥

భా॥ ఆత్మరూపమైన ఆరాధ్యదేవత స్వచ్ఛమైనదనియు నా స్వచ్ఛత స్వయంసిద్ధమనియు, గ్రహించుటయే యాచమనీయము.

— అథ పఞ్చామృత స్నానమ్ —

శ్లో॥ భస్మోద్ధూళిత సర్వాంగ పంచవక్త్ర సదాశివ।
పంచామృతైస్స్నపయిష్యే భక్త్యాత్వాం పరమేశ్వర।

తా॥ భస్మధరా! పంచముఖేశ్వరా! నిన్ను భక్తితో పంచామృతములచే స్నానము చేయించెదను.

న॥ అఘ్యావోచ దధివక్త్రా=యాతుధాన్యః। ఓమ్ నమశ్శివాయ సద్యోజాతం ప్రపద్యామి=నమః॥

1. అప్యాయస్వ = సంగథే॥ శ్లో॥ గోక్షీరధామన్ = శశిశేఖర॥ ఇతి క్షీరస్నానం సమ = యామి॥ ఆపోహిష్ఠా = జనః॥

2. దధిక్రావుణ్ణో = తారిషత్ ॥ శ్లో॥ దధ్నాచైవ = భవ అవ్యయ॥ ఇతి దధిస్నానం సమ = యామి ॥ ఆపోహిష్ఠా = జనః ॥

3. శుక్రమసి = రశ్మిభిః॥ శ్లో॥ సర్పిషా = సురసత్తమ॥ ఇతి ఆజ్యస్నానం సమ=॥ ఆపోహిష్ఠా = జనః

4. మధువాతా = భవంతునః॥ శ్లో॥ ఇదం మధు = ప్రదో భవ॥ ఇతి మధుస్నానం సమ=మి॥ ఆపోహిష్ఠా=జనః ॥

5. స్వాదుః పవస్వ=అయభ్యః॥ శ్లో॥ శితయా = భవప్రభో॥ ఆపోహిష్ఠా = జనః ॥

ఇమా = నమః । పఞ్చామృతస్నానం సమర్పయామి॥

— అథ శుద్ధోదక స్నానమ్ —

శ్లో॥ నిర్మలస్య కుతస్నానమితి విజ్ఞాయశంకర ।
స్నానార్థం సలిలం దత్తం గంగాధర గృహాణభో ॥

తా॥ "గంగాధరా! సదా నిర్మలుడైన త్రిశూలకి స్నానమవసరముగాదు" అని తెలిసియు స్నానమునకై జలమివ్వబడుచున్నది. దానిని స్వీకరించుము.

న॥ అసౌయస్తామ్రో౽దిక్షు । ఓమ్ నమశ్శివాయ। వామదేవాయ నమో౽మనోన్మనాయనమః ॥

మం॥ హవీమభిర్హవతే యోహవిర్భిరిరవస్తోమేభీ రుద్రం
దిషియ - ఋదూదరస్సుహవోమానో అస్యై
బభ్రుస్సుశిప్రోరీ రధన్మనాయై ॥
ఉమా౽నమః। శుద్ధోదకస్నానం సమ౽యామి॥

— భావన —

మూ॥ చిచ్చంద్రమయీ సర్వాంగ్రసవణగ్ం స్నానమ్ ॥

భా॥ కుండలినీశక్తి మూలాధారమునుండి అన్ని చక్రములను స్పృశించుచు స్వాధిష్ఠాన గతాగ్నిని సహస్రారమునకు వేధించినపుడు అమృతధార ప్రవహించును. అప్పుడు 72 వేల నాడులకు తృప్తి గలుగును. కావున ఆ యమృత వర్షమువలన తన శరీరమంతయు తడిసినదని భావించుటయే స్నానము.

"అమృతస్య ధారాబహుధా దోహమాన" మనెడి శ్రుతియే ప్రమాణము.

— అథ అంగాంబు విమృజనమ్ —

శ్లో॥ విమృజామిత్వ దఙ్గామ్బ్వవస్త్రేణ మృదులేనవై
కైలాసవాస సర్వేశ! మమ సౌఖ్యం వివర్ధయ॥

తా॥ "కైలాసవాసా! నీశరీరరోదకమును మృదువైన వస్త్రముచే తుడుచుచున్నాను. నాకు సుఖమును వృద్ధి చేయును."

మం॥ మిత్రః సుపర్ణశ్చంద్ర ఇంద్రో ధరుదస్త్వష్టావిష్ణుస్స
వితాగోపతిస్త్వం। త్వం విష్ణుర్భూతాని త్రాతాసు
దైత్యాస్త్వయావృతం జగదుల్బగర్భః॥

— ప్లోతవస్త్రలక్షణమ్ —

*శ్లో॥ శుక్లం శ్లక్ష్ణంచ మృదులం ప్లోతవస్త్రమిహోచ్యతే॥

తా॥ తెల్లనిదియు రంధ్రములులేనిదియు మృదువైన వస్త్రము ప్లోతవస్త్రమని చెప్పఁబడుచున్నది. దీనితో శివలిఙ్గ మును తుడువవలయును.

— అథ వస్త్రయుగ్మమ్ —

శ్లో॥ విశ్వోదరస్య వస్త్రంతు కథ మిత్యుక్త మప్యహో।
వస్త్రం దత్తం మయాశంభో గజచర్మధరాఽవ్యయ॥

తా॥ "దిగంబరా ! విశ్వోదరుడైన భూతేశునకు వస్త్ర మెట్లివ్వగలను?" అని తెలిసియున్ననూ గజచర్మధారివి అవ్యయుడవైన నీకు వస్త్రము సమర్పించుచున్నాను.

న॥ త్రిశతాన్నహస్రశో = విలోహితః। ఓమ్ నమశ్శివాయ
అఘోరేభ్యో = రూపేభ్యః॥ అభివస్త్రా = దేవసోమ॥

మం॥ ఉన్మా మమన్దవృషభో మరుత్వాన్త్వక్షీయసా
వయసానాథమానం । ఘృణీవచ్ఛాయా మరపా
అశీయావివాసేయం రుద్రస్య సుమ్నమ్॥

శ్రీ ఉమా=నమః। వస్త్రయుగ్మం సమర్పయామి.

— వస్త్రముద్రా —

*శ్లో॥ కనిష్ఠానామికాముక్తా ముష్టిస్స్యాద్వస్త్రముద్రికా ॥
తా॥ చిటికెనవ్రేలిచేతనూ, ఉంగరపు వ్రేలిచేతనూ విడువబడిన ముష్టి (పిడికిలి) వస్త్రముద్ర యగును.

— వస్త్రార్పణ ఫలం —

*శ్లో॥ వస్త్రార్పణేన రుద్రస్య ధనవాన్ భోగవాన్ భవేత్ ॥
తా॥ శివునకు వస్త్రము సమర్పించినయెడల ధనవంతుడు, భోగవంతుడునూ అగును.

— భావన —

*మూ॥ చిదగ్నిస్వరూప పరమానన్దశక్తి స్ఫురణం వస్త్రమ్ ॥
భా॥ తనశరీర చైతన్యము చిత్కలాతేజస్సని గ్రహించి సర్వము బ్రహ్మస్వరూపమని తెలిసికొని బ్రహ్మానందానుభూతిని గలిగించుకొనుటయే వస్త్రము.

— అథ యజ్ఞోపవీతమ్ —

శ్లో॥ "నిరాలంబస్యోపవీతంకుత" ఇత్యుచ్యతేపిహ ।
ఉపవీతం ప్రదాస్యామి గృహాణసురపూజిత ॥

తా॥ "దర్వీకరాభరణా! నిరాలంబుడవైన నీకు యజ్ఞోపవీతమనావశ్యక" మని విన్నను సురపూజితుడవగు నీకు ఉపవీతమును భక్తితో సమర్పించుచున్నాను.

న॥ ఉత్తైనంగోపా=యాతినః । ఒమ్‌నమశ్శివాయ ॥ తత్పురుషాయ=యాత్ ॥ యజ్ఞోపవీతం పరమం పవిత్రం = బలమస్తుతేజః ॥

మం॥ క్వ-? స్యతే రుద్రమృళయాకుర్హస్తోయో అస్తి భేషజో జలాషః । అపభర్తారపసోదైవ్యస్యా భీనుమావృషభ చక్షమీధాః ॥

శ్రీఉమా=నమః । యజ్ఞోపవీతం సమర్పయామి ॥

— యజ్ఞోపవీతముద్రా —

*శ్లో॥ అంగుష్ఠస్యాగ్రపర్వాంతు। మధ్యమాంగుళినాస్పృశేత్ ।
యజ్ఞోపవీతముద్రాస్యా ద్దేవదేవ ప్రియాధికా ॥

తా॥ బొటనవ్రేలి మొదటి కణుపును మధ్యమాంగుళిచే తాకిన యజ్ఞోపవీతముద్రయగును. ఇది శివునకు మిక్కిలి ప్రీతికరము.

— యజ్ఞోపవీతార్పణ ఫలం —

*శ్లో॥ యజ్ఞోపవీతార్పణేన । చన్ద్రలోకమవాప్నుయాత్ ॥

తా॥ ఉక్తప్రకారమున మహేశునకు యజ్ఞోపవీతమును సమర్పించిన చన్ద్రలోకము లభించును.

— భావన —

*మూ॥ ప్రత్యేకగ్ం సప్తవింశతిధాభిన్న త్వేనేచ్ఛా జ్ఞానక్రియాత్మక బ్రహ్మగ్రంధి మద్రసతంతు బ్రహ్మనాడీ, బ్రహ్మసూత్రమ్ ॥

భా॥ జగత్తు బ్రహ్మకారమేయని జెప్పు సూత్రము కాబట్టి బ్రహ్మసూత్రమనునామమన్వర్థము సుషుమ్నానాడికి బ్రహ్మనాడియని నామాన్తరము గలదు॥ కావున సుషుమ్నానాడిని బ్రహ్మసూత్రముగా భావించుటయే యజ్ఞోపవీత సమర్పణము.

— యజ్ఞోపవీతాంతరార్థము —

* వేదమాతయైన గాయత్రికి పరమ పవిత్రమైన యజ్ఞోపవీతము ప్రతీకయని తెలియవలెను. 96 బెత్తలుగల

ఒకేదారము (తత్త్వములను సూచించును) 3 పేటలుగా పేనబడి రెండు అగ్రములూ కలిపి ముడివేయబడును. అనగా ముడిలోపల 3 అంతస్సూత్రము లుండును.

మరియు త్రిరావృత్తము చేయబడిన ఒక సూత్రములో మూడేసి పోగుల చొప్పున ఉండును. 9 సూత్రములు కలిగి 27 పోగులతో నుండును ఆదారములే 27 భేదములుగల జగత్తు. ఇటువంటి జగద్రూపమైన యజ్ఞోపవీతమును ధరించిన వారు బ్రహ్మపరమైన కర్మలను చేయుట కర్హులగుదురు.

మరియు ఈ సమస్త జగత్తూ బ్రహ్మాకారమే (సర్వం ఖల్విదం బ్రహ్మ) యని చాటిచెప్పు సూత్రము గనుక బ్రహ్మ సూత్రమనియు యజ్ఞోపవీతమనియు నామము కల్గినది.

మలినసత్వ ప్రధానమగు మూలప్రకృతి తన త్రిగుణములచే ముందు 3 శక్తులుగా తోచి పిమ్మట ఆ 3 శక్తుల కలయికవలన నవవిధములయి. మరల అవి పరస్పరము కూర్పబడి 27 విధములై తెల్లని వస్త్రముపై చిత్రములు కల్పితములైనట్లు బ్రహ్మమందు 27 భేదములుగా సృష్టి యున్నట్లు కనబరచినది. ఈ 27 భేదములుగల సృష్టికి కారణమైనదియునూ, ప్రకృతిమయమైనదియునూ ఐన గాయత్రి 3 పాదములు గలది. మరియు భూః, భువః, సువః అను 3 వ్యాహృతులనూ 24 అక్షరములతో (చతుర్వింశతి

తత్త్వములు) కలశి మొత్తం 27 అక్షరములు గలది యనియు, అటువంటి గాయత్రిని విధిగా ఉపాశించవలెనని మహాత్ము లేనాడో నిర్ణయించిరి. మరియు యజ్ఞోపవీతమందున్న 3 సూత్రములకు కూటస్థానమైన ముడియే బ్రహ్మముడి యనబడుచున్నది. అదియే శుద్ధసత్వ ప్రధానమైన గుణ సామ్యావస్థ. అది తెలిసిన వెంటనే ఆ యజ్ఞోపవీతమును పరిత్యజించుటే సన్న్యాసము. ఇది తెలిసినవాడే 'కర్మవిము క్తుడు, జీవన్ముక్తుడు'నూ అగును. మరియు సుషుమ్నానాడి యగు బ్రహ్మనాడియందు సూక్ష్మనాడులు కలియుచోటే గ్రంధి అదితత్త్వత్రయము (27 సూక్ష్మనాడుల సమూహము) కలది. కాబట్టి సుషుమ్నానాడియే యజ్ఞోపవీతమని తెలియ వలయును. వేదపఠన మొనర్చుచూ ప్రత్తితో వడికిన యజ్ఞోప వీతమును ధరించినవారు సత్యమైన యజ్ఞోపవీతమే సుషుమ్న యని తెలుసుకొని తత్త్వవేత్తలై తరింతురనుటలో సందియము లేదు.

☞ ఇంకనూ తెలిసికొనవలెనన్న మా గ్రంధమాలనుండి వెలువడబోవు 'యజ్ఞోపవీతధారణవిధి' యను గ్రంధమును చూడుడు.

— భస్మ సమర్పణమ —

సద్యోజాతంప్రపద్యామీతి పంచబ్రహ్మమంత్రైః ప్రతిగృహ్య
సద్యోజాతం ప్రపద్యామి—సదాశివోమ్ ॥ ఇతి ప్రతిగృహ్య

అగ్నిరితిభస్మేత్యభిమంత్ర్య । అగ్నిరితిభస్మ, వాయురితిభస్మ,
జలమితిభస్మ, స్థలమితిభస్మ, వ్యోమేతిభస్మ, సర్వగ్ం
హవా ఇదంభస్మ । ఇత్యభిమంత్ర్య ॥
మానస్తోక ఇతి సముద్ధృత్య జలేన సంసృజ్య। మానస్తోకే ॥
విధేమతే । ఇతి సంసృజః ॥
పరిముంచధన్వనస్త్ర్యాయుషం, త్ర్యంబకమితి సమర్పయేత్ ॥
న॥ ప్రముంచధన్వన—భగవోవప ॥
త్ర్యాయుషంజమదగ్నేః కశ్యపస్యత్ర్యాయుషంయద్దేవానాం
త్ర్యాయుషం తన్మేఅస్తు త్ర్యాయుషం ॥
త్ర్యంబకం యజామహే—తాత్ । ఓమ్‌నమశ్శివాయ ॥
శ్రీఉమా—నమః। విభూతిం సమర్పయామి ॥
*శ్లో॥ భూతిర్భూతికరీపవిత్రజననీ పాపౌఘ విధ్వంసినీ ।
సర్వోపద్రవనాశినీ జయకరీ సర్వార్థసంపత్కరీ ।
భూతప్రేతపిశాచరాక్షసగణాన్ దుష్టాంశ్చ సంహారిణీ ।
తేజోరాజ్యవిశేషభూషణకరీ భూతిస్సదాపాతునః ॥

— భస్మార్పణ ఫలమ్ —

*శ్లో॥ సర్వపుష్పాణి పత్రాణి ఫలానిచ శివార్పణే ॥
పుణ్యం తేభ్యోఽధికంచైవభస్మనా శంకరార్చనమ్ ॥

*శ్లో॥ భస్మార్చనాన్మహైశ్వర్య మితి ॥

తా॥ లోకములో ఉన్న సమస్త పత్రపుష్ప ఫలములను శివునకు సమర్పించినవారికంటే శివునకు భస్మముచే అర్చన చేసినవారికి హెచ్చుగా పుణ్యము ప్రాప్తించును. భస్మార్చన మహైశ్వర్య ప్రదము.

— అథ ఆభరణాని —

శ్లో॥ "కుతోరమ్యస్యాభరణ" మిత్యుక్త మపిశంకర ॥
దాస్యామ్యా భరణాన్యద్య యధాశక్తి పరాత్పర ॥

తా॥ "ఈశ్వరా! సహజసుందర స్వరూపునకు ఆభరణ సమర్పణము అవివేక కార్యము"ని చెప్పబడినను నా సంతృప్తికై యధాశక్తి యాభరణముల నర్పించుచుంటిని.

న॥ నమోఅస్తునీలగ్రీవాయ = కరం నమః । ఓమ్ నమ శ్శివాయ । ఈశానస్సర్వ = సదాశివోమ్ ॥

మం॥ హిరణ్యరూపస్స హిరణ్య సంధృగపాన్న పాత్సేదు
హిరణ్యవర్ణః । హిరణ్యయా త్పరియానేర్నిషద్యా
హిరణ్యదా దదద్యన్నమస్మై ॥

శ్లో॥ దుత్తూరపుష్పం నాగేన్ద్రం చన్ద్రఖండంచ జాహ్నవీం ।
పార్థప్రహారరేఖాంచ త్రిశూలం గరళం తథా ॥
పరశుం డమరుం వజ్రం పినాకం ఖడ్గమేవచ ।

మహాపాశుపతం చైవ శక్తిం పాశాంకశౌ తతః ॥
రుద్రాక్షమాలాం ఘంటాంచ హారిణం ఘుర్ఘురం తథా ।
కిరీటహార కేయూరకుణ్డలానిచ భస్మచ ॥
మనసా కల్పితాన్ శుద్ధాన్ భౌతికానపి భక్తితః ।
గృహాణభక్త్యా సర్వేశ! దాస్యామ్యా భరణాని వై ॥
ఉమా=నమః । అభరణాని సమ = మి

తా॥ ఉమ్మెత్తపుష్పము, సర్పరాజమును, సుధాంశుఖండమను, గంగను, అర్జునుని ప్రహారముచే చిహ్నితమైన రేఖను, త్రిశూలమును, విషమును, కంకాళమును, డమరువును, వజ్రమును, పినాకమును, మహాపాశుపతమును, శక్తిని పాశమును, అంకుశమును, రుద్రాక్షమాలను, ఘంటను, కృష్ణ సారమును, కిరీటమును, హారమును, భుజకీర్తులను, కుణ్డలములను, విభూతిని ఈ మొదలగు మనఃకల్పితములైన అభరణములనూ, భౌతికములైన యాభరణములనూ భక్తితో సమర్పించుచున్నాను, గ్రహించుము.

— ఆభరణముద్రా —

*శ్లో॥ కనిష్ఠికాగ్ర పర్యంతు స్పృశేదం గుష్ఠకేనతు
జ్ఞేయాభూషణముద్రాసా దేవదేవప్రియంకరీ ॥

తా॥ చిటికెనవ్రేలి చివరికణువును బొటనవ్రేలితో తాకిన అభరణముద్ర యగును. ఈముద్ర దేవదేవునకు ప్రీతికరమైనది.

— భావన —

*మూ॥ స్వవ్యతిరిక్త వస్తుసంగరహిత స్మరణం విభూషణమ్॥

తా॥ తానొక మానవుడనని భ్రమపతితుఁడుగాక తాను బ్రహ్మమేగాని తదితరపదార్థము కాదనియు, మాయాది వస్తువులతో తనకు సంబంధము లేదని తెలిసికొనుటయే ఆత్మ స్వరూపదేవతకు విభూషణము.

— ఆభరణార్పణ ఫలం —

*శ్లో॥ రత్నకాఞ్చన భూలాభ । శ్శివస్యాభరణార్పణే ॥

తా॥ శివునకు ఆభరణములను భక్తితో సమర్పించిన రత్నలాభము, సువర్ణలాభము కలుగును.

— అథ గన్ధః —

శ్లో॥ "నిర్లేపస్యకుతోగన్ధ" ఇతి విజ్ఞాయ శ్రీకర ।
గన్ధందాస్యామి విశ్వేశ మమ సంపత్సమృద్ధయే ॥

తా॥ "నిర్వికారా! నిర్లిప్తుడైన చంద్రశేఖరునకు గంధముతో పనిలే"దని తెలిసికొన్నను నాకు సంపత్సమృద్ధి లభించుటకై గంధమును సమర్పించుచున్నాను.

న॥ అవతత్యధను సుమనాభవ । ఓమ్ నమశ్శివాయ ।
వామదేవాయ నమః। గంధద్వారాం=హ్వాయేశ్రియం॥

మం॥ ప్రబభ్రవే వృషభాయశ్వితీచే మహోమహీం సుష్టు
తిమీరయామి ।

నమస్స్యాకల్మలీకినంనమోభిర్గుంజీమసి త్వేషం రుద్రస్య
నామ ॥

శ్రీఉమా=నమః । గంధం సమర్పయామి ॥

— గంధముద్రా —

*శ్లో॥ జ్యేష్ఠాగ్రేణ కనిష్ఠాగ్రం స్పృశేద్గన్ధస్య ముద్రికా ॥

అన్యచ్చ :— గ్రన్థాంతరే :— కనిష్ఠానామికాముక్తాముష్టి
స్స్యాద్గన్ధ ముద్రికా ॥

తా॥ కుడిచేతి బొటనవ్రేలు కుడిచేతి చిటికెనవ్రేలు చివరిభాగమును స్పృశించిన గంధముద్ర యగును.

లేక :— చిటికెనవ్రేలిని, ఉంగరపువ్రేలిని వదలి మిగిలిన వ్రేళ్ళయొక్క ముష్టి (పిడికిలి) పట్టిన గంధముద్రిక యగునని గ్రన్థాంతరమందు చెప్పబడినది.

— భావన —

*మూ॥ వత్సజ్ఞ పరిపూతను స్మరణం గన్ధః ॥

భా॥ సాధకుఁడు తన సహస్రార కమలమునందు చిత్కల కలదనియు, దానికాన్తి చైతన్యమయముగా శరీరమంతయు వ్యాపించియున్నదనియు తెలిసికొని దానిచే నేను సర్వదా పవిత్రుడనని గ్రహించి స్మరించుట శ్రీగన్ధ సమర్పణము.

*శ్లో॥ గంభీరాపార దౌర్భాగ్యక్లేశన శన కారణాత్ ।
ధర్మజ్ఞానప్రదానాచ్చ 'గంధ' ఇత్యభిధీయతే ॥

భా॥ సర్వదుఃఖ నివృత్తి చేయుటవలన, ధర్మజ్ఞానముల నొసగుటవలన గన్ధమని చెప్పఁబడుచున్నది.

— గన్ధాను లేపనవిధిః - తత్తత్ఫలాని —

*శ్లో॥ కనిష్ఠికాం గుష్ఠాభ్యాంచ ధర్మం గన్ధార్పణేనవై ।
అర్థమంగుష్ఠికానా మికాభ్యాం చైవ తథాపునః ॥
మధ్యమాంగుష్ఠికాభ్యాంచ కామం చందనలేపనే ।
అఙ్గుష్ఠతర్జనీభ్యాంచ మోక్షో గంధసమర్పణే ।

(అర్థము సుగమము)

— గన్ధసమర్పణాఙ్గాని —

*శ్లో॥ దివ్యం పరిమళైర్యుక్తం గన్ధం కాయానులేపనం ।
మౌళౌ లలాటే కంఠేచ హృదయే భుజయోస్తథా॥

తా॥ శిరస్సు, లలాటము, కంఠము, హృదయము, భుజములు, గంధము సమర్పించవలసిన స్థానములు గాన దేవునియొక్క నాభి పైభాగమందుగల పైన చెప్పిన యంగములయందు గంధానులేపనము చేయవలెను.

— అష్టగంధ ద్రవ్యాణి —

*శ్లో॥ ఉశీరం కుంకుమం చైవ జటామాంసిచ చందనం ।
తక్కోలం చాగరుం చైవ కర్పూరం భూరసంతథా ।
అష్టగన్ధా ఇతిప్రోక్తాః శివానుగ్రహదాయకాః ॥

(శైవాగమే)

*సూ॥ అష్టగన్ధాలాభే శ్రీగన్ధవా బిల్వగన్ధంవా । తత్ఫలం ।
*శ్లో॥ చందనాద్భాగ్యమాప్నోతి బిల్వగంధంచ మోక్షదం ॥

తా॥ వట్టివేళ్లు, కుంకుమపువ్వు, జటమాంసి, గంధపు పొడి, తక్కోలములు, అగరుచెక్క (లేక కృష్ణాగరు) పచ్చ కర్పూరము, భూరసపుగడ్డ (ఈ ఎనిమిది) అష్టగంధము లన బడును. ఈ గంధము శివునకు సమర్పించిన వాడు శివాను గ్రహపాత్రులగుదురు. ఈ యష్టగంధములు అలభ్యమైనపుడు మంచిగంధముగాని, బిల్వగంథముగాని సమర్పించవలయును. గంధ సమర్పణమువలన భాగ్యము మారేడుచెక్క గంధము వలన దేహాంతమందు మోక్షము సిద్ధించును.

— శ్వేతాక్షతలు —

శ్లో॥ శ్వేతాక్షతాన్ శుభకరానక్షయైశ్వర్యదాయక ।
సంగృహాణ సురారాధ్య ! రక్షమాం పరమేశ్వర ! ॥

తా॥ "అష్టైశ్వర్యదాయకా ! మంగళప్రదములగు తెల్లని అక్షతలను స్వీకరించి నన్ను రక్షింపుము."

న॥ విజ్యంధనుః=నిషంగధిః । ఓమ్‌నమశ్శివాయ ।
అఘోరేభ్యో=రూపేభ్యః । అయనేతే=షమే ॥

మం॥ ఈశానంత్వాభువనా నామభిశ్రియమ్ । త్వామ్యగ్న
ఉరుకృతగ్ం సువీరమ్ । హవిర్జుషాణస్సపత్నాగ్ ।
అభిభూరసి । జహిశత్రూగ్ం రపమృధోనుదస్వ ॥
ఉమా = నమః । శ్వేతాక్షతాన్ సమర్పయామి ॥

— శ్వేతాక్షత పూజాఫలమ్ —

*శ్లో॥ ముక్తి శ్వేతాక్షతైర్వాపి । శత్రునాశస్తిలాక్షతైః ॥

తా॥ తెల్లని (బియ్యము) అక్షతలతో నర్చించిన ముక్తి లభించును. నువ్వులతో పూజించిన శత్రునాశనము సిద్ధించును.

— బిల్వపత్రమ్ —

శ్లో॥ అమృతోద్భవ శ్రీవృక్షం శఙ్కరస్య సదాప్రియం ।
తత్తేశంభో ప్రయచ్ఛామి బిల్వపత్రం సురేశ్వర ॥

తా॥ "శంకరా! అమృతోద్భవమై బిల్వవృక్షము మీకు సదా ప్రియము గాన ఆ మారేడుదళము భక్తితో మీకు సమర్పించుచుంటిని స్వీకరింపుము".

శ్లో॥ త్రిదళం త్రిగుణా౽కారం త్రినేత్రంచ త్ర్యాయుధమ్।
త్రిజన్మ పాపసంహారం ఏకబిల్వం శివార్పణమ్ ॥

మ॥ యాతేహేతిర్మీ ఢుష్టమ = పరిభుజ ।
ఓమ్ నమశ్శివాయ తత్పురుషాయ = యాత్ ॥

మం॥ త్ర్యంబకం యజామహే = మామృతాత్ ।
శ్రీ ఉమా=నమః । బిల్వదళం సమర్పయామి ॥

— స్వర్ణబిల్వదళమ్ —

శ్లో॥ అష్టైశ్వర్యప్రదం దివ్యం త్రిదళం స్వర్ణనిర్మితం ।
బిల్వపత్రం ప్రదాస్యామి శ్రియందేహి మహేశ్వర ॥

తా॥ "గిరిజామనోహరా ! అష్టైశ్వర్యముల నిచ్చె బంగారు మారేడు దళమును సమర్పించుచున్నాను. ఐశ్వర్యమును మాకిడుము."

ఉమా = నమః । స్వర్ణబిల్వదళం సమ = మి

— స్వర్ణబిల్వదళ దళార్పణ ఫలమ్ —

*శ్లో॥ స్వర్ణబిల్వదళం శంభోరేకం వాయస్సమర్పయేత్ ।
కోటిబిల్వార్చన ఫలం లభతే నాత్రసంశయః ॥
(రుద్రికామ్యార్చనావిధౌ)

తా॥ ఒక బంగారు మారేడుదళమునైన శంకరునకు ఎవరు అర్పింతురో వారు కోటి బిల్వపూజ చేసిన ఫలితమును పొందుదురు.

*శ్లో॥ బిల్వైర్యజ్ఞాయుతం ఫలమ్ ॥

తా॥ బిల్వపత్రములచే శివున కారాధన చేసినవారికి 10 వేల యజ్ఞములు చేసిన ఫలము కలుగును.

— *బిల్వపత్ర ప్రశస్తి —

శ్లో॥ శివార్థం సర్వదా కార్యా పుష్పహింసాద్విజోత్తమాః
యజ్ఞార్థం పశుహింసాచ .... ఇత్యారభ్య :-
కార్తిక్యాంచ మహాదేవం శ్రీపత్రేణ ప్రపూజయేత్
సర్వమాసేషు కమలం హైమమేకమథాపివా
రాజితం వాపికమలం హైమకర్ణికముత్తమం
రాజితస్యాప్య భావేతు బిల్వపత్రై స్సమర్చయేత్
సహస్రకమలాఽలాభే తదార్ధేనాపి పూజయేత్
తదార్ధేనైవవా రుద్రమష్టోత్తర శతేనవా
బిల్వపత్రే స్థితాలక్ష్మీ ర్దేవీలక్షణ సంయుతా
నీలోత్పలేఽమ్బికా సాక్షాదుత్పలే షణ్ముఖస్స్వయం
పద్మాశ్రితో మహాదేవ స్సర్వదేవ పతిశ్శివః
తస్మా త్సర్వప్రయత్నేన శ్రీపత్రం నత్యజేద్బుధః
శ్వేతార్క కుసుమే సాక్షాచ్చతుర్వర్గః ప్రజాపతిః
కర్ణి కారస్యకుసుమే వాణీ (మేధా) సాక్షాద్వ్యవస్థితా
కరవీరే గణాధ్యక్షో బకేనారాయణ స్స్వయం
సుగన్ధిషుచ సర్వేషు కుసుమేషు నగాత్మజా
తస్మాదేతైర్యథాలాభ పుష్పధూపాదిభిశ్శుభైః
పూజయే ద్దేవదేవేశం భక్త్యా విత్తానుసారతః॥

(లైఙ్గే, ఉ)

పత్రం త్రినేత్రప్రియమేవ బిల్వమపాత్రమప్యద్రిసుతేను పాత్రమ్ । కరోతి మేలిజ్గసమర్చనాసు శుష్కం తథా పర్యుషితం పవిత్రమ్ ॥

(శివరహస్యేశివః)

తా॥ శివార్చనార్థమై సర్వదా పుష్పములను కోయుట, మాలలు గుచ్చుట మొదలగునవి చేయవచ్చును. అది పుష్ప హింసకాదు. యజ్ఞార్థం పశుహింస చేయవచ్చును. అది దోషము లేదు.

కార్తీక మాసమునందు మహాదేవుని మారేడు దళముల చేతనే పూజించవలయును. సర్వమాసములయందు ఒక్క స్వర్ణ లేక రజిత పద్మముతోనైననూ లేక బంగారు కర్ణికగల వెండి పద్మముతో శివునర్చించవలయును. శక్తిలేనివారు మారేడు దళములచే నర్చించవలయును. 1128 పద్మములుగాని లేక 564 పద్మములుగాని లేక 282 పద్మములుగాని లేక 108 పద్మములుగాని సంపాదించి శివునకు పద్మార్చన చేయవలెను. ఇట్లు చేసిన ఇహమందు అష్టైశ్వర్యములు దేహాంతమందు కైవల్యము కలిగి తీరును.

మారేడుదళమందు సర్వలక్షణ లక్షితయైన మహాలక్ష్మీ దేవి, నీలోత్పలమందు (నల్లకలువ) పార్వతీదేవి, తెల్లకలువ యందు కుమారస్వామి, కమల (పద్మమందు) శంకరుడు సర్వదా వసించియుండుదురు గాన సర్వవిధముల ప్రయ

త్నము చేసి మారేడుపత్రి సంపాదించి శివు నర్చించవలెను. మరియు తెల్లజిల్లేడు పుష్పమందు బ్రహ్మయూ, కొండగోగు పువ్వునందు మేధాదేవి (సరస్వతి) కరవీరపుష్పమందు గణపతి, శివమల్లి పుష్పమున శ్రీమన్నారాయణు, సువాసనగల సమస్త పుష్పములయందు గౌరీదేవియున్ను సర్వదావసించియుందురు. గాన పై పుష్పములను ప్రయత్నముచేసి సంపాదించి సంప్రాప్తములైన పుష్పములచే దేవదేవుడైన శంకరుని భక్తితో, విత్తానుసారముగా సమస్తోపచారములతో నర్చించవలయును.

మరియు త్రినేత్రుడైన మహాదేవునకు ప్రియమైన బిల్వదళము ఎండిపోయిననూ కోసినపిమ్మట ఎన్నిరోజులయిననూ పర్యుషితదోషములేదు. సదా పవిత్రము. ఎట్లున్ననూ పూజార్హమే గాన లింగరూపినైన నాకు నిత్యమూ అర్చించవలయును" అని శివుడు పార్వతితో చెప్పెను.

— అథ పుష్పాణి —

శ్లో॥ "నిర్వాసనస్య పుష్పాణామర్పణం వ్యర్థమేవ" హి ।
పుష్పందాస్యామి సద్భక్త్యా సంతృప్త్యర్థంమమాఽనఘ॥

తా॥ "మృత్యుంజయా! వాసనారహితుడవగు నీకు పుష్పార్పణము వ్యర్థము" ని విన్ననూ నా తృప్తికొరకు భక్తితో పుష్పము నర్పించుచున్నాను.

న॥ పరితేధన్వనో = నిధేహితం । ఓమ్నమశ్శివాయ ।
వామదేవాయనమో=మనోన్మనాయనమః ॥

మం॥ స్థిరేభిరంగైః పురురూప ఉగ్రోబభ్రుశ్శుక్రేభిః పిపిశే
హిరణ్యైః ।

ఈశానాదస్యభువనస్య భూరేర్నవాఉయోషదుద్రాద
సుర్యః ॥

మం॥ పుష్పావతీః = ఇషవః ॥
ఉమా=నమః । పుష్పాణి సమర్పయామి ॥

శ్లో॥ పుష్పాణ్యేతాని పత్రాణి దదాతి ప్రకృతిస్సదా ।
సర్వంప్రకృత్యాలబ్ధంహి త్వదీయా ప్రకృతిశ్చసా ॥
త్వదీయం తవదాస్యామి క్షమధ్వం గిరిజాపతే ।
మమాజ్ఞానకృతం పాపమపసారయ శంకర ॥

తా॥ ఓమహేశ్వరా ! పుష్పములను, పత్రములను ఎల్లప్పుడు ప్రకృతి యిచ్చుచున్నది. సమస్తము ప్రకృతి చేతనే పొందబడుచున్నది. ప్రకృతి నీసంబంధమైనదియే. నీద్రవ్యమునే నీ కర్పించుచున్నాను. నన్ను క్షమించుము. ఓ శంకరా ! అజ్ఞానకృతమగు నాపాపమును తొలగించుము.

— భావన —

మూ॥ నమస్త విషయాణాం మనసః స్థైర్యేణానుసంధానం కుసుమమ్.

భా॥ ఇంద్రియ నిగ్రహముగలిగి మనస్సును బ్రహ్మపదార్థమందు లయింపఁజేసి సర్వము బ్రహ్మపదార్థమని తెలిసికొనుటయే పుష్పార్చన. (సర్వంఖల్విదంబ్రహ్మ)

— పుష్పముద్రా —

శ్లో॥ అధోముఖంకరంకృత్వాతర్జన్యగ్రేణయోజయేత్ ।
అంగుష్ఠాగ్రంతుముద్రైషా పుష్పాఖ్యా పరమేశ్వర ॥

తా॥ కుడిచేతిని బోర్లించి బొటనవ్రేలి చివరిభాగమును జూపుడుఁవ్రేలి చివరిభాగముతో కలిపిన పుష్పముద్ర యగును.

— పత్రపుష్ప పూజావిధి —

శ్లో॥ మధ్యమానామికాంగుష్ఠైః పుష్పం సంగృహ్య పూజయేత్ । పత్రం వాయదివాపుష్పం ఫలం నేష్టమధోముఖం । పత్రపుష్పార్పణేచైవ యథోత్పన్నంతథార్పణం ॥

(శైవాగమే స్మృతిసారసంగ్రహేచ)

శ్లో॥ పత్రంపుష్పంఫలంచైవ యథోత్పన్నం తథార్పయేదితి

(ధర్మసింధువు)

వృన్తహీనం ద్రోణపుష్పం సర్వేవృన్త సమన్వితాః
కిఞ్జల్కహీనమర్కం చ సర్వేకిఞ్జల్కసంయుతాః ॥ శివః
(బిల్వపత్రం తు సాభిముఖాగ్రం న్యుబ్జం అర్పయేత్)

తా। మధ్యమానామికాంగుష్ఠములచే పుష్పమును పట్టుకొని పూజింపవలయును. దళమైనను, కుసుమమైనను నధోముఖముగలదిగా నర్పించరాదు. అట్లర్పించిన భగవంతునకు ప్రీతికరముగాదు. అవి యేముఖముతో పుట్టినవో యట్లే నమర్పించవలయును.

తొడిమలేని తుమ్మిపువ్వే పూజార్హము. మిగిలిన వన్నియు తొడిమతోకూడినవే పూజార్హములు. పుప్పొడిలేని జిల్లేడుపుష్పమే అర్చనార్హము. మిగిలిన పుష్పములు కింజల్కసహితములుగానే పూజాయోగ్యములు.

బిల్వపత్రమును మాత్రము దళాగ్రము తన కభిముఖమగులాగున బోర్లించి యుంచవలయునని కొందరిమతము.

— సువర్ణ పుష్పార్పణ ఫలం —

శ్లో॥ దారిద్ర్యనాశనార్థాయ ధనధాన్యసమృద్ధయే ।
అర్చయేత్స్వర్ణకుసుమ ముమానాథస్యమూర్ధని ॥
(పురాణవాక్యం)

తా॥ దారిద్ర్య నాశనార్థమున్నూ, ధనధాన్యసమృద్ధ్యర్థమున్నూ బంగారు పుష్పమును పార్వతీపతియొక్క శిరమునందు అర్పించవలెను.

## — పూజా పుష్పశుద్ధి —

ప్రశ్న :—

*శ్లో॥ పుష్పంతుభ్రమరోచ్ఛిష్టం మత్స్యోచ్ఛిష్టం జలంతథా।
మంత్రంతురసనోచ్ఛిష్టం పూజాశుద్ధిః కథంభవేత్ ॥

(స్మృతివాక్యం)

తా॥ పుష్పముపై తుమ్మెదవాలి మధువునుగ్రోలుటచే పుష్పము ఉచ్ఛిష్టమైనది. మత్స్యములు నీళ్ళలోనుండి ఆ నీళ్ళను త్రాగుటచే జలము ఉచ్ఛిష్టమైనది. పవిత్ర వేద మంత్రము నాలుకచే ఉచ్చరించుటవలన తుంపరలచే మంత్రము ఉచ్ఛిష్టమైనది. గాన పూజాశుద్ధి ఎట్లగును?

## — సమాధానం —

*శ్లో॥ పుష్పంతుప్రోక్షణాచ్ఛుద్ధం జలంప్రక్షేపణాత్తథా।
మన్త్రమాచమనాచ్ఛుద్ధం పూజాశుద్ధిర్భవిష్యతి ॥

(స్మృతివాక్యం)

తా॥ పుష్పములపై నీళ్ళుచల్లిన శుద్ధియగును. ఉదకము వడపోయుటవలనను, కొద్దిజలమును (ముందుగా భూమిపై పోయుటవలను) శుద్ధియగను. వేదమంత్రము ఆచమనముచేసి పఠించిన శుద్ధియగను. గాన కుతర్కములు, వితండవాదములు చేయక భక్తిశ్రద్ధలతో భగవానుని పూజించవలయును.

— శివపూజార్హ పుష్పపత్రాణి —

*శ్లో॥ కరవీరార్క మన్దార శమీావకుళకింశుకం ।
మధూకబృహతీ బిల్వమపామార్గంచ పాటలమ్ ॥
అశోకాగస్త్య దుత్తూర కర్ణికారకదమ్బకం ।
బాణపున్నాగతిలకం కోవిదారంచ చమ్పకమ్ ॥
మల్లికా మాధవీ జాతీద్రోణంచ శతపత్రికం ।
కమలం కైరవం చైవ తథానీలోత్పలానిచ ॥
తమాలం తులసీపత్రమిత్యేతాని శివార్చనే ।
పుష్పపత్రాణి శస్తాని సర్వపాపహరాణిచ ॥

(శివతత్వసారసంగ్రహే)

తా॥ శివార్చనకు గన్నేరు, జిల్లేడు, మన్దారము, జమ్మి, బొగడ, మోదుగ, మధూకము (ఇప్ప), వెంపలి, మారేడు, ఉత్తరేణి, పాటలము, అశోకము, అవిసె, ఉమ్మెత్త, కొండగోగు, కడిమి, నల్లగోరింట, సురపొన్న, ఎఱ్ఱగోరింట, ఎఱ్ఱదేవకాంచనము, సంపెంగ, మల్లి, పండుగురివెంద, జాజి, తుమ్మి, నూరురేకుల పద్మము, వెయ్యిరేకుల పద్మము, తెల్లకలువ, నల్లకలువ, తాపింఛము, తులసి వీనికి సంబంధించిన పుష్పపత్రములు శ్రేష్ఠములు.

వీనితో శివుని పూజించిన సమస్త పాపములు నశించు ననుట ముమ్మాటికి ప్రమాణభూతము.

— పూజానర్హ పత్రపుష్పాణి —

*శ్లో॥ మలినం తనుసంస్పృష్ట మాఘ్రాతమవికాసితమ్ ।
అశుద్ధభాజనానీతం క్రయానీతంచ యాచితం ॥
శుష్కం పర్యుషితం కృష్ణం భూమిగం నార్చయేత్సుధీః
అపక్వానిచ పుష్పాణి శివాయ ననివేదయేత్ ॥
వస్త్రానీతం కరానీతం ఏరండేంద్ర సముద్భవం ।
స్వయంవాయ్వాదిగళితం పత్రం పుష్పం పరిత్యజేత్ ॥
(రుద్రికామ్యార్చనావిధౌస్మృతివాక్యం)

తా॥ మలినములైనవియు, శరీరముచే తాకబడినవియు, వాసన చూపబడినవియు, వికసించనవియు, అపవిత్రపాత్రలో నుంచబడినవియు, కొనితేబడినవియు, యాచించి తెచ్చినవియు, ఎండినవియు, కుళ్ళినవియు, నేలమీద పడినవి యునగు పత్రపుష్పములతో శివుని పూజించరాదు.

మరియు వికసించని పువ్వులు శివపూజకు మిక్కిలి అనర్హములు. గుడ్డలోపోసి తెచ్చినవియు, చేతితో తెచ్చినవియు, గాలిచే పడినవియునగు పత్రపుష ములు సర్వదా వర్జించవలయును. శివార్చనకు పనికిరావు. (పారిజాత. పొగడ పువ్వులు మాత్రము గాలిచే క్రిందపడినవి పూజార్హములు)

— పుష్పమహిమ —

*శ్లో॥ ఏకస్మిన్నర్క పుష్పేతు శివాయ వినివేదనే ।
దశదత్వా సువర్ణాని యత్ఫలం తదవాప్నుయాత్ ॥

అర్కపుష్పసహస్రేభ్యః కరవీరం విశిష్యతే ।
కరవీరసహస్రేభ్యో బిల్వపత్రం విశిష్యతే ॥
బిల్వపత్ర సహస్రేభ్యః పద్మపత్రం విశిష్యతే ।
పద్మపత్ర సహస్రేభ్యో బకపుష్పం విశిష్యతే ॥
బకపుష్ప సహస్రేభ్యో ఏకం దుత్తూరకం వరమ్ ।
దుత్తూరక సహస్రేభ్యో బృహతీపుష్ప ముత్తమం ॥
బృహతీపుష్ప సాహస్రాద్ద్రోణపుష్ప మనుత్తమం ।
ద్రోణపుష్ప సహస్రేభ్యః కుశపుష్పం విశిష్యతే ॥
కుశపుష్పసహస్రేభ్య శ్శమీపత్రి మనుత్తమమ్ ।
శమీపుష్ప సహస్రేభ్య శ్శ్రీమన్నీలోత్పలం వరమ్ ॥
సర్వాసాం పుష్పజాతీనాం ప్రవరం నీలముత్తమం ।
నీలోత్పలసహస్రేణయోఽర్చయే ద్భక్తిసంయుతః ॥
శివాయ విధివత్తస్య దివ్యపుణ్యఫలం శృణు ।
కల్పకోటి సహస్రాణి కల్పకోటిశతానిచ ॥
వసేచ్ఛివపురేరమ్యే దేవతుల్య పరాక్రమః ।
దుత్తూరకైశ్చయోలిఙ్గం సకృత్పూజయతేనరః ॥
సగోలక్షఫలం ప్రాప్య శివలోకే మహీయతే ।
అఖండబిల్వపత్రైశ్చ సకృల్లిఙ్గం ప్రపూజయేత్
సర్వపాపవినిర్ముక్త శ్శివలోకే మహీయతే ॥
(ఇతి స్మృతిసారే, వాయుపురాణే, శివతత్త్వసార సంగ్రహేచ)

*తా॥ ఒక తెల్లజిల్లేడు పుష్పమును భక్తితో శివునకు సమర్పించిన పది బంగారు వాణెములు సమర్పించిన వచ్చు ఫలితము లభించును.

వెయ్యి జిల్లేడు కుసుమము లర్పించిన లభించు పుణ్యము ఒక్క గన్నేరు పుష్పార్చనవలన లభించును. వెయ్యి కరవీరపుష్ప సమర్పణవలన లభ్యమగు ఫలము ఒక్క మారేడు దళ మర్పించిన లభించును. వెయ్యి మారేడు దళముల సమర్పణచే గలిగిన ఫలితము ఒక్క పద్మపత్రార్చనచే లభించును వెయ్యి పద్మపత్రముల (పద్మదళములు) పూజచే వచ్చిన పుణ్యము ఒక శివమల్లి పుష్పము నర్పించిన కలుగును. వెయ్యి బక పుష్పార్చనచేవచ్చు పుణ్యము ఒక్క ఉమ్మెత్తపూవు నర్పించిన పొందగలుగును వెయ్యి ఉమ్మెత్త పుష్పములకంటె ఒక వాకుడుపువ్వు గొప్పది. వాకుడు పువ్వులు వెయ్యికంటె ఒక తుమ్మిపువ్వు గొప్పది వెయ్యి తుమ్మిపువ్వులకంటె ఒక రెల్లుపువ్వుతో నర్చించిన విశేషము గలదు.

వెయ్యి కుశపుష్పములకంటె ఒక జమ్మిదళము గొప్పది వెయ్యి శమీపత్రములకంటె ఒక నల్లకలువపూవు గొప్పది అన్ని పుష్పజాతులకన్న నల్లకలువ పుష్పము చాల గొప్పది.

ఎవడు వెయ్యి నల్లకలువ పువ్వులతో భక్తితో రుద్రుని పూజించునో వాడు కల్పకోటి సహస్రములు దేవతుల్య పరాక్రమముగలవాడై శివలోకమున నివసించును.

ఉమ్మెత్తపువ్వులతో నెవడొక్కసారి శివు నర్చించునో వాడు లక్షగోవులను దానముచేసినయెడల వచ్చు పుణ్యమును బొంది శివలోకమున ప్రకాశించును.

ఎవడు మారేడుదళములతో నొక్కసారి శివలింగమును బూజించునో వాడు మహాపాపములనుండి విముక్తుడై శివసన్నిధిని మిక్కిలి మహిమాన్వితుడై యొప్పును.

అని స్మృతిసారమునందు, వాయుపురాణమునందు, శివతత్త్వసార సంగ్రహమునందు చెప్పఁబడినది.

— పుష్పోత్పత్తి స్థానఫలం —

*శ్లో॥ పుష్పైరరణ్య సంభూతైః పత్రైర్వాగిరి సంభవైః ।
అపర్యుషితనిశ్ఛిద్రైః ప్రోక్షితైర్జంతు వర్జితైః ॥
(ధర్మసింధు)

ఆత్మారామోద్భవైర్వాపి పుష్పైస్సంపూజయేచ్ఛివం।
పుష్పజాతి విశేషేణ భవేత్పుణ్యం విశేషతః ॥
(శివతత్త్వసారసంగ్రహే)

తా॥ అరణ్యములోపుట్టిన పువ్వులచేగాని, ఉచ్ఛిష్టములుగానివియు, చిల్లులు లేనివియు, జంతువులచే కొఱకబడని

పర్వతమందు పుట్టిన పత్రిపుష్పములచేతగాని, తన(పెరటిలో) ఆరామమందు పుట్టిన పువ్వులచేగాని శివుని పూజించవలయును. పుష్పార్చనచేత విశేషపుణ్యము లభించును.

*శ్లో॥ స్వారామజంచోత్తమంస్యాదారణ్యంమధ్యమంఫలం।
విక్రీతమధమంలబ్ధం యాచ్నాపూజాచనిష్ఫలా॥
(స్మృతివాక్యం)

తా॥ తనపెరటిలోని పువ్వులచే పూజించుట ఉత్తమము. అడవిపూలపూజ మధ్యమఫలము నిచ్చును. కొనిన పూలపూజ అధమము, యాచ్నాలబ్ధకుసుమార్చనము నిష్ఫలము. (అనగా యితరులను యాచించి తెచ్చిన పూలతో చేసినపూజ ఫలితము నీయదు, వ్యర్థము)

— తత్తద్దేవతాపూజాऽనర్హ పుష్పాదులు —

శ్లో॥ అక్షతైర్నార్చయేద్విష్ణుం నతులస్యాగణేశ్వరం।
దూర్వాభిర్నార్చయేద్దుర్గాం నతమాలైస్సరస్వతీం॥
నభైరవం మల్లికాభిర్న కేతక్యా మహేశ్వరం।
నలక్ష్మీంద్రోణ కుసుమైర్బిల్వ పత్రైర్నభాస్కరం॥
(స్మృతివాక్యం)

తా॥ విష్ణువును అక్షతలతో పూజించరాదు. విఘ్నేశ్వరుని తులసితో నర్చనచేయరాదు. తాపింఛ పుష్పములతో సరస్వతీదేవి నారాధిచకూడదు. మల్లెపూలు భైరవపూజకు పనికిరావు. శివార్చనకు మొగలిపువ్వులు

శాస్త్రదూష్యములు. లక్ష్మీదేవికి తుమ్మిపూల పూజను చేయరాదు సూర్యునకు మారేడుదళములు పనికిరావు.

— పత్రిపుష్ప పర్యుషితకాలము —

*శ్లో॥ పంకజం పంచరాత్రేషు సప్తరాత్రేషు బిల్వకం।
తులసీ దశరాత్రేషు పూజితః పరమేశ్వరః ॥
(రుద్రికామ్యార్చనావిధౌ)

తా॥ కోసినపిమ్మట పద్మము 5 రాత్రులవరకున్ను మారేడుదళములు 7 రాత్రులవరకున్ను తులసి 10 రాత్రుల వరకున్ను శివపూజకు పనికివచ్చును.

— పర్యుషిత దోషరహిత పత్రిపుష్పాదులు —

*శ్లో॥ సువర్ణం తులసీబిల్వం తథైవకమలానిచ।
ఏతేనిర్మాల్యతాంయాంతి పునః ప్రక్షాళయేజ్జలైః।
పూజాంకరోతిచేన్మూనం తస్యదోషోనవిద్యతే ॥
(స్మృతివాక్యం)

తా॥ బంగారపువ్వులు తులసీదళములు బిల్వపత్రములు పద్మములు ఒకసారి దేవునికి పూజింపబడినవైనను తిరిగి జలమును ప్రోక్షించి, వానిచే తిరిగి దేవుని పూజించిన దోషము లేదు. (ఇది ఆపద్ధర్మవిషయము).

*శ్లో॥ రత్నస్వర్ణవినిర్మితోరు కుసుమం యాద్రుక్చనంక్షాళితం
పూర్వేద్యుః ప్రతిపాదితం గిరిసుతే సమ్యక్పునః పూజ

యేత్ । తద్వ్యక్షాళితమేవ బిల్వమగజే సంక్షాళితం పూజయే । త్తత్రాలాభవిధౌ శివార్చనావిధౌ నిర్మాల్యతానోచితా ॥

(లైంగే శివతోషిణ్యామ్. శివరహస్యప్రోక్తమ్)

తా॥ రత్నఖచితములైన సువర్ణ పుష్పములున్నూ, మారేడుదళములున్నూ జలముచే ప్రక్షాళన చేసినయడల ఒకసారి శివు నర్చించినవైననూ మరల పూజించవచ్చును. వీనికి నిర్మాల్యత్వములేదు గాన మారేడుపత్రి అలభ్యమైన సమయమున మాత్రము ఒకసారి అర్చించిన పత్రిని జలముచే కడిగి తిరిగి పూజించవచ్చును.

గ్రంథాంతరే :—

*శ్లో॥ బిల్వపత్రంచ మాఘ్యంచ తమాలామలకీదళే
కల్హారం తులసీచైవ పద్మంచ మునిపుష్పకం
ఏషాం పుర్యుషితం నస్యాత్కుశాశ్చ కలికాస్తథా ॥

(స్మృతివాక్యం)

తా॥ మారేడుపత్రి, మల్లి, తాపింఛపుష్పములు, పెద్ద ఉసిరిపత్రి, ఎఱ్ఱకలువలు, తులసిదళములు, పద్మములు, తుమ్మిపూవులు, రెల్లుపువ్వులు సమస్తమైన మొగ్గలు వీనికి పర్యుషిత దోషము లేదు.

— రుద్రాక్షమాలా లేక పుష్పమాలా —

శ్లో॥ త్వన్నేత్రాంబుకణోద్భూత మహారుద్రాక్ష వృక్షకాః ।
తద్బీజరచితామాలా త్వత్ప్రియాస్వీకురు ప్రభో ॥

తా॥ నిటలాక్షా ! నీ నేత్రాంబువులవలన మహా రుద్రాక్షవృక్షములు పుట్టినవి ఆ బీజములచే రచించిన రుద్రాక్ష మాల నీకు చాలా ప్రియము గాన స్వీకరింపుము.

శ్లో॥ అలఙ్కృతోసి సంతాన సుమదామైస్సురేశ్వర
అలంకరోమ్యహం భక్త్యాశంభో త్వాం సుమమాలయా ॥

తా॥ సురపూజితా ! సురపాదపము (కల్పవృక్షము) యొక్క పుష్పములతో అలంకరించబడిన నిన్ను నాకు ప్రాప్తించిన పుష్పములతో గుచ్చబడిన మాలచే భక్తితో అలంకరించుచుంటిని. క్షమించుము.

న॥ ద్రాపే అంధసస్పతే = మృడజీవసే ॥
అఘోరేభ్యో = రూపేభ్యః

మం॥ నమో హిరణ్యబాహవే హిరణ్యవర్ణాయ హిరణ్య రూపాయహిరణ్యపతయే౽మ్బికాపతయ ఉమాపతయే పశుపతయే నమో నమః ॥

ఉమా=నమః రుద్రాక్షమాలాం సమర్పయామి తవ భావే పుష్పమాలాం సమర్పయామి ॥

— అక్షమాలాముద్రా —

*శ్లో॥ అంగుష్ఠతర్జన్యాగ్రేతుగ్రథయిత్వాం గుళిత్రయమ్।
ప్రసారయే దక్షమాలా ముద్రేయం పరికీర్తితా ॥

తా॥ బొటనవ్రేలని చూపుడువ్రేలితో కలిపి మిగిలిన మూడువ్రేళ్ళను జాచిన అక్షమాలాముద్ర యనబడును.

— అథ నాగాభరణం —

శ్లో॥ సహస్రమస్తకైర్యుక్తం నాగాభరణముత్తమం
సమర్పయామి గౌరీశ మనసా స్వీకురుప్రభో ॥

తా॥ "గౌరీపతే! వేయి పడగలతో కూడిన నాగాభరణము మనసా సమర్పించుచుంటిని స్వీకరింపుము."

న॥ నమస్తే అస్త్వాయు=ధన్వనే సద్యోజాతం
ప్రపద్యామి=నమః ॥

మం॥ నమో అస్తు సర్వేభ్యో = సర్వేభ్యోనమః ॥
యశస్కరం బలవన్తం=దీర్ఘమాయుః ॥

— అథ నాగాభరణ సమర్పణ ఫలం —

*శ్లో॥ స్నానపూజావిధౌ శంభోర్నాగాభరణముత్తమం
యోఽర్పయేద్భక్తితస్తస్య సర్పబాధావినశ్యతి ॥

తా॥ స్నానవిధియందు, పూజావిధియందు శివునకు నాగాభరణము సర్వోత్తమము. ఎవడు భక్తితో శంకరునకు నాగాభరణమును అర్పించునో వానికి సర్పబాధ నశించును.

— వివిధ పాపహర పత్రిపుష్పాదులు —

*శ్లో॥ వక్ష్యామి పత్రిపుష్పాదిమాహాత్మ్యం శ్రుణుతుమ్భజ ।
పరస్త్రీగమనేచాఽర్కం వాగ్దోషే కృష్ణవల్లకం ।
పితృనిన్దామహాదోషే బకపుష్పం విధీయతే ।

అపాత్రదానజేపాపే స్వర్ణబిల్వదళం స్మృతమ్ ।
అన్యాయార్జితవిత్తాదిదోషేషు కరవీరకమ్ ।
పరనిన్దామహాదోషో కమలేనవినశ్యతి ।
వేదనిన్దామహాపాపే శమీపత్రం విధీయతే ।
మిత్రద్రోహేద్రోణపుష్పమన్వృతే కశపుష్పకమ్ ।
నీలోత్పలార్చనేనైవ పఞ్చపాతకనాశనమ్ ।
స్త్రీ. ధేను. శిశు, హత్యాదిదోషేషుచ తథాపివా ।
బుద్ధిపూర్వకృతానాంచ పాపానాం బిల్వపూజనమ్ ।
సర్వపాపేషుచాన్యేషు సహస్రకమలానివై ।
తత్తత్పుష్పాదిభిర్లిఙ్గం తత్తద్దోష నివృత్తయే ।
భక్తిశ్రద్ధాన్వితోభూత్వా యథావిధి నమర్చయేత్॥
(రుద్రార్చనారహస్యే అగస్త్యప్రతికుమారః)

తా॥ జిల్లేడు (తెలుపు) పుష్పము పరస్త్రీగమన దోషమునూ, నల్లఉమ్మెత్త పుష్పము వాగ్దానభంగ దోషమునూ, శివమల్లి పుష్పము తల్లిదండ్రులను నిందించిన పాపమునూ, బంగారు మారేడుదళము అపాత్రదానము చేసినందువలన ప్రాప్తించిన యఘమునూ, కరవీర పుష్పము అన్యాయార్జిత ద్రవ్యభక్షణమువలన లభించిన మహాపాపమునూ, పద్మము పరనిందచేయుటువలన సంక్రమించిన కల్బి

షమునూ, జమ్మిపత్రము వేదశాస్త్రములను నిందించుట వలన నార్జించిన కల్మషమునూ తుమ్మిపుష్పము మిత్రద్రోహము చేయుటువలన నంటిన యఘమునూ, రెల్లుపూవు అబద్ధము లాడుటువలన కలిగిన మహాపాపమునూ, నల్లకలువపుష్పములు పంచమహాపాపము లొనర్చుటువలన అనుభవించవలసిన పాపమునూ, మారేడుదళము స్త్రీ, గో, శిశుహత్యలు చేయుటువలన సంప్రాప్తించిన మహాపాపమునూ, బుద్ధిపూర్వకముగాచేసిన పాతకములనూ, మరియు సహస్రకమలములు సమస్తమైన పాపములనూ పోగొట్టును. గాన ఆయా పాపములనుపోగొట్టు కొనుటకై ఆయా పత్రపుష్పాదులచే శివలింగమును శ్రద్ధాభక్తులతో యధాశాస్త్రముగా నర్చించవలెనని అగస్త్యునకు కుమారస్వామి చెప్పెను.

—॥—

## — నామాఽర్చనావిధి —

*శ్లో॥ "ప్రణవాద్యాని" సర్వాణినామానిచ యథాక్రమం।
"నమోఽన్తాని" తథాభక్త్యాపఠన్విద్వానతన్ద్రితః ।
పత్ర, పుష్ప ఫలాద్యైశ్చ భస్మనాఽప్యక్షతైస్సితైః ।
స్వసఙ్కల్పోక్తవిధినా, పూజయేదమ్బికాపతిమ్ ॥

తా॥ మొదట "ఓంకారమునూ", "నమః" అనునది చివరను, ప్రతినామమునకు వచ్చులాగున అన్ని నామములను క్రమము తప్పక, తొందరపడక, భక్తితో పఠించుచు, లభించిన చిన పత్రి, పుష్ప, ఫల, భస్మ, శ్వేతాక్షతాదులతో ("నమః" అనునపుడే సమర్పించుచు, తాను సంకల్పించిన సంఖ్యాప్రకారము పరిశుద్ధాంతః కరణుడై పరమశివుని పూజించవలయును.

(కొందరు నామమునకు ఆదియం దుచ్చరించవలసిన ఓంకారమును ప్రతినామమునకు అంతమం దుచ్చరించుచుందురు. అట్లు ఉచ్చరించుచూ చేసినపూజకు తగిన ఫలితము పుట్టదనుట నిర్వివాదము. ప్రత్యవాయ ఫలితము గూడ ప్రాప్తి చునేమోయని సందేహ ముదయించును. గాన శ్రద్ధ వహించి తదేకలగ్నమానసులై ప్రతినామమునకు ఆదియందే ఓ కారము నుచ్చరించవలయును.)

## — శ్రీ శివాఽష్టోత్తర శతనామావళి —

( శివపంచాక్షరీ మంత్రబీజ సంపుటితము )

### — అంగన్యాసకరన్యాసములు —

అస్యశ్రీ శివపఞ్చాక్షరీ మన్త్రబీజఘటిత శివాఽష్టోత్తర శతనామావళీ మహామన్త్రస్య । అగస్త్యఋషిః । అనుష్టుప్ ఛందః । సామ్బసదాశివోదేవతా । ఓంబీజమ్ । నమశ్శక్తిః । శివాయేతి కీలకమ్ । మమాఽభీష్టార్థసిద్ధ్యర్థే పత్రపుష్పాక్షతాఽరాధనే వినియోగః ॥

ఓమ్ అంగు = హృదయాయనమః ।
నమ్ తర్జనీ = శిరసేస్వాహా !
మం మధ్యమాభ్యాం = శిఖాయైవషట్ ।
శిమ్ అనామికాభ్యాం = కవచాయహుమ్ ।
వాం కనిష్ఠికాభ్యాం = నేత్రత్రయాయవౌషట్ ।
యం కరతలకర = అస్త్రాయఫట్ ।
భూర్భువస్సువరోమితి దిగ్బంధః । ధ్యానమ్ :—

ఓమ్కార రూపిణం శివం
నగజా ప్రాణవల్లభమ్ ।
మహేశ్వరం మహాత్మానం
శివం శాన్తం పరాత్పరం ।
వామదేవం శశాఙ్కాఽఙ్కం
యజ్ఞ పుణ్య ఫలప్రదం ।
లిఙ్గరూపిణ మీశానం ధ్యాయేదీశ్వరమవ్యయం

## — ఓమ్ —

ఓమ్ ఓఙ్కార నన్దనోద్యాన కల్పకాయ నమోనమః
" ఓఙ్కార పీయూష సరః కమలాయ నమోనమః
" ఓఙ్కార పద్మకాన్తార కదమ్బాయ నమోనమః
" ఓఙ్కార పఞ్జరక్రీడా విహఙ్గాయ నమోనమః
" ఓఙ్కారగగనభ్రాజ ద్భాస్కరాయ నమోనమః
" ఓఙ్కారాఽద్రి గుహారత్న ప్రదీపాయ నమోనమః
" ఓఙ్కార ముక్తాభరణ ధారణాయ నమోనమః
" ఓఙ్కార విమలాఽదర్శ బిమ్బితాయ నమోనమః
" ఓఙ్కార శుక్తిమధ్యస్థ మౌక్తికాయ నమోనమః
" ఓఙ్కార సంపుటలసత్కర్పూరాయ నమోనమః
" ఓఙ్కార సాధ్వీమాఙ్గల్యాభరణాయ నమోనమః
" ఓఙ్కార దివ్యకుసుమ సౌరభాయ నమోనమః
" ఓఙ్కార పిణ్డఖర్జూర మాధుర్యాయ నమోనమః
" ఓఙ్కార కోకిలోదఞ్చ త్పఞ్చమాయ నమోనమః
" ఓఙ్కార చన్ద్రికాసార శైతల్యాయ నమోనమః
" ఓఙ్కార వనితావక్త్ర లావణ్యాయ నమోనమః
" ఓఙ్కారాఖ్య ప్రపఞ్చైక చైతన్యాయ నమోనమః
" ఓఙ్కార చారునగరాధీశ్వరాయ నమోనమః
" ఓఙ్కారో పవనక్రీడా తురఙ్గాయ నమోనమః
" ఓఙ్కార విపులాఽరణ్య మృగేన్ద్రాయ నమోనమః
ఓమ్ ఓఙ్కార నటనాగార నర్తకాయ నమోనమః

ఓమ్ ఓఙ్కార వటబీజస్థ న్యగ్రోధాయ నమోనమః
" ఓఙ్కార కల్పలతికాస్తబకాయ నమోనమః
" ఓఙ్కార సౌధవలభీకపోతాయ నమోనమః
" ఓఙ్కార లీలాశైలేన్ద్ర బర్హిణాయ నమోనమః
" ఓఙ్కార భిత్తికాదివ్య చిత్రకాయ నమోనమః
" ఓఙ్కార గోపురమణి కలశాయ నమోనమః
" ఓఙ్కార ధ్యానసంలగ్న మానసాయ నమోనమః 28

## న

ఓమ్ నవచక్ర మహాపద్మ సంస్థితాయ నమోనమః
" నవలిఙ్గ మయాకార శోభితాయ నమోనమః
" నవకోటి గణారాధ్య పాలకాయ నమోనమః
" నవ నన్దీశ్వరాఽస్తోక పరీతాయ నమోనమః
" నవబ్రహ్మ శిఖోత్తంసనిజాజ్ఞాయ నమోనమః
" నవనీత మృదుస్నిగ్ధ మానసాయ నమోనమః
" నవాఽమృత రసస్వాదు వచనాయ నమోనమః
" నరనారాయణశ్రాన్త నిధ్యేయాయ నమోనమః
" నరలోకతమః ప్రక్షాళనాయ నమోనమః
" నగేన్ద్రతనయా ప్రాణవల్లభాయ నమోనమః
" నతాపద్వారిదవాత మారుతాయ నమోనమః
" నటనోత్సవసోల్లాస హృదయాయ నమోనమః
" నక్షత్రనాథ సాహస్ర భాస్వరాయ నమోనమః
" నఖాంశుచయ నిర్ధూత తారేశాయ నమోనమః
" నళినీదళ లగ్నామ్బు నిర్లేపాయ నమోనమః
" నమశ్శివాది మన్త్రాది దైవతాయ నమోనమః 16

## మ

ఓమ్ మహాకైలాస శిఖర నివాసాయ నమోనమః
" మహామోహామయవ్యాధి భైషజ్యాయ నమోనమః
" మహాదేవాభిధానైక రూపార్థాయ నమోనమః
" మహాలక్ష్మి నిధానాంఘ్రి పరాగాయ నమోనమః
" మన్దాకినీ సముల్లాస కపర్దాయ నమోనమః
" మధురాఽపాఙ్గవశగ స్వానన్దాయ నమోనమః
" మల్లికా ముకుళాకార రదనాయ నమోనమః
" మన్దస్మిత పరాభూత చన్ద్రికాయ నమోనమః
" మఞ్జులాధర విధ్వస్త బన్ధూకాయ నమోనమః
" మకరన్ద రసాసార వచనాయ నమోనమః
" మన్దార విటపస్పర్ధ దోర్దణ్డాయ నమోనమః
" మహోక్షకకుదాకార భుజాగ్రాయ నమోనమః
" మహీతల విశాలోరః ఫలకాయ నమోనమః
" మణిసోపాన సఙ్కాశవళీకాయ నమోనమః
" మమత్వ గ్రన్థివిచ్ఛేద విగ్రహాయ నమోనమః
" మఞ్జుప్రవాళ రుచిరపదాబ్జాయ నమోనమః 16

## శి

ఓమ్ శివాగమజ్ఞహృన్మఞ్చ మధ్యస్థాయ నమోనమః
" శివజ్ఞాన పయోరాశి రాకాఽబ్జాయ నమోనమః
" శివభక్తి లతామూల సుకన్దాయ నమోనమః

ఓమ్ శివాత్మ భావరాజీవ దినేశాయ నమోనమః
" శివలిఙ్గార్చనవ్యగ్రకామదోగ్ధ్రే నమోనమః
" శివాహృదయపఙ్కజభ్రమరాయ నమోనమః
" శివఙ్కర నిజార్తన్ద సమ్పూర్ణాయ నమోనమః
" శిశిరాంశు కరోల్లాస కిరీటాయ నమోనమః
" శిరీష మృదులాకార వామార్ధాయ నమోనమః
" శీతాంశు సూర్యదహన నయనాయ నమోనమః
" శిథిలీకృత సంసార బన్ధనాయ నమోనమః
" శిక్షితాఖిల కామాది ఘాతుకాయ నమోనమః
" శిఖరీన్ద్ర ధనుశ్శోభి కరాబ్జాయ నమోనమః
" శిఞ్జినీ భూత భుజగనాయకాయ నమోనమః
" శిలాకఠిన పాపౌఘ భిదురాయ నమోనమః
" శిఖణ్డి వాహనాధీన వాత్సల్యాయ నమోనమః 16

వా

ఓమ్ వాసుదేవైక వేద్యాంఘ్రి వైభవాయ నమోనమః
" వాణీశైకజ్ఞేయమూర్తి మాహాత్మ్యాయ నమోనమః
" వాసవాదిసుర శ్రేష్ఠవన్దితాయ నమోనమః
" వామదేవాది సిద్ధౌఘ సంవృతాయ నమోనమః
" వాలఖిల్యాదియోగీన్ద్ర పాలితాయ నమోనమః
" వాసిష్ఠాది పురాణోక్త ప్రాభవాయ నమోనమః
" వాజపేయాది సవన ఫలదాయ నమోనమః
" వారితాతను సంసార సన్తాపాయ నమోనమః
" వారణేన్ద్రాజినశ్రేష్ఠ వసనాయ నమోనమః
" వాఙ్మనోమాత్ర సంధిష్ట తత్వార్థాయ నమోనమః

ఓమ్ వాలాగ్ర శతభాగాఽతి సూక్ష్మాఙ్గాయ నమోనమః
" వాచాతీత మనోతీత మాహాత్మ్యాయ నమోనమః
" వాగ్భావ కలితానేక స్వరూపాయ నమోనమః
" వారాశితుల్య నిత్యైకస్వభావాయ నమోనమః
" వారాణస్యాది సుక్షేత్ర నివాసాయ నమోనమః
" వాసుక్యాదిమహాసర్పాలఙ్కృతాయ నమోనమః 16

యం

ఓమ్ యక్షనాయక దుష్ప్రాపవరదాయ నమోనమః
" యజురాది చతుర్వేద తురగాయ నమోనమః
" యజ్ఞధర్మతపోయోగ పథాధ్యాయ నమోనమః
" యజమానాద్యష్టమూర్తి రఞ్జితాయ నమోనమః
" యదృచ్ఛాలాభసన్తుష్ట బాన్ధవాయ నమోనమః
" యథేష్ట విషయాసక్త దుష్ప్రాపాయ నమోనమః
" యమాద్యష్టాఙ్గయోగస్థ సుగమాయ నమోనమః
" యన్త్రరూప ప్రపఞ్చైక సుప్రజ్ఞాయ నమోనమః
" యశోర్థ భుక్తిముక్త్యేక కారణాయ నమోనమః
" యశ్ఛన్దసేతి మన్త్రోక్త దైవతాయ నమోనమః
" యజనోద్యద సత్పక్ష శిక్షితాయ నమోనమః
" యమునా వీచికానీలభూ్రలతాయ నమోనమః
" యతీన్ద్ర మానసోద్యాన మయూరాయ నమోనమః
" యదురాడ్గర్వ కాంతార కుఠారాయ నమోనమః
" యథార్థ జ్ఞానసంపన్న విధేయాయ నమోనమః
" యక్షకర్దమ సంలిప్త సర్వాఙ్గాయ నమోనమః 16

శ్రీ సాంబసదాశివార్పణమస్తు - సమాప్తమ్.

(* పరమపవిత్రములూ, పాపహారములు నైన శివ పంచాక్షరీ మంత్రబీజములు ప్రతినామమునకు ఆదియందు వచ్చునట్లు కూర్పబడిన ఈ శివాఽష్టోత్తర శతనామములను ఉచ్చరించుచు ఎవరు భక్తిశ్రద్ధలతో శ్రీమన్మహాదేవుని లభించిన బిల్వపత్ర పుష్పాఽక్షతాదులచే నర్పించుదురో వారు సహస్ర కమలార్చనవలన కల్గుఫలమును పొందుదురు.)

— అథ ధూపమ్ —

శ్లో॥ "నిర్గుణస్యకుతోధూప" ఇతి సంగదితోఽపివా ।
సర్వపాతకసంహార! ధూపోఽయం ప్రతిగృహ్యతామ్॥

తా॥ సర్వపాతకహరా! "నిర్గుణస్వరూపుడవైన నీకు ధూపావసరము లేద"ని చెప్పబడినను, సర్వపాపసంహారకుడవగు నీకు సమర్పించు ధూపమును గ్రహించుము.

న॥ ఇమాగ్ం రుద్రాయ = అనాతురం ఓమ్ నమశ్శివాయ తత్పురుషాయ=ప్రచోదయాత్॥

మం॥ వసవస్త్వా ధూపయంతు గాయత్రేణ ఛందసాంగి
రస్వద్రుద్రాస్త్వా ధూపయంతు త్రైష్టుభేన ఛందసాంగి
రస్వదాదిత్యాస్త్వా ధూపయంతు జాగతేన ఛందసాంగి
రస్వద్విశ్వేత్వాదేవా వైశ్వానరా ధూపయంత్వానుష్టు
భేన ఛందసాంగి రస్వదింద్రస్త్వా ధూపయత్వంగి

రస్వద్విష్ణుస్త్వా ధూపయత్వంగి రస్వద్వరుణస్త్వా ధూప
యత్వంగి రస్వత్ ॥

మం॥ అర్హన్బిభర్షి సాయకాని ధన్వార్హన్నిష్కం యజతం
విశ్వరూపం ।
అర్హన్నిదం దయసే విశ్వమభ్వం నవాఽఓజీయోరుద్ర
త్వదస్తి ॥
శ్రీఉమా— నమః ధూపమాఘ్రాపయామి ॥

— భావన —

మూ॥ తేషామేవ సర్వదా స్వీకరణం ధూపః ॥
భా॥ సాధకుఁడు తన యింద్రియములను స్వాధీనపరచు
కొనుటే ధూపము
* ధూతాశేష మహాదోషచయో ౽గ ధప్రభావతః
పరమానంద జననాత్ ధూప ఇత్యభిధీయతే.
భా॥ సమస్త దోషములను తొలగించి పరమానందమును
బుట్టించుటవలన ధూపమని చెప్పబడుచున్నది.

— ధూపముద్రా లక్షణమ్ —

*శ్లో॥ సచ్ఛిద్రమఙ్గుళీనాం తు సమాశ్లిష్యాఽగ్రబంధనం ।
ఊర్ధ్వాంగుష్ఠౌతథాకృత్వా ధూపముద్రాం ప్రదర్శయేత్

తా॥ వామదక్షిణహస్తాంగుళ్యగములను రంధ్రములు కలుగునట్లు కలిపి బంధించి బొటనవ్రేళ్ళను ఊర్ధ్వముఖములుగానుంచి కలిపిన ధూపముద్ర యగును.

— ధూపద్రవ్యాణి —

*శ్లో॥ ఉశీరం చన్దనం కోష్టం కర్పూరం చాఽగరుం గుడం।
గుగ్గులుంచఘృతంచైవ ధూపద్రవ్యాణి చాపివై।
ధూపమన్త్రం సముచ్చార్య ధూపయేచ్ఛివ సన్నిధౌ॥
*శ్లో॥ ధూమస్యవ్యజనేనైవ ధూపేనాంగం విధూపయేత్॥

(ధర్మసింధు)

తా॥ వట్టివేళ్లు గంధంపొడి, చంగల్వకోష్టు, కర్పూరము, అగరుచెక్క, బెల్లపుముక్క, గుగ్గిలము, సమభాగముగా చూర్ణించి ఆవునేయితో కలిపి, ధూపమంత్రము నుచ్చరించి శివునికి ధూపము సమర్పించవలెను. (పొగవచ్చే ఆ వస్తువులు నిప్పులపైవేసి ధూపము వేయవలయును.) (అగరుపుల్లను త్రిప్పకూడదు. చేతితో పొగను చూపవలెను.)

— దశాంశ ధూపద్రవ్య విశేషః —

*శ్లో॥ గోరోజనం సకర్పూరం చన్దనాఽగరు గుగ్గులుం।
శంభురాణిత మహీసాక్షం ఘృతోశీరం సలాక్షకం।
దశాఙ్గమితి విజ్ఞేయం ధూపయోగే నియోజయేత్॥

తా॥ గోరోజనము, కర్పూరము, గంధపుపొడి, అగరుచెక్క, గుగ్గిలము, గవ్వపలుక సాంబ్రాణీ, మహిసాక్షి, వట్టివేళ్ళు, లక్కపలుకులు సమభాగములుగా చూర్ణించి ఆవు

నేతితో కలిపి ధూపము వేయువలయును. ఇది దశాంగధూపమనబడును.

— అథ దీపమ్ —

శ్లో॥ "తేజోరూపస్య దీపస్య కిమర్థ" మితి చావదన్।
దర్శయామి ప్రభో! దీపం మమాఽజ్ఞాన నివృత్తయే॥

తా॥ జ్యోతిస్స్వరూపా! "నిత్యతేజో విరాజమానుడవగు నీకు దీపముతో పనియేమి?" అని చెప్పబడినను నా యజ్ఞాన తిమిరము నశించుటకై దీప మర్పించుచున్నాను.

న॥ మృడానో రుద్రోత నోమయస్కృధిక్షయద్వీరాయ = రుద్రప్రణీతా। ఓంనమశ్శివాయ। ఈశానస్సర్వవిద్యానాం = సదాశివోమ్॥

మం॥ స్తుహి! శ్రుతంగర్తసదం = నివపంతుసేనాః॥
ఉమాసమేత శ్రీ... నమః దీపం దర్శయామి॥

— దీపముద్రా —

*శ్లో॥ సర్వాంగుళీశ్చ సంహృత్య। మధ్యమేద్వే ప్రదర్శయేత్।
హస్తయోరుభయోశ్చాపి। దీపముద్రా ప్రకీర్తితా॥

తా॥ వామదక్షిణహస్తాంగుళుల నన్నిటిని ముడిచి మధ్యాంగుళులను కలిపి చూపిన దీపముద్రయగును

— భావన —

మూ॥ పవనావచ్ఛిన్నోర్ధ్వజ్వలన సచ్చిదుల్కాకాశ దేహో దీపః॥

భా॥ బ్రహ్మతేజస్సమూహము వాయువుతో కలసి యూర్ధ్వ జ్వాలగా ప్రకాశించుచున్నది. అది ఆకాశమంతయు వ్యాపించినది. సాధకుని శరీరముగూడ బ్రహ్మతేజోమయముగా విలసిల్లుచున్నది. ఆకాశమునే శరీరముగా భావించి శరీరమందున్న చిత్కలను దీపాకారముగా భావించుట దీపసమర్పణము.

*శ్లో॥ దీర్ఘాజ్ఞానమహాధ్వాన్త! సంఘాతపరివర్జనాత్ ।
పరతత్త్వ ప్రకాశాశ్చ దీప ఇత్యభిధీయతే ॥

భా॥ అజ్ఞాన తిమిరమును దొలగించి పరమాత్మ స్వరూపమును ప్రకాశింపఁజేయుటవలన దీపమని చెప్పఁబడుచున్నది.

## — దీప సమర్పణ విధి —

*శ్లో॥ నేత్రాదిపాదపర్యన్తం వృత్తాకారేణ భ్రామయేత్ ।
త్రివృత్తం పఞ్చవృత్తంవా నవవృత్తం తథైవచ ।
అథశక్త్యానుసారేణ దేవదేవస్య భ్రామయేత్ ॥

తా॥ శంకరుని నేత్రముల వద్దనుండి పాదముల పర్యంతము వృత్తాకారముగా ప్రదక్షిణముగా 3 మారులు గాని, 5 మారులుగాని, 9 మారులుగాని శక్త్యానుసారముగా దీపము సమర్పించవలెను.

## — అథ నైవేద్యం —

శ్లో॥ "నిత్యతృప్తస్య నైవేద్యం కిమర్థ" మితి చేత్ప్రభో ।
సమర్పయామి నైవేద్యం మమాన్నాదిక సిద్ధయే ॥

తా॥ పరమేశ్వరా! "నిత్యతృప్తుఁడైన పరమేశ్వరునకు నైవేద్యము అనవసరము" అనెడి తత్త్వోక్తియున్నను నాకు అన్నాది సమృద్ధి కలుగుటకు నైవేద్యమును సమర్పించుచున్నాను.

న॥ మా నో మహాన్త = రుద్ర రీరిషః

ఓమ్ నమశ్శివాయ । సద్యోజాతం = నమః ॥

మం॥ కుమారశ్చిత్పితరం వన్దమానం

ప్రతినానామ రుద్రోపయన్తం ।

భూరేర్దాతారం సత్పతిం గృణీషేస్తు

తస్త్వం భేషజారాఽఽస్యస్మే ॥

ఓమ్ భూర్భువస్సువః । తత్సవితుర్వరేణ్యం = ప్రచోదయాత్

సత్యం త్వర్తేన పరిషించామి । ఉమా = నమః

నైవేద్యం సమర్పయామి అమృతమస్తు అమృతోపస్తరణమసి.

ఓమ్ సద్యోజాత ముఖాయస్వాహా,

ఓమ్ వామదేవ ముఖాయస్వాహా,

ఓమ్ అఘోర ముఖాయస్వాహా,

ఓమ్ తత్పురుష ముఖాయస్వాహా,

ఓమ్ ఈశాన ముఖాయస్వాహా,

మధ్యేమధ్యేపానీయం సమర్పయామి,

(ఇచ్చట ఈశ్వరవిషయమున సద్యోజాతాది ముఖము లందే అర్పణగాని ప్రాణాదులందుగాదు గాన ప్రాణాయ స్వాహాదు లననక్కరలేదు.)

— అథ ఉత్తరాపోశనం —

శ్లో॥ త్వయితృప్తే జగన్నాథ! జగత్తృప్తిర్భవిష్యతి।
తృప్తిం విదేహిమేపూర్ణాం పునరాపోశనం పిబ॥

మం॥ అమృతాపిధానమసి। ఉత్తరాపోశనంసమర్పయామి। హస్తౌప్రక్షాళయామి పాదౌప్రక్షాళయామి। శుద్ధాచమనీయం సమర్పయామి॥

తా॥ ఓ జగన్నాథా! నీవు తృప్తిని పొందినచో ప్రపంచమున కంతకు తృప్తికలుగును. నాకు సంపూర్ణమైన తృప్తిని కలుగజేయుము. మరల ఆపోశనమును స్వీకరింపుము.

— నైవేద్య ముద్ర —

*శ్లో। అనామాగ్రం స్పృశేద్దేవి జ్యేష్ఠాగ్రేణతు దేశికః॥
నైవేద్యముద్రా కథితా దేవానాం ప్రీతిదాయినీ॥

తా॥ అనామికయొక్క చివరిభాగమును బొటనవ్రేలి చివరిభాగముతో తాకిన నైవేద్యముద్ర యగును. ఈ ముద్ర దేవతలకు సంతోషమును కలిగించును.

— భావన —

మూ॥ సమస్త యాతాయాతవర్జనం నైవేద్యమ్॥

భా॥ ఇన్ద్రియములను, ప్రవృత్తినివృత్తి రహితములుగా జేసి స్థైర్యమును బ్రహ్మాకారవృత్తితో నుండుట నైవేద్యము. బ్రహ్మాకారవృత్తి బ్రహ్మానన్దానుభవమే.

— నైవేద్యకాలేఘంటానాదాది నిషేధః —

శ్లో॥ ఘంటానాదం తథావాద్యం నృత్యం గీతం తథైవచ।
నైవేద్యకాలేయః కుర్యాద్రౌరవం నరకం వ్రజేత్॥
(శైవాగమే)

తా॥ దేవునకు నైవేద్యము చేయు సమయమందు ఘంటానాదముగాని యితర నృత్యగీతవాయిద్య ధ్వనులుగాని చేయరాదు. అలాచేసినవారు రౌరవనరకము నొందుదురు.

— నైవేద్యసారగ్రహణం —

*శ్లో॥ కపిత్థస్య ఫలేసారం యథాకుఞ్జరభక్షణే।
తథానైవేద్యసారంతు దేవోగృహ్ణాతిమన్త్రితః।
అఘ్రాయపుష్పం భ్రమరో మకరన్దంచ పాస్యతి।
తథానైవేద్యసారంతు దేవోగృహ్ణాతిమన్త్రితః।
మేఘఆదిత్యకిరణైరవః పీత్వాఽభివర్షతి।
తథా నైవేద్యమశ్నాతి భక్తాభీష్టం ప్రయచ్ఛతి॥
(మరీచికల్పే)

తా॥ వెలగపండు మ్రింగి ఆ ఫలసారాన్ని ఏనుగు ఎట్లు గ్రహించునో అలాగునే మంత్రముల నుచ్చరించుచు నైవేద్యముచేసిన పదార్థసారాన్ని దేవుడు గ్రహించును.

తుమ్మెదపుష్పసారాన్ని ఘ్రాణమాత్రముచే ఏలా పానము చేయుచున్నదో మంత్రముల నుచ్చరించుచూ నివేదన చేసిన పదార్థసారాన్ని దేవుడు గ్రహించును.

సూర్యుడు తన కిరణములచే భూమిపైగల ఉదకములను గ్రహించి, మేఘుడై సస్యానుకూలముగా నెట్లు వర్షించు చున్నాడో ఆప్రకారముగనే భగవంతుడుగూడను భక్తుడు భక్తితో నివేదించిన పదార్థసారాన్ని గ్రహించి, ఆ భక్తుని అభీష్టముల నిచ్చుచున్నాడు.

*మం॥ యాభిరాదిత్యస్తపతిరశ్మిభిస్తాభిః పర్జన్యోవర్షతిః ॥

(ఉపనిషద్వాక్యం)

— మహానైవేద్య ప్రమాణమ్ —

*శ్లో॥ దశద్రోణైస్తునైవేద్యం - అష్టద్రోణ మథాపివా ।
దశద్రోణ సమంపుణ్యా - మాఢకేన విధీయతే ॥
విత్తహీనస్య భక్తస్య - నాఽప్రికార్యావిచారణా ॥

తా॥ 10 ద్రోణముల బియ్యముగాని, 8 ద్రోణముల బియ్యముగాని వండి శివునకు నైవేద్యము పెట్టవలెను. 10 ద్రోణములు నైవేద్యముపెట్టు శక్తిలేనివారు 1 ఆఢకప్రమాణ మగు బియ్యమువండి తగిన వ్యంజనాదులతో నివేదించవలెను. విత్తహీనులైన భక్తులు యథాశక్తిగా మహానైవేద్యము చేయ వలెను.

(4 ముష్టులు = 1 కుడవ, 4 కుడవములు = 1 ప్రస్థము, 4 ప్రస్థములు = 1 ఆఢకము, 4 ఆఢకములు = 1 ద్రోణము 4 ద్రోణములు = 1 శూర్పము)

ప్రస్థశబ్దస్య ఆంధ్రభాషాయాం శేరు ఇతి ప్రసిద్ధం।
(ప్రస్థమనగా శేరు) (ధర్మసింధువు)

— అథ తాంబూలమ్ —

శ్లో॥ "సదానన్దస్య తామ్బూలం వ్యర్థమి" త్యవదన్నపి।
తవదాస్యామి తామ్బూలం మమసంతోషసిద్ధయే॥

తా॥ ఈశ్వరా! "సదానందస్వరూపుడైన సర్వేశ్వరునకు తాంబూలముతో పనిలేద" నెడి వేదాంతసూక్తి యున్నను నాకు నిత్యసంతోషలబ్ధికై నీకు తాంబూల మర్పించుచుంటిని.

న॥ మానస్తోకే = విధేమతే, ఓమ్ నమశ్శివాయ, వామ
దేవాయ=నమః॥

మం॥ యావోభేషజా మరుతశ్శుచీని యాశంత మావృషణో
యామయోభు।

యానిమనురవృణీతాపితానస్తాశంచ యోశ్చ రుద్రస్య
వశ్మిం॥

ఉమా=నమః। తాంబూలం సమర్పయామి॥

— భావన —

మూ॥ అవస్థాత్రయైకీకరణం తామ్బూలమ్॥

భా॥ జాగ్రత్ స్వప్నసుషుప్తులను మూడు అవస్థలను తురీయావస్థావిలీనముచేయుటయే తాంబూల సమర్పణము.

— తాంబూల లక్షణమ్ —

*శ్లో॥ దృఢపూగసమాయుక్తం నాగవల్లీదళైర్యుతం।
ముక్తాచూర్ణాన్వితం పంచసౌగన్ధిక సమన్వితం॥

తా॥ "పిలీపోకలు, లేత తమలపాకులు, మంచి ముత్యముల చూర్ణము, పంచసౌగంధికములు కూడినది" తాంబూల మనబడును.

— పంచసౌగంధికములు —

*శ్లో॥ ఏలాజాతిఫలం జాతిపత్రిం వైదాక్షిణీత్వంచం ॥
లవఙ్గ సంయుతం పంచసౌగన్ధికమితీరితం ॥

(స్మృతివాక్యం)

తా॥ ఏలకులు, జాజికాయ, జాపత్రి, దాల్చినచెక్క, లవంగములు, పంచసౌగంధికము లనబడును.

— పర్ణసంఖ్యా —

*శ్లో॥ పఞ్చ సప్తాఽష్ట,దశ వా పర్ణానిద్వాదశాపిచ ।
పఞ్చసౌగన్ధిసంయుక్తంతామ్బూలంచోత్తమోత్తమం॥
తామ్బూలమర్పయేద్విద్వాన్ సర్వభోగప్రదంహితత్ ।
అన్యథాద్విజదైవేభ్యః తామ్బూలం నార్పయేదితి ॥

(స్మృతివాక్యం చరకః)

తా॥ 5-7-8 10-12 సంఖ్యగల తమలపాకులు, పంచసౌగంధికములతో పిలీవక్కలతోసమర్పించిన తాంబూలము ఉత్తమము. మరియు సర్వభోగప్రదము, బ్రాహ్మణులకుగాని, దేవతలకుగాని పంచసౌగంధికయుక్తమైన తాంబూలమునే సమర్పించవలెను అన్యథా యీయకూడదు.

— పూగసంఖ్యా —

*శ్లో॥ సౌఖ్యమారోగ్యమేకం చ ద్విపూగంనిష్ఫలంభవేత్ ।
త్రిపూగం సర్వదాశ్రేష్ఠమధికం నైవదూష్యతి ॥

(చరకః)

